# GHANAVRITHAM.

BY

KORADA RAMACHANDRA SASTRI GARU.

*Late Senior Telugu Pandit,*

Noble College, Masulipatam.

WITH

INTRODUCTION & NOTES.

BY

K. RAMAKRISHNAIYA, B. A.,



*Published by*

Korada Lakshmi Manoharam.

---

April 1917.

[*Price* 1—8—0

# పీఠిక.

ఈకవిచే రచియింపఁబడిన కొన్ని గ్రంథములు చాలకాలము క్రిందనే ముద్రితము లయ్యును కారణాంతరములవలన దేశమునందంతగా వ్యాప్తిఁజెంది యుండలేదు. ఈ "ఘనవృత్తము" నైతమిదివరలో నొకసారి లఘుటీకతోఁ బ్రకటింపఁబడి యుండుట యీకవియందభిమానముగల కొందఱికి మాత్రమే తెలిసియుండును. అట్టివారిలో మాస్నేహితులగు కొందఱీ గ్రంథమాంధ్రతాత్పర్యసహితముగఁ బ్రకటించిన, యత్కించిత్ జ్ఞానముగల సంస్కృతభాషాభిమానులందఱును గురుసహాయము లేకనే స్వయముగ నద్దానంగలుగు రసమును గ్రోల సమర్థులగుదురని చెప్పి ప్రేరేపించుటచే నీకార్యమునకుం దొరకొంటిమి దీనిని ముద్రించుట చాలకాలము క్రిందటనే మొదలుపెట్టఁబడినను ఎక్కువధనము కావలసియుండుటచేతను, నతర్కితములగు మఱికొన్ని యంతరాయములచేతను ముద్రణపూర్తియగుట కింతతడవయ్యె. ఇది కాళిదాసుని మేఘసందేశమున కుత్తరకథ యగుటచే నాగ్రంథపాఠకులెల్ల దీనినిగూడఁ జదువనుత్సుకులై యుందురను నమ్మకముతో నెట్లో ఈపునర్ముద్రణము నిర్వహింపఁబడినది. సంస్కృత శ్లోకములకు సరియగు నాంధ్రపద్యముల వ్రాసియిచ్చి మాకు సహాయంబొనర్చిన బ్రహ్మశ్రీ మల్లాది అచ్యుతరామశాస్త్రిగారి కనేకవందనముల నర్పించుచున్నాము. ఇదివరలోనే తత్కవికృత సంస్కృతాంధ్ర గ్రంథముల ముద్రణమునకై చాలధనము వెచ్చించి యుండుటచే, మఱికొన్ని గ్రంథముల వ్రాతప్రతులను ఖిలముగాకుండఁ గాపాడుటకు మాత్రమే సమర్థుల మగుచుంటిమి. గాని వానిని ప్రకటింపఁ జాలమైతిమి. కావున భాషాభిమానము వృద్ధియగుచున్న యీ కాలముననైన మహాజనులీ కవిచేరచియింపఁ బడిన సంస్కృతాంధ్ర గ్రంథముల నింకఁబ్రకటించుటకుందగు ప్రోత్సాహము నిచ్చెదరుగాక.

ఇట్లు,
కోరాడ రామకృష్ణయ్య.

# శ్రీరస్తు.

# ఘనవృత్తము.

## ఉపోద్ఘాతము.

శ్లో॥ బోద్ధారో మత్సరగ్రస్తాః ప్రభవస్స్మయదూషితాః
అబోధోపహతాశ్చాన్యే జీర్ణమంగే సుభాషితం ॥ భర్తృహరి.

శ్లో॥ కతిచిదనవబోధదుర్విదగ్ధాః
కతిచన సాధువిదోప్యతన్వసూయాః
కతిచన విరసాః కవిత్వపాకే
బతకవితాజనకస్యకించశాస్త్రా ॥శృంగారసుధార్ణవము॥

లోకములో పరికృష్టంబగు ప్రతిభకును, పరమదారిద్ర్యంబున
కు నత్యంతమైత్రియోయన్నట్లు, ఏదేశమందుగాని మహాకవులు పేద
కుటుంబముల జనియించి జీవయాత్రగడపుటకే యనేక కష్టముల పాల
గుట సాధారణముగ వాఙ్మయచరిత్ర లందెల్లయెడలఁ గానంబడు.
ఒక్కొకచో మహారాజులు, కవిజనబద్ధాదరులు, భోజులాంధ్రభోజు
లాయా దేశముల కలంకారములై వెలయుచుందురుగాక. మరియు
నాజన్మాంతము దారిద్ర్యపీడితులయ్యును స్వాత్మగౌరవరక్షణాధురంధ
రులగు పోతనాదులీదేశమున లేకపోలేదు. దేశమునరాజులెంతయౌదా
ర్యవంతులైనను, ఎంతరసజ్ఞులైనను, ఎంతసదయహృదయులైనను, వా
రియాస్థానములఁ బ్రవేశము దొరకకమున్నె ఎన్నియో కష్టములు గడువవ
లసియుండుటయు, వీరును స్వార్థపరులగుట నచ్చులనెడనసూయాగ్రస్తుల
గుచుండుటయు, నీమొదలగు దుస్సాధ్యంబులగు నభ్యంతరములుగల్గు
టంజేసి యాకవిశిఖామణులు స్వాతంత్ర్యదీక్షనే బూని "కావ్యకన్యకా
కూళలకిచ్చి యప్పడుపుకూడు భుజించుటకంటె సత్కవుల్ హాలికులైన
నేమి" యన్నమాటస్మరించుచు నట్టి మహారాజుల ప్రాపుఁ బడయకయే
స్వతంత్రజీవనమున నెట్టెట్లో కాలము వెళ్లించుచు, నెట్టికష్టములనైనఁ
గవితామృతాస్వాదనమున మఱచి మహానందాంబుధి నోలాడుచుం

దురు. మఱియు నొక్కొక్క కాలమున కవితయందలి రుచిమారుచుండు టచేతనో, పక్షపాతాదరబుద్ధి లేని వారగుటచేతనో, స్వానుభూతి లేక కవియాశయము గ్రహింప నేరని దుర్విమర్శకుల పాలఁబడుటచేతనో, కొందఱు మహాకవులు తమ మొఱయాలకించువారు లేక "జీర్ణమంగేసుభాషిత" మని యొక్కొక్కప్పుడు నిర్విణ్ణులగుచుందురు. కానివారి ప్రతిభయు, అప్రతిహతంబై వెలుఁగుచు యాంతశ్శక్తియు వారినాయాకవితోద్యమమునఁ బురికొల్పుచునే యుండును. ఒకవేళ విషమావస్థలమెలంగవలసివచ్చినచో శాంతంబగు బుద్ధిబలంబును దృఢంబగు మనోనిశ్చయమునూతగాఁగొని యాపత్సముద్రమునైనఁ దరించి, పరమానంద దాయకంబగు నాకవితాసామ్రాజ్యంబునందు నిరంకుశాధికారమున వర్తింతురు. ఈ సామ్రాజ్యము భావనాశక్తికల్పితము, దీననేలువారే మూర్ధాభిషిక్తులు. ఇందలి వస్తువులత్యంతరమణీయంబులు. రసగర్భితములు, పరమార్థోపదేశకంబులు. ఇచట నున్నంతవఱకు వీరిపైనిహికచింతలేవియు బాధింపఁజాలవు. ఇచట వీరికృత్యములు విధివిహితములుగాని మనుష్యమాత్రకల్పితములుకావు. వీరికల్పనలు ప్రకృతిప్రసిద్ధంబగు నీశ్వరసృష్టికి ప్రతిబింబములు. వీరిదృష్టికి మఱుగనునదే లేదు. ఇట్టికల్పాంతస్థాయియగు నీమహాసామ్రాజ్యమునకు చక్రవర్తులగు వీరికొకరి యాశ్రయమేల? ఎట్టిమహీధవులైనను వీరికి పాదనతులే. క్షణికంబగు నీభూసామ్రాజ్యముయొక్క సంబంధమువలననే శాశ్వతంబై నీభూభాగమున వెలయుచుండు. ఈసామ్రాజ్యముల రెంటికిని పరస్పరసంబంధమతినిబిడము. ఎంతమంది సార్వభౌములే కాదు సామంతరాజులును దమయాశ్రితులను కవిరాజుల శాశ్వతకీర్తి నందఁగొని లోకమునఁ బ్రఖ్యాతిఁగాంచియుండలేదు? వీరిప్రాపువలననే వారలోకమునకు స్మరణీయులగుచున్నవారనుట సాహసముకాదు. కావుననే,

శ్లో॥ జ్వలదుజ్జ్వలవాక్ప్రసరైః సరసంకుర్వన్ మహాకవిః
కావ్యంస్ఫుటమాకల్పమనల్పం ప్రతనోతియశః పరస్యాపి॥
తత్కీర్తిజనురసదన ప్రభృతిని నష్టైతథాహి కాలేన
నభవేన్నామాపి తతోయదినస్యుః సుకవయోరాజ్ఞాం॥

అనిమన పెద్దలు చెప్పియున్నారు. కాని యశ్శరీరస్థులగు భూపాలురయాదరణవలననేగద యే పల్లెటూరనో జీవనోపాధిలేక నిజదారసుతోదరపోషణార్థమై పాటుబడుచు కష్టజీవులై యేమూలనో యంతరింప వలసిన మహాకవు లెందఱో సుస్వాస్థ్యములం గాంచి చీకుచింత లేక వారికాలమంతయు యథేచ్ఛముగ కవితాసతిని సేవించుటయు వారి కృతులు దేశమున వ్యాపించి శాశ్వతకీర్తివడయుటయు సంభవించినది. అట్లయ్యు నిక నెందఱో మిగుల దుర్గమంబులగు నారాజనగరులం బ్రవేశము దొరకకుంటచే నెట్టెట్లో కాలంబుగడపి చనుటవలన నమూల్యములగు వారికృతులు వ్యాప్తిం జెందకుంటయు క్రమముగా నంతరించిపోంగా మిగిలినవి యీకాలమునం బసిబట్టి వెదకుచుంటచే నచ్చటచ్చట దొరకుటయు మనము చూచుచున్నారము. సామాన్యముగా మహాకవులును వారిప్రతిభయు వెంటనే యంగీకరింపంబడి లోకముచేం దగిన సన్మానముం బడయుట చాలయరుదు. అందు వెనుకటి మనదేశస్థితిలో జెప్పనదే లేదు. ఇంతకు వెనుక నెంతకాలము క్రిందనో ఆంగ్లేయదేశమున డాక్టరు జాన్సన్ (Dr. Johnson) వలెనే యంతకుమున్నే మనదేశమున నాత్మస్వాతంత్ర్యమును గౌరవమును పరాకాష్ఠతో నిలుపుకొనిన పరమభాగవతశిఖామణియగు పోతనామాత్యుండు, కవితకును, రాజాశ్రయమునకును గలసంబంధమును తెంగగొట్టివేసిన నీదేశజనులద్దాని గ్రహించుట కసమర్థులగుటచే గాబోలు. వాఙ్మయమున శాస్త్రీయాపేక్షతప్పదయ్యె. దీనికి రెండు ముఖ్యకారణములు గోచరించు. ఈదేశమున జనులకు సత్త్వము లేదు. పూర్వమునుండియు పారమార్థికచింతయు వేదాంతగోష్ఠియు నెక్కుడగుటచే నైహికకృత్యములయందుం గొంత యనాదరభావము గలిగియుండ, గాం క్రమమున నానాస్త్రవజ్ఞానము నైజమగు నాస్తిక్యము నంతరించుటచే నది దాంభికవ్రితముక్రింద నిగినది. కాని వీరు గతానుగతికముగం బూర్వపుటాచారములను పద్ధతుల ననుసరించుచు వచ్చుచుండిరి. ఒకానొకప్పుడొకచోట నూతన సత్త్వము బయలుదేరిన నది గొప్పయెడారిలో నీటిబుగ్గవలెనే యించుకసేపు జనులమనముల నలరించి తాను శాశ్వతకీర్తివడ

యుటేగాని సంఘమునంతనుద్బోధించుటకు సమర్థంబగుటలేదు. కావున సంఘభావము జాతిజీవనమును నవి మనవాగిలో నిప్పుడిప్పుడే మొలకలెత్తుచున్నవి. ఇట్టి సమయముల సంఘమునలేని నూతనాదర్శములు, అభ్యుదయ చిహ్నములు, తజ్జీవితాదర్శంబగు కవితకు మాత్రమెట్లువచ్చును. జాతిజీవితమునకును కవితకును సంబంధమునిత్యము ఏనాడు సంఘమున స్వాతంత్ర్యము ఆత్మగౌరవము అభ్యుదయేచ్ఛ మొదలగు నున్నతాదర్శములు వ్యక్తియొక్కయు మనములనాకర్షించియుండునో యానాడే కవితయు జీవముకలదై ప్రకాశించుచుండును. కాని నాడు ప్రతిభయు నూతనవికాసము లేక యారోగ్యము లేనివాని కుత్సాహశక్తివలెనే, క్షీణించుటంజేసి యత్కించిత్పాండిత్యబలంబున వెనుకటి మార్గముల వదలిపెట్టలేక యెట్లో యను కరింపఁజూచుచు నేవో కొన్ని జీవకళ లేని వికృతి రూపంబులగు కవితలమాత్రము వాడమించుచుండును. ఇట్టి పాండిత్యప్రకర్షయే ఫలముగా గలిగిన నీకవితలు సామాన్యజనులకు దురవగాహంబులగుటచే నీనికి నాశ్రయమొకటి యవసరము. మరియు దేశమున విద్యావ్యాప్తి తగినంతగ లేకపోవుటచేఁ గవితకును సామాన్యజనంబునకును సంబంధంబు తక్కువ. జనసామాన్యమొక కవియొక్క గుణదోషముల గ్రహించి, మండనఖండనాదిసామర్థ్యము గలిగియుండిన గవితకాశ్రయాపేక్ష తగ్గిపోవును. ఇప్పటికి చాలకాలమునుండి యాంగ్లదేశమున నొక కవితల్లజుని సామర్థ్యమునుఁగనుగొని వానిని నిలబెట్టునది సంఘముగాని రాజుల యాశ్రయముగాదు. మన దేశమందన్ననో సంఘమునకట్టి సామర్థ్యముగాని బుద్ధిగాని లేనేలేదు. కావున కవులు జనసామాన్యముయొక్క భావములను, ఆదర్శములను, సంఘోద్యమములను, జాత్యభ్యుదయమును, సంకీర్తనంబొనర్చి శాశ్వతంబగు కవితారూపంబున నెలకొల్పుటకు దగినంతయవకాశము లేకుండె. చిరకాలమునుండి దేశము పరరాజుల దండయాత్రలకుగాని యవిలేనప్పుడంతఃకల్లోలములకుగాని తావలంబై యుంటంజేసి దేశమందు సంఘీభావోద్యోగంబు నకుంనగు శాంతిచేకురలేదు. కావుననే వివిధంబులగు దేశభాషలమాట యటుండ నీదేశమున కంతకును

గౌరవనీయమై మాతృభాషయను చెప్పనొప్పి, యశేషంబగు హిందూవి జ్ఞానంబున కాకరంబైయున్న దేవభాష క్షీణించుటయు దద్వాఙ్మయము జూడఁ గాళిదాసభవభూత్యాదుల తరువాతకవులలో నెవ్వరును చాల మట్టుకు వారికృతుల ననుకరించుచుటేగాని, నూతనమార్గముల పొంత బోకుండుటయు గానవగు. దీనికి కారణమాలంకారికులు పెట్టినహద్దు ను మీరుటతగదనియో. లేక యానిబంధనల నతిక్రమించి క్రొత్తమార్గ ములఁ ద్రొక్కితమకవనపై పుణిచే జనులను మెప్పింపఁ దగిన ప్రతిభగల్గ మిచేతనో, కవులానాటినుండియుఁ దమయనమాన ప్రజ్ఞలనలవాటుపడి న కొన్నిమార్గములనే యుపయోగించి యాయావాఙ్మయ భాగములనే తమయపూర్వకల్పనలతో నింపివేసిరిగాని నూతనమార్గముల నేమియు చేసినట్లగపడదు. ఇందునకు మనవారికిఁ బ్రాచీనపద్ధతులందుగల యు త్యాదరమును, నూతనమార్గముల నిరసనబుద్ధియు, మరియు జాతియం దు జీవకళలేకుండుటయే ముఖ్యకారణములు. ఇంతకు చిరకాలము క్రిందటనే సంస్కృతము వ్యావహారిక భాషకాకుండుటవలన సామా న్యజనులకు దురవగాహంబగుచుండ, దానియందు కొద్దిమందే పరిశ్ర మముఁ జేయుచుండుటయు, వారును సాధారణముగా నగాధంబగు శాస్త్రాధ్యయనమందును వాక్యార్థంబులయందును వారిబుద్ధినంతనువ యోగపఱచుటచేతనో నవ్యకావ్య నిర్మాణమునకుందగిన ప్రతిభలేకుం టచేతనో యీభాషను కవితయంతరించినట్లున్నది. పండితులవాక్యార్థ ము లెక్కుడైనకొలది యెంతవారికైనను, స్వపాండిత్యప్రకర్షోద్ఘాట నా బుద్ధియు, స్వమతస్థాపనోద్యోగమును, దీనికిసాధనముగ పరావధూన నాచింతయు నధికమగుటచే, నీమధ్యనసూయాపిశాచమొకటి పుట్టిపెరి గివారిని తనయిచ్చవచ్చినట్లు తైతక్కలాడించుచున్నది. కావున రస జ్ఞతయు, కవియొక్కయభిప్రాయమును గనుగొనఁ గుతూహలమును వారితోడి సానుభూతియు మొదలగునవి, విమర్శన కత్యవసరములగు కొన్నిగుణములు ప్రకాశము తగ్గియున్నవి. కావున నొకవేళ నేమూ లనైన సహజకవితాప్రసారము గల్గెనేనియు నదిమహారణ్యంబున నెల యేటిచాడ్పున నేమూలనోయడఁగియుండి క్వాచిత్కంబుగ తనరమణీ

యకంబుచే నాకృష్టంబగు నొకానొకరసజ్ఞుని మనంబునలరఁ జేయవల
సినదే గాని ప్రస్తుతప్రదేశస్థితినిబట్టి సద్విమర్శకుంబాత్రంబై యుచితస
త్కారముంబడయు ననుటకు వీలులేదు. కానియంతమాత్రమున నా
కవులు నిర్విణ్ణులగుటగాని, యాకవిత గుణశూన్యంబగుటగాని తటస్థిం
పదు. ఏలయన నాకవి తనసమకాలీనులఁ గొందఱ నేవిధంబుననైన సం
తోషపెట్టి యేదోస్వల్పలాభముం బొందవలెనని వ్రాసెనా? యదివా
ఙ్మయమున శాశ్వతంబగు స్థానంబునందుననుట సంశయము. లేకయా
కవి కవిత్వాదర్శములఁ గుర్తెఱింగి తన ప్రతిభనుపయోగించి యుద్రేకా
యత్తచిత్తుండై తాజేయునది యీశ్వరేచ్ఛాచోదితం బనియెంచిపరు
లదూషణ భూషణాలెక్కింపక తనహృదయము పొంగిపొరలునపుడు
యనుభవజ్ఞానమును భావనాశక్తిరూపము సౌభాగ్య గరిమయొప్పునట్లు
ప్రదర్శించుచు తత్సమకాలముననే పరమార్థోపదేశంబు సేయుచు,
చదువరుల మహానందాంబుధి మగ్నులుగఁ జేయుటచేతనే తన
జీవితమును సార్థకము నొందింపఁ జూచెనా వాని కేచింతయును
లేదు అతఁడు తనహృదయము భావనిర్భరమగుటచే వ్రాసెనేగాని
దానివలన ప్రతిఫలమపేక్షించికాదు. అట్టివారేయొకరసజ్ఞుఁడైన నేకా
లముననైనఁ జూచియానందించినఁ జాలునని తలంతురు. కాని వీరి
యసమాన పాండిత్యమును బ్రతిభను గ్రహించుటకుం దగిన శక్తిలేక
ఆడలేక మద్దెలయోడన్నట్లు తాము గ్రహింపలేనిదానియందు దోషా
రోపణ జేయుచు నద్దానివలన లోకము ననుత్కర్షఁ బడయఁజూచెడి
సానుభూతి లేని దుర్విమర్శకుల పాలఁబడుటకుగాని రసజ్ఞులుకాని పండి
తులచే జిక్కుటకుగాని వారిష్టపడరు. మఱియు మనమిప్పుడు ప్రాచీన
గ్రంథపుంజముల సంచయార్థమై ధనము వెచ్చించి వానిని ప్రకటించి
యుత్తమ గ్రంథముల రసము గ్రోలి యింతకాలము మాటువడియుండి
న కవితల్లజులఁ గొనియాడుచున్న రీతినే యేకాలముననైన నాకవితా
రసమును సానుభూతితో గ్రహింపఁగల్గువాఁడొకఁడైనఁ జూచిన జాలు
ననియే.

శ్లో॥ యేనామకేచిదిహనః ప్రథయంత్యవజ్ఞాం
జానంకి తేకిమపితా న్ప్రతినైషయత్నః
ఉత్పత్స్యతేమమతుకోపి సమానధర్మా
కాలోహ్యయంనిరవధిర్విపులాచపృథ్వీ॥

అనుభవమువలన భవభూత్యాది మహాకవుల యుక్తి ప్రమాణమై యుండనోపు. కావున నే ప్రకాశతయు, లోకప్రియతయు వ్యాప్తియు సత్కవితకు ముఖ్యశోధకములు కావని యాంగ్లేయ మహాకవియగు కార్లైలు (Corlyle) చెప్పియున్నాడు. కాలక్రమమున వాఙ్మయమునం దభిమానము హెచ్చినకొలంది సద్విమర్శకులు బయలుదేరినకొలంది కవితయందు సద్గుణంబులు రసంబులుగల్గియుండుటయు సద్భావముండుట జనులకాదరము గల్గుటయు వాఙ్మయమున నొక కవియొక్క స్థానమేర్పడుటయును సంభవించుచుండును. కావున నట్టి కవితల్లజాలను విమర్శకాగ్రేసరులును బయలుదేరి దేశజనులఁ గవితారసాస్వాదలోలురఁగఁ జేసి జ్ఞానాభివృద్ధికిని వాఙ్మయాభివృద్ధికిని తోడ్పడుచుందురుగాక. కడచినశతాబ్దములో మన యాంధ్రదేశమున నాంధ్రగీర్వాణముల సమానపాండిత్యము గలిగి యుభయ భాషలయందు నింత ధారాళముగా కవిత్వముచెప్పి గ్రంథములు రచించుటేగాక యాంధ్రమునఁ గ్రొత్తమార్గములఁ దీసినవారలలో నీగ్రంథకర్త యగ్రగణ్యుఁడని చెప్పుటకు సంశయము లేదు. కావున నీయనజీవితచరితను, వైదుష్యమును, కవిత్వశక్తిని గూర్చి యిచ్చట కొంచెము ప్రసంగించెదముగాక.

ఈ మహాకవి కౌండిన్యసగోత్రుఁడు. ఆపస్తంభసూత్రుఁడు. ఈకౌండిన్యమహాముని గోత్రమునుండి యుద్భవించిన కోరాడాన్వయమునకు మూలపురుషుఁడు మహాదేవుడని యీకవియే చెప్పియున్నాడు.

శ్లో॥ కేశవనిధ్యానవిశుద్ధాంతర తాప్రవృత్తితోవిశతః
కోరాడ ఇతిచసంతతిర భవత్తస్యామభూన్మహాదేవః
ససర్వశాస్త్రప్రభవైకరూపక శ్రీదేవతాపాదసరోజబంభరః
స్వస్యాన్వయోత్పన్నజనుష్మతాంమనా గ్విమూఢతా నోచితమి
త్యవేత్యసః॥

శ్రీశైలగో తే భ్రమరాంబికాంతే
మాలూరపత్త్రైర్నిశిరసైశ్శితాహృతిః
శర్వాక్షివిక్షయిమితేరనారతం
చక్రే ద్వ్యుతం త్ర్యద్వతి ఋక్షస్థైర్యకం॥

ఈమహాదేవశాస్త్రి సర్వశాస్త్ర పారంగతుడై తనవంశమునంతను గూడనట్టి జ్ఞానసూర్యునిచేఁ బ్రకాశింపఁ జేయవలయునని మొంది శ్రీశైలపర్వతమున భ్రమరాంబికా ప్రసాదమునకై ఎండుమారేడు దళములుప హారముగ జేసికొని తపంబొనర్చి నినువదియేడు దినంబులు గడచినతోడనే వానినియమంబున కామంబ సంతసించినదై నీవాంఛితముం దెల్పుమనిన.

శ్లో॥ సర్వంహ్యకృప్తస్యవశంహికామం । విద్యాస్తిచేత్సర్వవిపన్నివృత్తిః
తయాప్యతేసర్వజనేషుమాన్యతా। యయేయతేసౌఖ్యమజస్రగమ్యం॥

శ్లో॥ రాజానోబహుమానయంత్యయమివాజస్రం ద్రవద్రవ్యత
స్సేకాజ్ఞాతవికం గణాపకినకం సత్సాంగడికేంపూపషం
తేనాత్యంతసుఖీభవత్యవిరతిం యాచేనతత్సంపవో
హేలాజాలవశీకృతే ప్రియతమే చాకావికోద్భాసినీః॥

శ్లో॥ యాచేభగీరథరథానుగజహ్నుకన్యా
ప్రోద్యన్మఘీసహచరీ భవనప్రకాండాం।
విద్యాంవిశేషిదయయామృతసారవత్యాం
హాస్యప్తమాన్మమ కులోద్భవ పూరుషాణాం॥

విద్యగలిగిన నన్నిసంపదలును, మాన్యతయు తమంతట తామే వచ్చునుగానఁ దనవంశమేడు పురుషాంతరముల వఱకు పండితులకాల వాలమైనెగడవలయునని కోర నావెయు వల్లెయని యట్టివరంబొసంగె నట. అప్పటినుండియు నీవంశము పండితశిఖామణుల కాకరంబై వె లయుచుండ నీమహాదేవశాస్త్రి వెనుకఁ అల్లాడ శాస్త్రియను నా యన సకలకలాపారంగతుండయ్యుఁ బనులకుఁ జెయ్యిజాచుట కిష్టములే క దరిద్రావీడితుండై యెట్లులో దినములుగడుపుచుండె. అంతనీయనవష ష్టిపూర్తిజేసికొన నిచ్చగలవాఁడౌట నాగ్రామజనులు కనిపెట్టి యా

యనచేనొక శతఘంటావధానము చేయించిరట. ఈసమయమున నేయీ యన "శతఘంటికచూడామణి" యనుబిరుదు వడసెనట మఱియు భూపరిగ్రహణంబున కైన సీయుల్లంఘించిన నచ్చటివారీయనను బల వంతపెట్టి, కన్యను విద్యను భూమిని పరిగ్రహించిన నదోషము లేదని యు, దీనివలన నాయనయొక్క అపరిగ్రహత్వమునకు భంగమువాటి ల్లదనియుఁజెప్పి యీయనకొకప్రక్కటుమ భూమినిచ్చిరట. ఈయల్లాడశా స్త్రిచెప్పిన యీశ్లోకమొకటి తనమాతామహునివలన వినియెనని యీ రామచంద్రకవి చెప్పియున్నాఁడు.

శ్లో॥ కమలసమశయాంః పాద్విరాహాశయాన
స్వభరణవశయానః ప్రోష్ఠిశోసంశయానః
వరమధిశయానఃక్షత్రపాశాశయానో
పృధిజలధిశయానఃపాతుపక్షీశయానః॥

ఈఅల్లాడశాస్త్రి కుమారుడు. జగన్నాధశాస్త్రి అనునాయనను "నిజాంతర్వాణిత్వ ప్రథిమవిధుతాశేషవిభవా విరాజంతే కీర్తిస్థగిత సకలాశాంతవివరాః" ఇట్లు దిగంతవ్యాప్తమగు కీర్తిగలవానిగాఁజెప్పు చున్నాఁడు. ఈజగన్నాధశాస్త్రికిద్దరుకుమారులు. అందుపెద్దవాఁడుసూ రిశాస్త్రిఅనునాయన వారణాసికేతెంచి గౌతమతర్కమున నఖండపాండి త్యము సంపాదించెను. ఈయనకు సంతతిలేదు. రెండవవాఁడగు సంబా వానునకు సూరిశాస్త్రి, లక్ష్మణశాస్త్రియనునిద్దరు కుమారులు. ఇందు సూరిశాస్త్రి వేదాధ్యయనంబొనర్చి శాస్త్రాధ్యయనంబునకై యభిలషిం చుచుండఁ దండ్రిగతించుటయు, దేశముక్షామపీడితంబగుటయు సంభ వించె. అంతవీరితల్లి బిడ్డలనిద్దరదోడ్కొని గతిలేనివారికి రాజేగతియ నితలంచి కాటిరేవు కోనరాజు యొద్దకుం బోవుచుండ దోవలో దొంగ లడ్డమువచ్చి తల్లినిపెద్దకుమారునిని హతులజేసిరి. అంతరెండవవాడగు లక్ష్మణశాస్త్రియెట్లో యారాజునొద్దకుంజేరి వానియాదరముంబడసి యొక యుద్యోగమునందుండి కొంతకాలమున కారాజునకు సోదరుల తోభేదంబువొడముటయు నీలక్ష్మణశాస్త్రియిఁకనచ్చటనుండఁగూడదని తలఁచి యారాజుతనకిచ్చెదనని వాగ్దానము జేసిన నాలుగువేలరూప్యం

బులంగొనకయే యాయూరునదలి దేశాంతరమున నాయాపట్టణముల దిరుగుచు నెచ్చటనో యొక యోగీంద్రునివలన శ్రీరామతారకమంత్రోపదేశము పొంది గొంతకాలమునకు స్వదేశమునకువచ్చి వివాహముఁజేసికొని యత్తవారింటనే యుండెనట. ఈయన కుమారులు ముగ్గురు, అందు పెద్దవాఁడీగ్రంథకర్తయగు రామచంద్రకవి, రెండవ వాఁడు రామకృష్ణశాస్త్రి. మూఁడవవాఁడు సుబ్బరాయుఁడు. రెండవ వాఁడగు కృష్ణశాస్త్రి బాల్యమున చదువునందాసక్తిలేక తిరుగుచు నొకనాఁడన్నగారిచేఁ జెంపపెట్టుఁడిని మిగుల రోషముతో నిల్లువెడలి యచ్చటచ్చటఁ దిరుగుచుఁ దుదకు వారణాసిజేరి శాస్త్రాధ్యయనము మొదలుపెట్టెను. అంతనొక సంవత్సరమునకే వ్యాకరణశాస్త్రమున పరిస్రాన్నపాండిత్యము గలిగి శాస్త్రచర్చలుఁ జేయుచుండెనని యింటికి ఉత్తరములు వచ్చినవట. మఱియొకవత్సరము గడచునప్పటికి న్యాయశాస్త్రము మొదలుగాగల వానియందుగూడ స్వాతంత్ర్యము సంపాదించి యచటి పండితులనెల్ల నాకాశీమహారాజు నెదుట సభలో నోడించెనట. ఇట్టి ప్రఖ్యాతిని నామేధావిషంబు నుత్తరముల వలన విని యచట నాతనియన్న మొదలగువారు మహానందముంజెంది వివాహప్రయత్నములం జేయుచుండిరట. కాని మఱికొంతకాలము గడచునప్పటికి మహారాజావారాస్థానపండితునిగాగైకొనితీసికొనివెళ్లెనని యు నచ్చటికిఁ బోయిన కొద్దికాలముననే హఠాన్మరణము సంభవించెననియు వినవచ్చె. అంత నీరామచంద్రకవికింగల్గిన సంతాపమింతింతని చెప్పనలవిగాదు. అప్పుడు దుఃఖముచే మైమఱచి వీధులఁబడి దొర్లనారంభించెనని అప్పుడు చూచినవారు చెప్పుచున్నారు. ఈరామచంద్రకవి జన్మించినది వెనుకటి యువసంవత్సర ఆశ్వయుజ శుద్ధదశమి. గోదావరిజిల్లా అమలాపురం తాలూకా కేశనకుఱ్ఱుగ్రామములో బాల్యమున మాతామహులయింటనే పెరిగియచ్చట పండ్రెండవయేటనే తనతండ్రియొక్క శ్రీరామమంత్రోపదేశముబొంది మిగులనాసక్తితో పురశ్చరణసేయుచుండెను. అచటనే మాతామహునియొద్ద రఘువంశము మొదలిడిపిదప వాత సమీపమందున్న ద్వితీయగ్రామమైన నడవపల్లి

వచ్చి సోమయాజుల సూరన్నగారివద్ద విద్య నభ్యసించుచు నప్పుడప్పుడు శ్రీశిష్టు కృష్ణమూర్తిశాస్త్రిగారివద్ద నలంకార గ్రంథములు చదువుచు కవనమలవాటు జేసికొన్నట్లుగా వినవచ్చెను. ఈ సూరన్నశాస్త్రిగారితోఁ కావ్యపాఠము జదువుచుండ బాలముకుందం బోయి తిరిగి యింటికి వచ్చువంతలోఁ గొన్ని శ్లోకములనల్లి గురువుగారికి జెప్పు మని జూప నాయన యాశ్చర్యపడి, యాశ్లోకముల దిద్దుటకుఁ దావుతగియుండదనియు పెద్దలయొద్దకుంబోయిన కీర్తివితరుండగు ప్రోత్సాహము గలుగుననియుఁ జెప్పుచుండెడివారట. ఈ ప్రోత్సాహము శ్రీమహాకవి కృష్ణమూర్తిశాస్త్రిగారి వలన గలిగియుండె. పిదప గంగా ప్రవాహంబోలు నీమహాకవి కవితాధారయే యీ రామచంద్రకవి కవితాప్రవాహిని కుద్బోధ కారణమై యుండుననుటకు సంశయముండదు.

శ్రీశిష్టవంశాబ్ధి శిశిరకరుడు సకల విద్యాజన్మ సద్మాయమానజిహ్వాంచలుడమిత కావ్యాలికర్తయయిన శ్రీకృష్ణమూర్తి పదాబ్జసేవనాత్త సద్గ్రంథ కల్పనావిస్తృతమతి విరచిత శ్రవ్యదృశ్యాత్మ వివిధకావ్యుడు ఇట్లు కొంత కాలమైనతరువాత నాయన స్నేహితులు కొందఱీయనను వివాహప్రయత్నము జేయుట లేదేమి యనియు,

శ్లో॥ త్వంసాహిత్యపరోసిసాధుకవితా ధుర్యోసి తేవాగ్మితా
సిద్ధా ప్రవ్రజ చెన్నపట్టణపురీం విద్యాలయే హాయాణకాః
అధ్యాప్యాస్తతమాయవిత్తబహులం దత్వాపరార్థంపరం
తేనస్యాత్తవసత్కళత్రవిభవ స్తస్మాదహైతత్కురు॥

నీతండ్రి దరిద్రుఁడు గావున నీపాండిత్యముచే చెన్నపురి కేఁబోయి ధనము సంపాదించి వివాహమాడుమని సలహా జెప్పిరట. ఇట్టి స్నేహితుల ప్రోద్బలంబున సంపాదనకై బయలుదేర నుద్యుక్తుండై యుండుసమయమున బ్రహ్మశ్రీ శిష్టు కృష్ణమూర్తిగారీయన కవిత్వముం దత్వాదరముకలవాఁడు గాన నీయని యుద్దేశము విని నతోడనే తనకుఁ జిరపరిచితులగు రామచంద్రపురం రాజుల యాస్థానంబునఁ బ్రవేశమునకై యొక లేఖను వ్రాసి దీనివలన నీకార్యము

సఫలమగునని చెప్పి తత్క్షణమే యొక భటుని చేతికిచ్చి పంపెనట. అంతట నీయుత్తరముం దీసికొని బయలుదేరిపోఁగా దేశమున గాలి వానలుపట్టి క్షామము సంభవించెననియుఁ గావున నాచా జీయనను రెండుమాసములు తన యాస్థానమందుండిన సలుపైనిఁ జూచెదనని యుఁ జెప్ప, నచట నిలువనొల్లక చెన్నపట్టణమున పండితులకు మునస ఫీపనిని ఇచ్చుచుండిరను వదంతి యచ్చటవిని తత్సంపాదనోద్యుక్తుఁడై బయలుదేరి దారిలో బందరు (మచిలీ) పట్టణముం జేరెను ఇచ్చటికిఁ జేరు నప్పటికి తెచ్చిన సొమ్ము వ్యయమయి యొకటి దినముభోజనము లేకుండు టచేఁ గడుంగడు డస్సియున్నను గొత్తదగుటచేతను, ఆత్మగౌరవము స్వాతంత్ర్యమెక్కువ పాలుండుటం జేసి సహజంబుగ యాచనా విముఖుండగుటవలన నేమియుఁ దోచక గొడుగుపేట మల్లేశ్వరస్వామి యాలయముం జేరి కొంత విశ్రమించి సాయంకాలమగునప్పటికి నీశ్వరస్తుతి రూపంబులగు కొన్ని శ్లోకంబులఁ జదువుచుఁ గూరుచుండెనట. అప్పుడా వారినిఁ బోషించుచుండిన ప్రభల అన్నప్పశాస్త్రిగారి వాగ్జాలమును విని యాశ్చర్యపడి యాలయములోనికిఁ బోయి మీరెవ్వరని ప్రశ్నింపఁ నెవ్వరైన నేమి కార్యమనియెనట. ఈయన బలవంతపెట్టి యడుగగాఁ దాను చెన్నపట్టణము బోవనిచ్ఛయుఁ దెచ్చిన సొమ్ము వ్యయమగుటచే నందున నీశ్వరసాన్నిధ్యముం జేరుటయుఁ దెల్పెను. అప్పుడా శాస్త్రిగారీయన కవిత్వధారకును స్వతంత్రబుద్ధికి నాశ్చర్యపడి వాత్సల్యముతోఁ గద్దించుచు నచ్చటనొ యొకపూటభోజనమునకై యెవరినయిన యాశ్రయింపలేనివాఁడవు పట్టణముపోయి మునసఫీ సంపాదింపగలవా లెమ్ము లెమ్మని యనుచు దనగృహంబునకుం దోడ్కొని పోయి భార్యనుఁ బిలిచి యీతనిఁ బుత్రవాత్సల్యముతోఁ జూడవలయునని చెప్పి యొప్పగించెనట. ఇచట కొంతకాలముండియు దరువాత వారములజేసికొనియు నింగువ రామస్వామి శాస్త్రులవారియొద్ద గొన్ని మంత్రశాస్త్రగ్రంథములఁ జదువ మొదలుపెట్టి వీరందరి ప్రోద్బలముచే చెన్నపట్టణ ప్రయాణమునుండి విరమించెను. తరువాత తరుచుగా నీయన్నప్ప శాస్త్రిగారింటనేయుండ నాయన వివాహ

ముచేయవలెనని తలఁచెగాని సాగియుండలేదు. వర్తం అద్వైతపరబ్రహ్మశాస్త్రిగారీయనవివాహము నిమిత్తమై నూరు రూప్యంబు లీయఁదలఁచి యించుక వాక్యార్థము సల్పుమనగా, నాసమయమున నీయన శాస్త్రిగారితో నొక యంశమున నేకీభవింపక తనకు సహజంబగు ధైర్యముతో నాయన వాదముదుర్బలమని సమర్థింప నాయన కోపగించి చేయదలఁచిన సహాయమును జేయనొల్లకపోయె. అప్పుడీయన స్నేహితులు కొందఱు ఫలోన్ముఖంబున శాస్త్రిగారితో నిష్ఠిభేదంబు కార్యసాధకము కాకుండుటచే వారివాదము నెట్లో యంగీకరింపుమని చెప్పిరిగాని యామాటల కీయన లక్ష్యపెట్టలేదు. తుదకెట్లో స్నేహితుల ప్రోద్బలంబున శాస్త్రిగారి బుద్ధి తిరిగి వివాహార్థమై నూరురూప్యంబుల నిచ్చిరట ఈధనముతో నీయన వివాహమునకై స్వదేశమున కేగెను. దారిలో నమలాపురమున గొడవర్తి నాగేశ్వరావధానులుగారీయన ప్రఖ్యాతినివిని కన్యనిచ్చెదనని చెప్పగాఁ దలిదండ్రుల యనుమతికై స్వస్థలమగు నడవపల్లికిం జనె. ఈకవి యిల్లుచేరిన వార్త గ్రామమున విననచ్చినంతనే యాప్తులానందమున్ జెందిరి. గాని మఱికొందఱీతండింతలో నింతవాడయ్యెనా యని యసూయాపరులై యొకదినమున స్నానమునకుఁ బోవుచుండ నీయనకడ్డమువచ్చి నీవు కవిత్వము చెప్పుదువట యవధానము చేయుదువాయని ప్రశ్నించిరట. ఈయన వారి యాతురత కాశ్చర్యపడియు నట్లుకానిండని చెప్పి భోజనానంతరము కూర్చుందమని యెనట కాని వారు దానికొల్లక నీవందుకు సమర్థుఁడవైతివేని యీనిలుచున్నట్లేచెప్పి కదలుమని చెప్పగా లేఖకులఁ బిలుపింపుమనయెను అప్పుడా యూరనున్న వారందఱినిఁ బిలువ నరువదేడుగురు ఘంటము లాకులతోవచ్చి యాసమీపముననున్న నడవపల్లి దేవాలయములో సమావేశమైరి. వెంటనే యొక్కొక పాదము చొప్పున చెప్పుట మొదలుపెట్టి సూర్యాస్తమయమగు నప్పటికి 107 పద్యములముగించెను. అచటనొకరు దీనికాశ్చర్యపడి యింకను చెప్పెదవాయని యనుగఁ "జెప్పెదను. ఈతకులో తేమిటియని" యన్నట్లుచ్చుటనుండినవారు చెప్పుచున్నారు. ఈశతావధా

నముఁజూచి యాశ్చర్యముఁ జెందినవారిలోఁ గొందఱుకలసి నలువది రూప్యంబుల నాయనకొసఁగిరి. మఱియొక కోమటి యీయన వివాహార్థమై యక్కఱగా నలువదిరూప్యము లప్పిచ్చుటకు మాత్ర మొప్పుకొనెను. వివాహమైన తోడనే యీయన దీనికై చేసిన ఋణము దీర్చుటకుగాను సంపాదనార్థమై గోలకొండ సంస్థానమునకు వెళ్లవలయునని తలఁచి మరల బందరుఁ జేరిరి. ఇచటికి వచ్చినతోడనే పూర్వపరిచితులు న నోబిల్ పాఠశాలయందు పండితులుగానున్న పసుమర్తి ఉమామహేశ్వరశాస్త్రిగారు పాఠశాలాధ్యక్షులు మఱియొక పండితునికై వెదకుచుండిరిగాన నీయన గోలకొండ ప్రయాణమైనను నాపి పాఠశాలయందుఁ బ్రవేశపెట్టు ప్రయత్నముం జేయవలయునని అన్నప్పశాస్త్రిగారితోఁ జెప్పిరి. వీరు నీయన స్వభావమును బాగుగ నెఱింగియుండిరి గాన నీకు రాజులయాశ్రయము వలదు నీ నేర్పును నొకరినియాచించి ధనము సంపాదించుటకు వలయుతంత్రజ్ఞానమును, తక్కువ గావున సత్త్రిపోకడల మానుమని చెప్పి బలవంతపెట్టి యాపినోబిల్ దొరవారితో నీయన విషయము చెప్పి న పాఠశాలలో నెలరూప్యంబుల వేతనమిచ్చి క్రమముగా వృద్ధిఁ జేయుదుమని చెప్పి యాదొరవారీయనను జేకొనిరి. అది మొదలాపాఠశాలయందొక్క రీతిగా నలువది మూఁడేండ్లధికారుల మన్ననవడయుచు నాత్మగౌరవస్వాతంత్ర్యముల నిల్పికొనుచు తుదకా పాఠశాల కళాశాలగా మారుటయు నద్దానియందాంధ్రప్రధానోపాధ్యాయపదవినంది నలువది మూఁడేండ్లుపనిచేసి కాలక్రమమున వేతనము నలువదిరూప్యంబులుగాఁగ దమకాలమునంత నధ్యాపనమునందును గ్రంథరచనయందును బుచ్చుచు తమజీవితమును సుఖముగా వెళ్లించి. క్రీ. శ. 1900 సంవత్సరమునకు సరియైన శార్వరి సంవత్సర శ్రావణ బ॥ సప్తమియందు లోకాంతరగతులైరి. ఈపాఠశాలయందు వీరున్నంతకాలము దొరలందరును వీరినతిగౌరవముగనే జూచుచువచ్చిరి. మిషనరీలలో స్వమతస్థాపనోద్యోగమే గాని పరమతదూషణాచింతయంతగా లేని యాకాలముననే మతస్థులా మతధర్మములను పట్టు

లవారు రామచంద్రకవిఁగూర్చి చాలవినియుండియు నసూయచేఁగాఁ బోలును. కాలేజీలోనప్పుడు విద్యార్థులైన వెచ్చా గోపాలకృష్ణమ్మగారు ధర్మపురి గార్లచేతఁగొన్ని సమస్యలను

శ్లో॥ చింతకాయక లేకాయ బీరకాయతమూరికే
 ఉచ్చింత కాయశాకాయ సాధకాయతమాంజలిం॥

ఇట్టి శ్లోకములనిచ్చి రామచంద్రకవిని సద్దేశించి పండితుఁడైవఁడైఁ ననుండినయర్థము వ్రాయించుకొని తమ్ముని యూరగాఁ వానిఁ బూతిఁజేసి యర్థముల ననేకేతులఁగుప్పి వ్రాసియిచ్చి తానుతిరిగి

శ్లో॥ కమలసమయానః పాద్విరాపాశయాన
 స్వ్వ భరణవశయానః ప్రాస్థిలోసంశయానః
 వరమధికశయానః క్షత్రపాశాశయానో
 వ్యధిజలధిశయానః పాతుపక్షీశయానః॥

యనువాని పూర్వార్ల శ్లోకములు

శ్లో॥ బర్హిశ్యావిత్రనూరాట్కులయ పృథగణుం చాశ్వరేదైవమేతి
 వీచీతింకిదృక్స్వవర్ణంననహాతిచహీతః కోద్రిబింబంచకీదృక్
 కింసాధుస్పృశ్యంపాసుంవదతిహాలిన మాకారయన్నోన్యతింకిం
 లాంతంకింవక్తిమాత్సంపదమనతుసతతశ్రీకృష్ణకారుణ్యభిధోనః॥

అనుస్వయంకృత శృంగారసుధార్ణవభాణస్థ శ్లోకమునిచ్చి వీనికర్థమువ్రాసి యియ్యమని విద్యార్థులచేతనే పంపఁగా వానికర్థము నీయలేరైరి. పాఠశాలయందు పసుమర్తి ఉమామహేశ్వరశాస్త్రి గారప్పుడప్పుడు కఠినములగు సమస్యలనిచ్చి ఈయన పూర్తిఁజేయఁగా మిగుల సంతసించుచు నెవరైట్టికఠిన శ్లోకములుగాని సమస్యలగాని తెచ్చినను పాట్రిశాస్త్ర నడుగుమని పంపుచుండెడివారట (బ్రహ్మశ్రీ శిష్ట్లకృష్ణమూర్తిగారికి గిరియందుఁగల యాదరమిదివఱకే పేర్కొనియున్నాము ఈయనకు నాయనయందుఁగల భక్తియు శ్రీయన గ్రంథముల వ్యక్తమగుచున్నది. శృంగారసుధార్ణవమను భాణమున శిష్ట్లకృష్ణమూర్తి కవినిగూర్చి యిట్లు చెప్పియున్నాఁడు.

శ్లో॥ యేనస్వైరమకారిసారశరణం వేదాంతసం శ్రుత్యై
రూపాద్యాదాత్మసరస్వతీ స్వజనితానందితానందం వాణీతా
సత్కావ్యాదికలా భవత్కృతికవిష్వంగేన గాంభీర్యకా
మీమాంసాసరణౌపదాదిష్వపితాస్స్వశ్రాంతమభ్యస్యతే॥

శ్లో॥ తాదృక్కృష్ణకులప్రకాశనకరశ్రీసత్యనారాయణః
స్వచ్ఛందంవసుదేవపోషణమ శ్రీంచత్కలాప్రకః
దృష్ట్వాతూర్వ్యబుధప్రీధాన్యాటిలసత్స్వాదస్యచక్రీకర
శ్రీకృష్ణస్సుమనశ్శిరోమణిరితా కామి పసూనుఃపరః

శ్లో॥ యద్వాగ్గుంభాశ్శుభంభువి జగతి బృహత్కీర్తిసంక్రీడతాహో
తృప్తిప్రీత్యర్ధి దృష్ట్యత్కనకధరసచ్ఛృంగభంగాధి స్స్రా
పోద్యజ్జంయ్యూనభస్వద్రమణగణలసద్గంభశుంభత్సాగర్భాః
ప్రాప్స్యత్ ధారాధరాఘోద్భవదశనచరాద్భుత్యధిక్షేపదక్షాః॥

శ్లో॥ శరద్రాత్రిక్రోచాంభోజపవనవిహారోన్మదసిత
చ్ఛదకేంకారాహం కృతిహృతికలాకల్పకలనాః
విలాసాహ్కల్లోలా నిస్సరతదభిరాకర్షణపరాః
కురంగాక్షీపాదాంగదమధురకింజాసహచరాః॥

శ్లో॥ తదనుగ్రహవారిశాశ్శ్వజ్ఞతాజనితాంచత్కవితావతారకః
కృతిగుంఫిత మాధురీభరో వరకాంచీస్వయశోభాస్వయోదయః॥

శ్రీ కృష్ణమూర్తిగారి కీయనకవిత్వము వినుటయన్న పరమసం
తోషము గావున నీయన స్వస్థలమగు గోదావరిమండలమునకు సెలవుల
లోఁబోయినప్పుడెల్లఁ దనశ్లోకముల వినిపించుచుండెడివారు. మఱియు
కృష్ణమూర్తిగారీయనను పల్లెటూళ్లయందు జరుగుచుండెడి దొమ్మరా
టలు కోడిపందెములు మొదలగు గ్రామవినోదములు జూచుటకుఁ దో
డ్కొనిపోయి తిరిగివచ్చునపుడా యాటలను వర్ణింపుమని చెప్పి తాము
ను గొన్ని పద్యములఁ జెప్పుచుండెడివారు. ఇట్టి వినోదములఁ జూచుటవ
లన నీచజాతులు వాడుచుండెడి కొన్ని పారిభాషికపదము లలవడునని
చెప్పి యట్టివానిజూచుట యందుత్సాహము గల్గించెడివారఁట.

లను పేర్లను వినుటయేగాని గ్రంథములెచ్చటను గానవచ్చుటలేదు. ఈ మంజరీమధుకరీయ మందలికథయపూర్వము. స్వకపోలకల్పితము. పురాణాదులనుండి సంగ్రహించినది కాదు. ఇది ప్రస్తుతపురంగవ్యవస్థలనుబట్టి ప్రదర్శించుటకనుకూలము కాకున్నను ప్రాచీనసాంప్రదాయములననుసరించి స్వపాండిత్య ప్రకర్షయే ముఖ్యముగా కవులందఱు తలఁచుచుండెడి కాలమున వ్రాసినగ్రంథమగుటఁ బ్రదర్శనయోగ్యములగు నాధునికనాటకములకంటె కించిద్భిన్నమైయుండినను ఆంధ్రవాఙ్మయమున నాటకశాఖకు మూలమగు గ్రంథములలో నొక్కటియై యుండుననుటకు సంశయముండదు. ఇంతేగాక శాకుంతలము, వేణీసంహారము, ముద్రారాక్షసము మొదలగు నాటకముల నింతకు పూర్వమే యాంధ్రీకరించి యీ యుద్యమమునకు దారితీసిన వారైరి. మఱియు నాంధ్రసారస్వతమున ప్రప్రథమమున గద్యరచనకుం గడఁగినవారిలో నీయనయు నొకఁడని చెప్పనగును. నయనప్రదీపమను విగ్రహము మొదలగునవి యొక్కొకచో దీర్ఘసమాసజటిలంబులై యుండినను, రథాంగదూతము, పరశురామవిజయము మిగులసులభశైలిని వ్రాయఁబడుటఁ జూడ నప్పటికే గద్యశైలి యందలిరుచి (taste) మారుచుండెననియు నా మార్పున కనుగుణ్యముగనే యీయన ప్రయత్నములుసల్పుచుండుటవలన నూతనయుగావిర్భావ మీయనకప్పుడే కొంతసోకెననియునట్టి నూతనయుగచిహ్నములే యీయనకవితయందుపొడసూపెననియు మనమూహింపవచ్చును. గీర్వాణమున వీరురచించినగ్రంథములలో

(1) కుమారోదయమను చంపూకావ్యమిరువదియే డుల్లాసములుగలిగిన యొక గ్రంథము
(2) శృంగార సుధార్ణవమను భాణము
(3) రామచంద్రవిజయమను వ్యాయోగము
(4) ధీసౌధము. ఇది వ్యాకరణము నూతనముగ నభ్యసించువారి కనుకూలముగ సులభరీతిని వ్రాయఁబడినది.
(5) శృంగారమంజరి
(6) కమనానందమను భాణము
(7) పుమర్థసేవధి కావ్యము

(8) దేవీవిజయమను చంపువు.
(9) మృత్యుంజయవిజయమను.
కావ్యము
(10) ఉత్తరరామాయణము. (ము
(11) త్రిపురాసురవిజయమనుడిమ
(12) రాజవంశము
(13) మంజరీసౌరభము
(14) భాస్కరరాయ ప్రణీత
దేవీసహస్రనామము లకు భా
ష్యార్థ సంగ్రహము
(15) దేవీ స్తవము
(16) శ్రీకృష్ణోదయ కావ్యం
(17) కందర్పదర్పం
(18) వైరాగ్యవర్ధని
(19) ఉపమావళి
(20) కాళిదాసకృత మేఘసందే
శోత్తర కథాభాగరూపము
"ఘనవృత్తము"
(21) కాళిదాసవిరచిత కవికంఠ
పాశాఖ్య ప్రబంధమునకు
వ్యాఖ్య
(22) అమృతానంద యోగవిరచి
త సర్వాలంకార సంగ్రహ
మునకు వ్యాఖ్య

ఆంధ్రీకృత గ్రంథములు.

(23) భాస్కరకవి ప్రణీత మగు
ఉన్మత్తరాఘవము
(24) ముద్రారాక్షసము
(25) శాకుంతలము
(26) వేణీసంహారము
(27) ఉత్తరరామ చరితము
(28) రథాంగదూతము
(29) విష్ణుశర్మ విరచితవిగ్రహము
నయప్రదీపమను పేరుగలది.

ఆంధ్రమున స్వయముగా రచించిన గ్రంథములు.

(30) మంజరీమధుకరీయ మను
నాటకముకథ స్వకపోలక
ల్పితము
(31) పరశురామ విజయము గ
ద్యకావ్యము.

---

ఘ న వృ త్త ము.

"తత్సందేశం జలధరవరో దివ్యవాచాచచక్షే" "కృత్వావార్తాం జలదకథితాం తాంధనేశోపిసద్యః" అనెడిరెండ శ్లోకములతో మేఘసందేశమున సంక్షేపింపఁబడిన మేఘునియలకాగమనము (సందేశనివేద

నము, యక్షాంగనాస్థితి తచ్ఛుభవార్తాహరణము శాపాంతమున య
క్షయక్షాంగనా సంగమము నీ మొదలగు) నంశములీ గ్రంథమున విపు
లీకృతములు. యక్షసందేశము వినినతరువాత మేఘుని వృత్తాంతమును
గుఱించి దెల్పును గావున "ఘనవృత్తం" బయ్యె. సందేశమాత్రము
ను దెల్పునది గావున నది మేఘసందేశమని పేరువడసె. మహాకవి కాళి
దాసీ మేఘసందేశమున, సీతను గుఱించిన రాముని హనుమత్సందేశ
మును మనసులో నుంచుకొని రచియించినట్లీ యనయు నద్దాని ననుస
రించి వ్రాసినట్లే.

"గంభీరేణ స్తనితవచసా భవ్యపాత్రం వధూటీ భావత్కేతిస్ఫుట
మకథయ ద్రామమే వాంజనేయః" యనుదానివలనఁ దెలియుచున్నది
ప్రథమసర్గయందు కాళిదాసు "మార్గం తావచ్ఛృణు కథయతః" య
నియలకాపట్టణమునకుం బోవుమార్గమును చెప్పుమిష చేఁదనవర్ణనా
కౌశలముం జూపె. రెండవసర్గయందలకాపట్టణ రామణీయకమును, య
క్షాంగనావిరహావస్థయు సందేశమునుఁ జెప్పి రెండుశ్లోకములతో హ
ఠాత్తుగా ముగించెను. ఈమేఘసందేశపాఠకులు కథచివరంట వినఁగు
తూహలులగుటచే నంతవఱకు నంతరమ్యమై వారినానంద మగ్నుల
జేసిన గ్రంథమును రెండుశ్లోకములతో విధిలేక ముగియవలసి వచ్చెఁగ
దాయని చింతిల్లుదురుగాని సంతృప్తహృదయులై యట్లుచేయరు ఈ
ఘనవృత్తమట్టియసంపూర్తికథను పూర్తిచేసి యక్షయక్షాంగనాసమా
గమప్రకారముం దెల్పి వారి యుత్కంఠనుశమింపఁ జేయును.

మేఘుఁడు యక్షుని సందేశమును విని వానిచే వీడుకొలుపఁబ
డినవాడై తనకర్తవ్యముం గూర్చి విచారించుకొనెను. యక్షుఁడే చెప్పిన
ట్లు మేఘుఁడు భువనవిదితంబగు పుష్కలావర్తక వంశమున నుద్భవించి
నవాఁడగుట సద్గుణసంపన్నుండును దారస్వభావముఁ గలవాఁడుగావున
నీయక్షుని దైన్యావస్థఁజూచి మిగుల జాలిఁ జెందినవాఁడై "లోకేదీనా
వనమనుపమం పుణ్యమాదత్తపేవంసంతః ప్రోచుః" అనుమాటఁ దలఁచి
కొని పరోపకారపారీణులగు దధీచ్యాదుల కీర్తిని స్మరించి తన జీమూ
తనామమును సార్థకముఁ జేసికొన నెంచినవాఁడై "కోవానస్యాత్ప్రణయ

వశతో యాచనూనే వయస్యే! శక్యం కార్యం స్వగతివశతస్సాధితుం స్వప్రయత్నైః" యని వానియందు స్నేహభావమునూని వానికిం దోడ్పడ నెంచినవాఁడై బయలుదేరెను. దారిలో శుభ శకునములఁజూచి సంతోషించినవాఁడై యక్షుఁడు చెప్పినమార్గముంబట్టిపోయి యలకాపట్టణముఁ జేరి "ప్రజ్ఞానాళీ విలసనపరిజ్ఞాత తద్గేహభాగః" అయా గుర్తులచే యక్షగృహముం దెలిసికొని దేవీపూజానంతరము తద్దేకధ్యానయై పరుండి యున్న యక్షాంగన నొక జాలమార్గమునుండిచూచి యశోకవృక్షపరిభాగమునుండి పవనతనయుఁడు శ్రీరామస్మరణైక చిత్తయగు సీతాదేవికి రాముని యుదంతముఁ దెల్పిన రీతిగనే యీమేఘుఁడు నా యక్షస్త్రీకి శుభవర్తమానము దెలియఁజేసె. యక్షాంగనయుఁ బ్రియుని వర్తమాన మెట్లువినవచ్చెనని సంతోషాశ్చర్యములు ముప్పిరిగొన, కలయో మాయని శంకించియు, కామరూపుఁడగుటచే నొక సుందరాకారముధరించి యెదుట నిలిచియున్న మేఘునిఁజూచి తాను పూజించు దేవత యనుగ్రహమని తలఁచి వానినొక యర్ఘ్యాసనమునం గూర్చుండ నియమించి మేఘుని పుట్టు పూర్వోత్తరములును యక్షునికిని వానికిని గలిగిన స్నేహపరీకారమును యక్షుని ప్రస్తుతస్థితియుం దెలిసికొనఁగోరెను. మేఘుఁడాయక్షుని యన్నాదచర్యలం గొన్నిచెప్పి వాని తపోక్రమమును, నింద్రియనిగ్రహమును, ఏకపత్నీవ్రతము మొదలగు సద్గుణములఁ బ్రకటించు నొకసందర్భమునుఁ దెలియఁ జెప్పెను. యక్షుఁడు తనప్రమత్తతవలన నిట్టి వియోగము సంభవించెఁగదాయని పశ్చాత్తప్తహృదయుఁడై రామగిర్యాశ్రమముఁ జేరి తపస్సొనర్చుచుండ దేవేంద్రుఁడీ ఘోరతపస్సునకు వెఱచి సురూపయను నొక వేశ్యాంగన నీతని తపోభంగమునకై పంపఁగా నది వానిని లోఁబఱచుకొనుట కనేకయుక్తులువన్న, నాతఁడు వీనిని గ్రహించి దీనియనునయవాక్యంబుల "లోకేనానా కృతపరిష్వంగసందూషితానాం నంగం సంతః ఖలుసముగదం స్తంరసాభాసమూలం" ఇత్యాదినీతి వాక్యంబులచే ప్రత్యాఖ్యానంబు నేయుటేగాక దాని యత్నకృతములును వ్యాజసహితములునగు విలాసములెన్నియైన ధర్మపత్నియగు తన

యంగన విలాసముల కెంతయుం బోలనేరవనియుం జెప్పె.

"స్వర్గంగాయాః పయసివిహరత్ హంసస్యకల్యా సీత్వం యాహి ప్రమతతరమితో యాహి కుంజాంతరం తత్" (ఘన 1. 74) ఇట్లు చ్చటనుండి తొలఁగిపొమ్మని చెప్పిన నదియు వంచితయై సిగ్గుఁజెంది తొలఁగిపోయెననియు, నచ్చటి మునులందఱు వీని యింద్రియనిగ్రహమున కాశ్చర్యము నొందిరని చెప్ప నాయక్షస్త్రీయుఁ దనభర్తయొక్క యేకపత్నీ వ్రతమునకు నింద్రియనిగ్రహమునకు నాశ్చర్యము జెంది యపరిమితానందనిర్భరయై స్మృతిఁదప్పిన దానివలెనుండె. ఇది ప్రథమసర్గయందలి కథ.

ఇట్లీ ప్రథమసర్గయందు మేఘుని యాభిజాత్యమునకుం దగిన సద్గుణంబులును, యక్షుని ధైర్యస్థైర్యగాంభీర్యాదులు నేకపత్నీవ్రతము నింద్రియ నిగ్రహాదిప్రభావంబులును వర్ణింపఁబడియె. యక్షుని స్వభావస్ఫుటీకరణమే, సురూపాప్రవేశమునకును దత్కృతశోధనకు నిచ్చట ప్రసక్తిఁగల్పించినది. వీరిద్దఱి సంవాద మతిరమణీయము. ఇంతవఱకు వియోగావస్థయందు యక్షునిచర్యయు వానిస్వభావమును మనకుఁదెల్లంబయ్యె. ఇఁకయక్షాంగనాస్థితినిఁగూర్చి యక్షుఁడు మేఘునందేశమున నూహించిచెప్పిన దానికంటె మనకెక్కుడ తెలియదు. కావున నింటియొద్దనీమె విరహావస్థనెట్లు గడపుచుండెనో తెలియఁగోరుట సహజంబని మనవలెనే మేఘుఁడును గుతూహలముగలవానివలెఁ గన్పట్టుచున్నాఁడు. ఈయక్షాంగనాచరితముం దెల్పుటలో నామె చెలికత్తెకన్న యుక్తంబగు పాత్రంబు గన్పట్టదు. మఱియు నెవరినంగతివారు చెప్పికొనుటయు నమంజసంబుగాదు. కావుననీమెచెలికత్తెచే నీమెవిరహకాలావస్థలికవి జెప్పించుచున్నాఁడు.

అట్లానంద పరవశయై స్మృతిలేకయున్న యా యక్షాంగనకు శైత్యోపచారంబులు సల్పుచుజెంతనున్న చెలికత్తెమేఘునితో భర్తృవియోగానంతరము తనచెలి వృత్తాంతముం జెప్పెదవినుమనియె. కావ వార్తవినినంతనే యక్షుఁడు గృహాగమనము విపాదకారణమని తలఁచియెటకేనింజనె. ఇంట నావార్త తెలియఁగనే హాహాకారావము నెలంగ నా

యక్షస్త్రీయుమూర్ఛిల్లె. అంతదుష్టశిక్షకుఁడును యాశ్రితజనవత్సలుండు నగు యాకుబేరునిపంపున నాతనిభార్యయే తెంచి విరహతాపముచేఁ గుందుచున్న ఈయక్షాంగననోదార్చి "కేవానస్యుఃపరిభవపదం కర్మణా స్వార్జితేన" అనిచేసికొనినకర్మ యనుభవింపక చెల్లదనియు, లోకోద్ధారకులగు మహాపురుషులు నవతారపురుషులుగూఁడ గర్మబద్ధులగుచుండ మనబోటివారి లెక్కయేమియని చెప్పి, తనభర్తవలనఁ దానుపదేశముఁ బొందిన యంబికామంత్ర ముపదేశించి, తన్మంత్రపురశ్చరణవలన నీవియోగ దుఃఖముఁబోనడచి ప్రస్తుతము మనశ్శాంతిగలుగుటేగాక, జన్మసాఫల్యంబునగుననియుఁ జెప్పి తనయింటికింజనె. పిదపనాయక్షి యునతినిష్ఠాగరిష్ఠయై "త్యక్తలోకవ్యాపార" యైనపరాశక్తిని ధ్యానించుచుండఁ గొన్ని దినంబులకాశక్తి యామె పూజకుమెచ్చి సాక్షాత్కరించి యామెకు శుభం బొనగూడుననియు దన ప్రియభక్తుండగు కుబేరుని శాపంబు మరల్ప దానుసమర్థగాననియు జెప్పి వీరివియోగంబునకుఁ నీయక్షుఁడు పూర్వజన్మమునఁ దనకూతురల్లురు కామవశులగుటఁ దెలిసియుఁ వారిసంగమము నమకూర్చుకుంటయుఁ నీయక్షాంగన తనసఖులగు దంపతు లనంగక్రీడాపరులగుట నెఱింగియుఁ సఖియగుతనను వదలిపోవుదురో లేకతమయిచ్చను గప్పిపుచ్చితన సాన్నిధ్యమునే గోరియుందురో పరీక్షింప వలయునను బుద్ధిచే వారిస్వేచ్ఛావిహారమునకవకాశమియ్యకుంటయు కారణంబులగుట సంభవించెననియు, గావున "విహితంకర్మభోక్తవ్యమేవ" యనిచెప్పి శీఘ్రంబుగనే శుభంబయ్యెడునని యాశీర్వదించి యంతర్ధానంబయ్యె. అప్పటినుండియు నీయక్షాంగన యాపరదేవతోపాసనయందును. దత్కథాశ్రవణ మందునే కాలంబు పుచ్చుచు తనభర్తయొక్క రాకకై యెదురు చూచుచుండెనని యాచెలికత్తియ చెప్పునంతలో ధ్యానాధీనయగు నాయక్షస్త్రీస్మృతి జెంది చెంతనున్న మేఘునితోఁ దనభర్తవిషయమైన కొన్నిరహస్యవృత్తాంతముల జెప్పి తనకట్టి యిష్టములంగూర్చు నాతఁడు తన్నెడబాసియుంటకు మరలఁజింతిలి స్వప్రణామాళి పూర్వకముగాఁ దనమాటల తనితో జెప్పి యాతని ప్రశంసించి నీవుకూడ వర్షకాలముంగూడి యిష్టం

బుల బడయుమని మేఘునికనేకములగు రత్నాదులు కానుకలిచ్చియం పెను. మేఘుఁడును తిరిగి చిత్రకూటమునకుఁబోయి మిగులఁ గృశించి యున్న యక్షునిఁజూచి స్తనిత వచనములచే "భవ్యాపాత్రం వఘాటీ ఖావత్యేతి స్ఫుటమకథయ ద్రామమే వాంజనేయః" నీప్రియురాలు జీవించియున్న దనియు శుభములఁ బడయఁగలదనియుఁజెప్పి తనదారినిఁ బోయెను. వర్షకాలాంతరము శరదృతువు రాగా "ఉన్నిద్రో భూత్సపది కమలాకాముకశ్శేషతల్పాత్" ఉత్థానైకాదశి దినమున విష్ణుమూర్తి శేషతల్పమున మేల్కాంచిన తోడనే యక్షుఁడును శాపాంతమున సంపూర్ణ శోభగలవాఁడై యింటికింజనె. అచట దేవీపూజకై పెద్దల రావించి తదారాధనమునకై సిద్ధముగనున్న వానిభార్య వీనిని తగునట్లు మాల్యాంబరాదులచేఁ బూజించి రత్నఖచితమగు తులసి మంటపమున నాపరాశక్తినిఁ బూజించి పెద్దలకర్హసత్కారముసల్పి భర్తతోఁగూడ సరసనల్లాపంబులు సల్పుచుండె. మఱునాడు కుబేరుఁడు శాపాన్ముక్తుఁడగు యక్షునిఁ జూడవచ్చి వాని యింద్రియ నిగ్రహమునకు మిగుల నాశ్చర్యపడి వానిభార్య పరశివాయత్తైకచిత్త యగుటఁ బ్రశంసింప నీయక్షుఁడు నతివినయంబుదోప మతల నాకుజేసని సేవ గోరుటయు, నాతడికి సేవావృత్తినుండి ముక్తుఁడవైతివి. యనియుదనయగారమునుండి ధనముఁ దీసికొనిధర్మార్థకామముల ననుభవింపుమనిచెప్పి యనుగ్రహించె. పిదపనీదంపతులు నప్రమత్తులై నిత్యకర్మలఁ దీర్చుచు త్రివర్గామందున మరుచిగలవారై పరదేవతోపాసనయందేతమకాలముంబుచ్చిరి.

ఈగ్రంథమునఁ బ్రతిపాదితంబులగు ముఖ్యాంశములు.

ప్రతి మనుజుఁడును పూర్వజన్మమున తాఁజేసినకర్మకు బద్ధుఁడనియు నట్టికర్మకు మఱియొకరు కారకులుగాని పరిహారకులుగాని కాలేరనియు, అట్టికర్మ యనుభవమునఁ గాని వేఱొకవిధమున నశింపదనియు, ప్రతివాఁడు నాకర్మానుగుణ్యమగుజన్మమెత్తియుండఁ దత్కర్మ పరిణామమున కెట్లో ప్రేరకులగువారు "మయైవైతేనిహతాః పూర్వమేవ నిమిత్తమాత్రం భవసవ్యసాచిన్" అని శ్రీకృష్ణమూర్తి యర్జు

నునకుపదేశించినట్లు నిమిత్తమాత్రులేయై యుండుదురు గాని నిజమైన కారణము పూర్వకర్మయే గావున నీక ముందైన నీ జన్మయందు నతానే కార్యకరణమునకైని నియోగింపఁబడియెనో యాయా కార్యముల శక్తివంచనలేకుండగను ఫలాపేక్షలేకుండఁగనే నిర్వర్తింపవలెననియు, మఱియు, దేవయోని విశేషులగు యక్షాదులకు సయితము మనుష్యమాత్రులకువలెనే కొన్నిసమయములఁ బ్రమాదాలస్యాదులును గలవనియు, నవిచ్ఛిన్నంబులగు సర్గప్రళయంబుల కాకరంబగు నీ ప్రకృతియందొక యున్నతోద్యోగపదవి నంది తద్గతసుఖదుఃఖాదుల ననుభవించుచుండు వారే గాని కర్మాతీతులై త్రిగుణబంధములఁ బోనడచినవారు కారనియు, నట్టివారైన జన్మరాహిత్యమును బొందవలెనన్న.

శ్లో॥ "కర్మణ్యేవాధికారస్తే మాఫలేషుకదాచన
మాకర్మఫలహేతుర్భూ ర్మాతేసంగోఽస్త్వకర్మణి॥
శ్లో॥ దూరేణహ్యవరంకర్మ బుద్ధియోగాద్ధనంజయ
బుద్ధౌశరణమన్విచ్ఛకృపణాః ఫలహేతవః॥
శ్లో॥ కర్మజంబుద్ధియుక్తాహిఫలంత్యక్త్వామనీషిణః
జన్మబంధవినిర్ముక్తాః పదంగచ్ఛంత్యనామయం॥

భగవద్గీత 2. 5

అను శ్రీకృష్ణోపదేశానుసరణముగ నసంగశస్త్రముంబూని కర్మబంధముల ఛేదించుచు, బుద్ధియోగముతో ఫలాపేక్షయించుకైన లేకయే యీశ్వరచోదితములగు కర్మలశక్తి వంచనలేక యాచరించుచు పటిష్ఠంబగు నింద్రియనిగ్రహము నలవరచికొనుట ముఖ్యకర్తవ్యమనియు నట్టిసమాధిని సమకూర్చుకొనుటకై బ్రహ్మాదులకుఁగూడ మూలకారణమైనట్టియు.

శ్లో॥ వస్త్రీనానోతదుభయమువపుర్నా వ్యనిర్వాచ్యరూపా
బ్రహ్మాదీనామపిచజననీలోకరక్షాప్రసంగాత్
నానారూపావిరచితకృతిః పూజితాచక్రిముఖ్యై
ర్విష్ణైర్గిరిశ్యైమానసికుసుమేసౌరభశ్రీరివాస్తే॥ ఘన 2-లా.

# ఉపోద్ఘాతములోని ఎర్రాటా

| పుట | పఙ్క్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 5 | 17 | వాక్యార్థ్యం | వాక్యార్థం |
| ,, | 23 | రమణీ | రామణీ |
| 8 | 16 | కావికో | కాలికో |
| ,, | 20 | హాస్య ప్త | హాస ప్త |
| 10 | 15 | మేధావిషంబు | మేధావిశేషంబు |
| 11 | 13 | శ్రీశిష్టశిబ్ది | శ్రీశిష్టశిఢ్ఢి |
| ,, | 16 | వృద్దుడు | వృద్ధుడు" |
| 12 | 21 | యాశ్ర | నాశ్ర |
| 13 | 7 | కొంలు | కొందలు |
| 16 | 9 | సమయానకి | సమశయానకి |
| 17 | 9 | రుజగ | ర్భుజగ |
| 19 | 13 | నయనప్రి | నయుప్రి |

శ్రీరస్తు.

శ్రీశారదాయైనమః.

ప్రబంధాదిపరిక్రియా.

శ్లో॥ శ్రీర్దద్యాదనవద్యగద్యవిలసత్పద్యావళీసంఘటన
ప్రాగల్భ్యం సరసీజగర్భవనితా సర్వామరైః పూజితా ।
మాతుర్గర్భవినిర్గతార్భకగణ స్యాకృష్టభేదాత్పరం
నానావాక్యవిశారదత్వమచిరా ద్యాయచ్ఛతీతాదరా ।

అర్థము. మాతుర్గ...గణస్య, మాతుః=తల్లియొక్క, గర్భ=గర్భమునుండి, వినిర్గత=బయలువెడలిన, అర్భకగణస్య=సంతాన సమూహమునకు, ఆకృష్టభేదాత్=అధికారభేదమువలన, (అనగ వానివాని సంస్కారమునుబట్టి) ఇతాదరా=పొందబడిన యాదరముకలదగుచు, యా=ఏసరస్వతి, పరం=అధికమైన, నానావాక్యవిశారదత్వం=వివిధకావ్యరచనానైపుణ్యమును, అచిరాత్=శీఘ్రముగా, యచ్ఛతి=ఇచ్చుచున్నదో, సా=అట్టియు, సరసీజగర్భవనితా, సరసీజగర్భ=బ్రహ్మకు, వనితా=భార్యయైనట్టియు, సర్వామరైః=సమస్తదేవతలచేతను, పూజితా=పూజింపఁబడినట్టియు, శ్రీః=సరస్వతీదేవి, అనవద్య...గల్భ్యం, అనవద్య=దోషరహితములైన, గద్య=వచనములచేతను, విలసత్=ప్రకాశించుచున్న, పద్య=పద్యములయొక్క, ఆవళీ=వరుసయొక్క, సంఘటన=కూర్పుయొక్క, ప్రాగల్భ్యం=ప్రౌఢిమను, దద్యాత్=ఇచ్చుఁగాక.

తాత్పర్యము. ఈలోకమున జన్మగాంచిన మనుజులలో వానివాని పురాకృతసంస్కారమునుబట్టి సహజముగ నేలభించెడి యాయాసత్కవితా సంపదనాదరముచే నొసంగెడి లోకపూజితయగు నాసరస్వతీదేవి దోషరహితములైన సరసంపుమాటల ముద్దులగుల్కు పద్యముల నల్లెడి సామర్థ్యంబానకూర్చుఁగాత.

శ్లో॥ శ్రీకాళిదాస కవిరాజవిక్లృప్తమేఘ
సందేశకావ్య పరిపూరణలాలసా మే।

సర్వేప్సితప్రణయనక్షమకల్పవల్ల్యాః ।
సూనైస్స్వయత్నరచితైరుపశోభనంనో ॥

అ. శ్రీకాళి...లాలసా, శ్రీ=శోభతోకూడిన, కాళిదాసకవిరాజ=కవిశ్రేష్ఠుఁడగుకాళిదాసునిచే, విక్లృప్త=రచియింపఁబడిన, మేఘసందేశకావ్య=మేఘసందేశమనెడి కావ్యముయొక్క, పరిపూరణ=పూర్తి చేయుటయందు, లాలసా=కోరిక, మే=నాకు, భవతి=అగుచున్నది. సర్వేప్సి...వల్ల్యాః, సర్వ=అందఱి యొక్క, ఈప్సిత=కోరికలను, ప్రణయన=ఇచ్చుటయందు, క్షమ=సమర్థమైన, కల్పవల్ల్యాః=కల్పవృక్షమునకు. స్వయత్నరచితైః=తనప్రయత్నముచే సంపాదింపఁబడినసూనైః=పుష్పములచేత ఉపశోభనం=అలంకారము, నో=కాదా ఏమి?

తా. కవికులపారిజాతంబనఁ బరఁగు కాళిదాసునిచే నించుక క్లృప్తముగా రచియింపఁబడిన మేఘసందేశమం దసంపూర్తిగఁ జెప్పఁబడిన (యక్షునిసందేశానంతరము, యక్షయక్షాంగనా సంగమరూపమగు) కథాభాగమును, విపుల మొనర్చి పూరింప నామనము వ్విళ్ళూరుచున్నయది. సమస్త కోరికలనిచ్చు కల్పవృక్షము నెవరైన నల్పమగు స్వసామర్థ్యముచే సంపాదింపఁబడిన పూవులచేఁ బూజింపనదియు నద్దానికొక చిన్నయలంకారమైనఁగాదా.

శ్లో॥ జానన్నపీదమనిశం మనసోఽవశత్వా
త్తత్పూరణేపరినివర్తయితుంనశక్తః ।
కావ్యంకరోమిఘనవృత్తపదంమహాంతో
మృష్యంతుసాదర ధియాదయయావిలోక్య ॥

అ. ఇదం=ఈవిషయమును (అనగ, నొక చిన్న యలంకారమేగాని, యొక ఘనకార్యముగాదని) జానన్నపి=తెలిసినవాఁడనైనప్పటికి, అనిశం=మిక్కిలి, మనసః=మనస్సుయొక్క, అవశత్వాత్=స్వాధీనములేకుండుటవలన, తత్పూరణే=అద్దానినిపరిపూర్తి నొందించుటనుండి, పరినివర్తయితుం=మరల్చుటకు, నశక్తః=సమర్థుఁడనుకాకపోతిని, ఘనవృత్తపదం=“ఘనవృత్త” మను పేరుగల, కావ్యం=కావ్యమును, కరోమి=చేయుచున్నాను. మహాంతః=గొప్పవారు, సాదరధియా=ఆదరముతోగూడిన బుద్ధిచేతను, దయయా=దయతోడను,

విలోక్య=చూచి, యీగ్రంథమును పరిశీలించియనుట. మృష్యంతు=సహింతురుగాక.

తా. ఆట్టికల్పవృక్షమునకే నేఁబూనినస్వల్పంబగు పరిపూరణోద్యమము. మిక్కిలి శోభావహంబగు నలంకరణంబు గాఁ గేవలని తెలిసియు, నామనమకౌర్యంబునకై పలుమారు బురికొల్పుచుండుటచే నేనత్తరి విషయంబునఁ బూనితి. కావున ఘనవృత్తమను పేర నీకావ్యమునుఁ జేయుచున్నాను. సజ్జనులు దయయుంచి యాదరబుద్ధితో దీనిని గ్రహింతురుగాక.





శ్రీగణేశాయనమః

# ఘనవృత్తే.

## ప్రథమస్సర్గః

---

శ్లో॥ ఇత్యుక్తో సౌ నవదిజలదస్తేన దీనాత్మనాలం
శ్రుత్వా కామం సదయహృదయప్రాగ్రహిత్వాత్ప్రహృష్టః
లోకే దీనావనమనుపమం పుణ్యమాహుస్త్వేవం
సంతః ప్రోచుస్సదిహ హి మయా తోషణీయస్సఖా మే॥

చ॥ పలుకఁగ యక్షుఁ డాసరసవాక్యల నగ్రగుఁడౌట మేఘుఁ డిం
పులు దలఁకొత్త దీనజనపోషణ పుణ్యముఁ లిచ్చునంచు పె
ద్దలు వచియింతురే విరహతాపతతుని నార్తుభార్యకున్
దెలిపెద నామమిత్రునకిదే ముదిసంతసమొక్కఁ జేయఁగన్॥ ౧.

అర్థము. సపది = అప్పుడు, దీనాత్మనా = దీనుఁడైనమనస్సుగల, తేన = ఆయక్షునిచేత, ఇతి అలం = కాళిదాసమేఘసందేశమందు చెప్పఁబడిన ప్రకారము, ఉక్తః = చెప్పఁబడిన, అసౌ జలదః = ఆమేఘుఁడు, కామం = తృప్తిగా, శ్రుత్వా = విని, సదయహృదయః ప్రాగ్రహిత్వాత్, సదయహృదయః = కరుణారసముతోఁగూడిన మనస్సుగలవాఁడియుండు, ప్రాగ్రహిత్వాత్ = ముఖ్యుఁడౌటవలన, (తొలకరివానలపాటితో గూడిన శోషలిభాగము గలిగియుండుటచే సార్థకమనుచున్నది), ప్రహృష్టః = దంపతుల మైత్రికి సంతోషించినవాఁడై, లోకే = జగమందు, దీనావనం = దీనులరక్షించుట, అనుపమం పుణ్యం = సాటి

శరణాగత సంత్రాణకలాం కార్త్స్న్యంతిపాతకీం ॥ దీనస్యోపేక్షణం కృత్వాభీతస్య చరతీరితః పుణ్యస్య నాసపి కాలేనసంభీషా కేనపచ్యతే ” (ఉత్తరకాండ 181 అధ్యాయము) ఇత్యాదిధర్మశాస్త్రోక్తము ననుసరించియె మాటాడుచున్నట్లు కనబట్టుచున్నది.

శ్లో॥ ప్రాణాన్దత్వాశుచిరయశసాద్యాపి జీమూతవాహః ।
పక్షీంద్రాయోరగతతికృతే మునివర్యో దధీచిః ।
శక్రాదిభ్యః ప్రముదితహృదా స్వీయకాయం హి దత్వా ।
పౌరస్త్యావివ నివసతః కిం వదాన్యత్వకల్పం ॥

మ. మునుపక్షీంద్రునకిచ్చి ప్రాణముల హాహాపోషించె జీమూతవా
హనుఁడా నాగుల దక్షిణియును దేహంబియ్య డోవజ్రికిన్
మనియున్నట్టులనారు గప్పడరె యీనాఁడున్ యశఃకాయులై
ఘనదానైకమహత్తరాగరిమ శక్యంబె నుతింపన్ ధరన్ 3.

అర్థము. జీమూతవాహః = జీమూతవాహనుడు, ఉరగతతికృతే = సర్పముల సమూహము నిమిత్తమై, పక్షీంద్రాయ = గరుత్మంతునికొరకు, ప్రాణాన్ = ప్రాణములను దత్వా = ఇచ్చియు, మునివర్యః = మునిశ్రేష్ఠుడగు, దధీచిః = దధీచిమునివాడు, ప్రముదితహృదా = సంతసించినమనస్సుతో, శక్రాదిభ్యః = దేవేంద్రుడు మొదలుగాగలవారికి, స్వీయకాయం = తనశరీరమును, దత్వా = ఇచ్చియును, శుచియశసా = పరిశుద్ధమగు కీర్తిచే, అద్యాపి = ఇప్పటికిని, తౌ = వారిద్దరు, పౌరస్త్యావివ = ఎదుటనున్నవారువలె, నివసతోహి = ఉన్నారుగదా, కథం, వదాన్యత్వకల్పం = దాతృత్వముతో సమానమైనది. కిం = ఏమియున్నది. ఏమియులేదని తాత్పర్యము.

తాత్పర్యము. వెనుకటిశ్లోకమునఁ జెప్పబడిన పరోపకారమచ్చంబగు కీర్తిఁ జేకూర్చి స్వవాంఛితములఁ దీర్పఁజొప్పడుటనీరెండు పురాణప్రసిద్ధములగు నుదాహరణంబులచే వ్యక్తీకరించుచున్నాడు. జీమూతవాహనుడు దేవతాజాతులలో నొకరగు విద్యాధరులకు చక్రవర్తి. గరుత్మంతుఁడు పాములను దిన,

ములవరుసగా భక్షించుచుండ, జీమూతవాహనుఁడు తన ప్రాణములనాతనికి నాహారముగ నొసఁగెనని నాగానందమను నాటకమునఁ బ్రసిద్ధము. వృత్రాసురునిఁ జంపుటకు దేవేంద్రుఁడు దధీచి మహామునిని బ్రార్థింప నాయన తనవెన్నెముక నతిధైర్యముతో నీఁగా, నద్దాని నాయుధముగఁ జేకొని వృత్రసంహారము గావింప నగ్గెనని భాగవతకథ. కావున వారివలెను స్త్రీ నిక్కటికి విపత్తికియుండిన వారివలె లోకమునఁ దలంపఁబడుచున్నారు కావున దానమునకు సాటి మఱియొకటి లేదని తెలియుచున్నది. (మఱియు దానకర్తృత్వముత్తమనాయకలక్షణములలో నొకటి) కావున నేను వర్తమానము చెప్పి యక్షస్త్రీ ప్రాణదానముఁ జేయఁగలుఁగుటచే, స్వల్పకార్యముచేత నే, అనఁగా, దధీచి మొదలగువారివలెఁ దమప్రాణములఁ గోల్పోకయే, (మేఘుఁడు దుదకన్యాయముచే నాఁడ మాటమాత్రముచేత నేయని తాత్పర్యము) ప్రాణదానఫలము నాకు సంభవించుచున్నది. కావున దాతృత్వముతో సమానము మఱియొకటిలేదుగదా. "మేఘసందేశమున ప్రత్యాసన్నేనభసి దయితా జీవనాలంబనార్థీ" యని చెప్పినట్లు యక్షుఁడు తనప్రియురాలి జీవితము విషయమయి భయపడుటకు కారణము వర్షఋతుప్రాప్తియేకనుకను, "మేఘాలోకే భవతిసుఖినోఽప్యన్యథా వృత్తిచేతః" అని మేఘుఁడే యక్షయక్షాంగనల సంతాపమును హెచ్చరించిన వాఁడగుటవలనను తానేచారికిఁదప్పక తోడ్పడవలెనన్నట్టిట్లు చింతించుచున్నాఁడు. "జీమూతవాహనుఁడన మేఘవాహనుఁడు అనఁగా నింద్రుఁడని యర్థము, కావున తనువాహనముగాఁగల వానికిట్టి ఖ్యాతిగలుగ తానుకూడ నట్టిదానికై ప్రయత్నించుచుండుట భావ్యమని లక్షణయా స్ఫురించుచున్నది. దాతయుఁ దాఁడు ధీరోదాత్తుఁడైయుత్తమ నాయకుఁడై యుండుట రామాయణాది మహాకావ్య ప్రసిద్ధము.

శ్లో॥ జీమూతంమాంనిగదతిజనస్సర్వదాఖర్వభావా
దత్యస్సార్థఃపరమవహితప్రేక్షణాదక్షిణేన
స్వాభిఖ్యానంనయతినచసద్వ్యక్తియాదృచ్ఛికత్వం
తస్మాన్నోకింపరమసుహితం ప్రాణిభోజ్యంశరీరం ॥

ఉ॥ జీవనదాతయంచు ననుజెప్పుచునెప్పుడవక్రబుద్ధిచేఁ
గావఁగనానుగాఢతమకంబును బొందనివానిచేత మో
ఘావహమైనిజాఖ్యను నిరర్థమొనర్పక కాచువానిచే
భావనసేయజీవనము ప్రాణుల భుక్తికిఁగాదె దేహమా ॥ ౪.

అర్థము. జనః = లోకమందలి జనుఁడు. సర్వదా = ఎప్పుడును, అఖర్వభావాత్ = వంకరస్వభావము అనగా కుటిలత్వము లేకుండుటచే, మాం = నన్ను, జీమూతం = జీవనమునకు (ఉదకమునకనియును గూడ నర్థము) ఆధారమని, నిగదతి = చెప్పుచున్నాడు, పరం = మిక్కిలి, అవహితప్రేక్షిణా = జాగరూకతతో సంచరించునట్టి, దక్షిణేన = సమర్థునిచేత, స్వార్థః = తన బిరుదము (అనగా తన నామముయొక్క సార్థకత్వము) రక్ష్యః = కాపాడుకొనఁదగినది, సవ్యుత్పత్తి = వ్యుత్పత్త్యర్థములుగల, స్వాభిధానం = తన పేరును, యాదృచ్ఛికత్వం = యాదృచ్ఛికత్వమును (అనగా వ్యుత్పత్తి లేకుండుటను) నయతి = ఎవఁడు పొందింపఁజేసో, తస్మాత్ = అంతకంటె, అసుహితం = ప్రాణములకిష్టమగు, పరం = అన్యవస్తువు, కిం = లేదుగదా. శరీరం = శరీరమైతే, ప్రాణిభోజ్యం = కాకాదిజంతువులచేతినదగినది, భవతి = అగుచున్నది. అని అధ్యాహారము.

తాత్పర్యము. లోకములోనన్ను జీమూతమను ప్రసిద్ధనామముచేఁ బిలుచుచుందురు. జీమూతమనఁగా, జీవనస్య, మూతః = పుటబద్ధః జీమూతః అని తోఁపించుచున్నది. జీవనమనగా నీళ్లనియు, ప్రాణములనియుఁ గూడ నర్థము. కావున జలదుఁడు "భూమజ్జ్యోతిస్సలిల మరుతాంసన్నిపాతః" అనుటచే నీళ్లనిచ్చువాఁడే కాక ప్రాణములనిచ్చువాఁడు ననుచున్నాడు. లోకములో బుద్ధిమంతుఁడు తన నామమును సార్థకముజేసికొనఁ బ్రయత్నింపవలయును కావున జీమూతుఁడనను నేను యక్షదంపతుల కన్యోన్యకుశలవార్తాద్వారా జీవనమిచ్చి, యందువలన సార్థకనామకుఁడను గావలెను. వ్యుత్పత్తిసిద్ధమగు తననామము నెవఁడు సార్థకత్వము నొందింపఁడో వాఁడు తనకే యహితమును జేసికొన్నవాఁడనుచున్నాడు. మరణానంతరము కాకాది జంతువుల పాలగు నీశరీరము

తాత్పర్యము. మేఘుఁడు పైఁజెప్పినట్లుగా ననుకొని యక్షునికోర్కె దీర్పఁ దలపెట్టెను. స్నేహముంబట్టి తనకు స్వాధీనమైన యొకపనిని జేకూర్పఁ దనచెలికాఁడు కోరఁగా, యథాశక్తి నెవఁడు చేయ బ్రయత్నింపఁడు.

ఈశ్లోకమున 'నమృతపదనె' యనుటవలన నుదకమునకే స్థానమగుట కాక, యమృతమునకు స్థానమనియు. అనగా మోక్షసాధకమనియు స్ఫురించుచుండుటవలన, యమృతపదవిపునరావృత్తి రహితమయినటుల, నమృతపదమునఁ బడు మేఘునిచే ననుకూలత బొందింపఁబడిన యక్షయక్షాంగనలును చిరకాల సౌఖ్యము ననుభవింపఁగలరని ధ్వనికథను సూచించుచున్నది. మేఘుఁడిట్లు కృతనిశ్చయుఁడగుట పూర్వమేఘమున యక్షుఁడాత్రముకూట విషయమై చెప్పిన "నశేషాప్రాపి... సంకల్పయామాయ. ప్రాప్తైమిత్రైరపవతివిముఖః కిం పునర్యస్తథోచ్చైః" అనువారి యభిప్రాయమును బలపఱచుటే కాక, "తేనార్థిత్వం త్వయి విధివశాద్దూరబంధుర్గతో౽హం" అను నిప్పుడాయవసరమున యాచించిన యక్షుని కోరిక తప్పక సాఫల్యముఁ బొందునని తెలియఁజేయుచున్నది.

"స్వాగతిరతః" కాలక్రమమున నాయలకా పట్టణమునందనకు గమ్యస్థానం జేయుటచే నైవేద్యవలన సంప్రాప్తంబైన యీపుణ్యకార్యమును చేయుటకై బొందుకొఘ్రముగఁ బోవుటకు "యత్నవాన్" ప్రయత్నింపఁ గృతనిశ్చయుఁడయ్యెను.

శ్లో॥ నిర్గచ్ఛన్ సత్రిదివవసతిం పర్వతేనానుయాతం
వీణాక్వాణాంతరితశకునిశ్రేణినాదాంతరాళం
ధాత్రీంకాబ్జాకరరుహాలసత్పుండరీకం మునీంద్రం
పశ్యన్నీప్రద్వయమహతికాలోక దృష్టార్థసిద్ధిం ॥

మ॥ చనువాఁడై త్రిదశాలయంబునకు సత్స్వాంతుండు మేఘుండుపా
వనునిక్ బర్వతమిత్రయుక్తు మహతీధ్వానాతిసంఛన్నప

క్షిని నాదమ్ సరసీరుహాసనలసత్ స్వీయాంకపద్మాకరో
త్కానబ్జుంగని కార్యసాధనమనుచు మోదస్వాంతుఁడయ్యెన్ వెసన్

అర్థము. సః = ఆమేఘుఁడు, నిర్గచ్ఛన్ = పోవుచున్నవాఁడై వెళ్లుచు, త్రిదివవసతిం = స్వర్గమునుగూర్చి, పర్వతేన = పర్వతుఁడనుమునితో. అను యాతం = కూడుకొనినట్టియు, వీణాక్వాణా...రావం, వీణాక్వాణ = తన వీణధ్వనిచేత, అంతరిత = అణఁచివేయఁబడిన, శకునిశ్రేణీనాద = పక్షులవరుసల చేఁగలిగినధ్వనిగల, అంతరారావం = ఆకాశమునగలిగినట్టియు, ధాత్రంకా...రీకం, ధాత్రంక = బ్రహ్మతొడయనెడు, అబ్జాకరరుహ = సరస్సునందుపుట్టిన, లసత్ = ప్రకాశించుచున్న, పుండరీకం = తెల్లఁదామరయైనట్టి, మునీంద్రం = నారదమహామునిని, పశ్యన్ = చూచుచు, విప్రద్వయమహతికాలోక దృష్టార్థసిద్ధిః, విప్రద్వయ=ఇద్దరుబ్రాహ్మణులయొక్కయు, మహతికా=నారదునివీణయొక్కయు, ఆలోక = చూచుటచేత, దృష్టార్థసిద్ధిః = నిశ్చయింపబడినస్వకార్యసిద్ధిగలవాఁడై—మునవరిశ్లోకమునకన్వయము.

తాత్పర్యము. కుబేరుని పట్టణమునుగురించి వెడలుచుంకించు మేఘునకు ప్రథమమునఁ గలిగిన శుభశకునములఁ జెప్పుచున్నాఁడు. మేఘుఁడు ప్రయాణమైపోవుచున్నపుడు, పర్వత నారదులు స్వర్గమునకు వెళ్లుచు, వీణవాయించుకొనుచు, నెదురుపడఁగనిరువురుబ్రాహ్మణులును, వీణయుఁగనఁబడినశుభశకునములచేఁ గార్యసిద్ధియగును సుమాయని సంతోషించినవాఁడాయెను.

ఈశకునములు పూర్వమేఘమున యక్షుడు పనిమార్గమును చెప్పుచు “ మందంమంద ” మిత్యాదికముచేఁజెప్పిన శకునముల స్మరణకుఁ దెచ్చుచున్నవి శకుని శ్రేణీనాదము “ వామశ్చాయం నదతిమధురంచాతకః ” అని యక్షుడు చెప్పినట్లుగా, మేఘుని వెంబడించి మధురముగా నాదముచేయుచున్న చాతకముల ధ్వనియెయనియు, నారదసందర్శనము తలవని తలంపుగాఁబ్రాప్తించిన మణియొక శుభసూచకమనియుం దెలియవచ్చుచున్నది. “ ధాత్రంకాబ్జా...కం ” బ్రహ్మదేవుని తొడయందుఁబుట్టినటువలన, నమోనిజుఁడనియు, పుండరీకశబ్దము తెల్లతామరయందు రూఢముగాన తెల్లనివాఁడనియు, మునీంద్రశబ్దము చేత దేవర్షియనియు, తోపించుచున్నది.

శ్లో॥ ఏతౌదృష్ట్వా సవినయమతిస్సంప్రక్ల్పప్తప్రణామ
స్తద్దత్తాశీర్వచనఫలిత ప్రాయహృద్యార్థసిద్ధిః
గత్వాగ్రేసత్ఫలభరనమద్భూరుహాంశ్లిష్టవల్లీం
ప్రాపామోదంనిరుపమమసావుత్తరాశాంయియాసుః ॥ ౬ ॥

ఉ॥ వారలఁగాంచిసద్వినయభావముతోఁ బ్రణుతించిదీవనల్
వారలొసంగఁగానుఁజనువాంఛఫలించిన యట్లెంచిసద్వీరు
ధమొంగుజుట్టుకొనఁ బెల్లుగఁబండినఁబండ్లనమ్రవతా
భూరుహముల్‍గనుంగొనుచు మోదముతోఁజనెనుత్తరాశకై.

అర్థము. ఏతౌ = ఈమునీంద్రులను, దృష్ట్వా = చూచి, సవినయమతిః = అణఁకువతోఁగూడినబుద్ధిగలవాఁడై, సంప్రక్లిప్తప్రణామః = చేయబడిననమస్కారముగలవాఁడై, తద్దత్తాశీర్వ...సిద్ధిః, తద్దత్త = వారిచేనియ్యబడిన, ఆశీర్వచన = ఆశీర్వాదముచేత, ఫలితప్రాయ = నెరవేరినట్లుగానున్న, హృద్యార్థసిద్ధిః = ఇష్టమైనకార్యసిద్ధిఁగలవాఁడై, ఉత్తరాశాం = ఉత్తరదిక్కునుగూర్చి, యియాసుః = వెళ్లనిచ్ఛగించినవాడై, అగ్రే = ఎదుటను, శ్లిష్టవల్లీం = అల్లుకొనినతీఁగెలుగల, సత్ఫలభరనమద్భూరుహాం = మంచిపండ్లయొక్క భారముచేవంగినవృక్షమును, గత్వా = పొంది, నిరుపమం = సాటిలేని, ఆమోదం = సంతసమును, అసౌ = ఈమేఘుఁడు, ప్రాప = పొందెను.

తాత్పర్యము. ఆమేఘుఁడు, పర్వతనారదులకు మిక్కిలి యడఁకువతో నమస్కరించి వారిచ్చిన యాశీర్వాదముచేఁ దాఁజేయఁబోవు యక్షునిగనాప్రాణదానకార్యము సఫలమగునని నిశ్చయించి, ఉత్తరదిక్కుగా ప్రయాణమై, యెదుట తీఁగెలచేఁజుట్టుకొనఁబడిన చాలపండ్లుగల చెట్టునుచూచి దంపతుల కిట్లే సంగమమును, సుఖప్రాప్తియు కొగలదని తలంచినవాఁడై చాలసంతోషించెను.

యక్షుడు ‹‹ మార్గంతావత్ శ్రుణుకథయతః ›› అని ముందు మేఘుఁడు పోవలసిన మార్గమును జెప్పి తరువాత సందేశమును చెప్పెను. ఆమార్గము చెప్పుటలో ‹‹ పరిణతఫలద్యోతిభిఃకొనసామ్రైః ›› ఇత్యాదుల నానవాళ్ల

చెప్పుటచేతను, ఇప్పుడు మేఘుడు తనమార్గమున "ఫలభరనమజ్జంబూకుంజా" ములఁజూచుటచేతను, మరియు "ఉత్పశ్యోవస్త్రఖిఃఖం" అను మొదలుగ యక్షుఁడు చెప్పిన మార్గదర్శకములగు వాక్యములను జ్ఞాపకముంచుకొని, తదనుగుణం బుగ "ఉత్తరాశాంయియాసుః" ఉత్తరదిక్కునకుఁబోవ్వెళ్లనిచ్ఛించినవాఁడను టచేతను, మేఘుడు తనమార్గమున సరిగాఁజేసికొని యక్షుఁడు చెప్పినత్రోవనె వెళ్లియుండునని యూహింపఁబడియున్నది. "సవినయమతి" అనుటవలన మేఘుడు పెద్దలయందు గౌరవముగలవాఁడనుచు వానిసాత్త్వికాత్మ్యమును తెలియఁజేయుచున్నది. ఇకముందఱను యక్షాంగనవీనిప్రథమమునఁజూచి "సుందరవది హామాంపేక్షతే ప్రసన్నేన" యనుటవలనను, యక్షవృత్తాంతమామెకుఁజెప్పమొదలుపెట్టినప్పుడు "సంగతప్రత్రియః" అనుట వలనను వీనిసమత్తా గుణముప్రసిద్ధమగుచున్నది. "శిష్టవల్లి" ఇదిశాఖావిశేషమును సూచించుసాక్షిప్రాయవిశేషణము. వల్లీశబ్దము స్త్రీలింగము. భూరుహశబ్దముపుంలింగము. చుట్టుకొన్న తీగెలుగల వృక్షమనుటచేత, దంపతులను భావికాలమున ప్రాప్తించులతావేల్లిత బంధనాదిసుఖములను వీరికైకమత్యమమితంబైయుండు ననియు సూచించుచున్నది.

శ్లో॥ తత్తద్యక్షోదితనగపురీద్వీపవత్యాదిలక్ష్మీ
ప్రాప్తామోదః పథిసనిరతంప్రాపయత్కైశగుప్తాం
యత్క్యాలోకత్వరితహృదయస్సద్గుణోస్సప్రశిష్యా
వానిశ్శంకంసురపతిపురస్పర్ధినీంరాజధానీం ॥ ౭ ॥

ఉ॥ యక్షునిఁజేతఁజెప్పఁబడినట్టి పురీవరపర్వతాదులన్
వీక్షణసేసితద్రమముఁ బ్రీతినిఁజెందుచుమార్గమందునా
యక్షపరక్షితంబగుచు నాయమరావతిమించునప్పురిన్
యక్షునిఁజూడనేగెగురుహార్ద్యము శిష్యుఁడుచొచ్చెనైవడిన్.

అర్థము. పథి = మార్గమందు, తత్త...మోదః, తత్తత్ = ఆయా, యక్షోదిత = యక్షునిచేఁజెప్పఁబడిన, నగపురీద్వీపవత్యాది = కొండలు, పట్టణములు, నదులు మొదలగువానియొక్క, లక్ష్మీ = సంపత్తునుండి, ప్రాప్తా

మోదః = పొందబడిన సంతోషముగలవాఁడై, సః = ఆమేఘుఁడు, నిరతం = ముఖ్యముగా, యక్ష్యాలోకత్వరితహృదయః = ఆయక్షుభార్యను చూచుటయందు త్వరగలమనస్సుగలవాఁడై, స్వగురోః = గురువుయొక్క, సద్మ = గృహమును, శిష్ట్వా = శిష్యునివలె, నిశ్శంకం = సందేహములేకుండునట్లుగా, సురపతిపురస్పర్ధినీం = ఇంద్రపట్టణముతో సమానమగు, యక్షేశగుప్తాం = కుబేరపాలితమైన, రాజధానీం = అలకాపట్టణమును, ప్రాప = పొందెను.

తాత్పర్యము. మేఘుఁడా యక్షుఁడు చెప్పినదేవగిర్యాదులను కొండలను, శ్రీవిశాలయను విశాలాపట్టణము మొదలగు పట్టణములను, గంగచర్మణ్వతి మొదలగు నదులను మార్గమునఁ బోవుచుఁ జూచి, యక్షునిచే వర్ణింపఁబడిన వాని వాని సౌభాగ్యమును స్వయముగాఁ జూచినవాఁడగుటచే మిగుల సంతోషభరితుఁడయ్యెను. కాని వీనిఁ జూచి సంతోషించుచు కాలయాపనఁ జేయుట వీనికి తగవు కాదు «దినగణనాతత్పర» యైయుండు యక్షకాంత ప్రియసమాగమమునకై వేచియుండును. కావుననే మార్గమున నాలస్యము చేయవలదని «గంతుమాశువ్యవస్యేత్» అనియు "స్థిత్వాతస్మిన్వనచరవధూభుక్తకుంజే ముహూర్తం» అనియు «[illegible]దానాత్ క్షణపరిచితః» యనియు యక్షుఁడు మేఘుని సాధ్యమైనంత త్వరగ ప్రియురాలికి వార్తఁ గొంపొమ్మని చెప్పియుండెను. దీనరక్షణము సాధువులకు సహజము గావున, నీమేఘుఁడును వియోగదుఃఖపీడితయగు నాయక్షి యెట్లుండునోయని «యక్ష్యాలోకత్వరితహృదయుఁడై» కుబేరునిచేఁ బాలింపబడుచున్న నాయలకాపట్టణముఁ జేరెను

శ్లో॥ తేనోక్తాదప్యధికవిభవం ప్రేక్షమాణఃపురీంద్రాం
శశ్వజ్జాతాద్భుతసముదయస్సంప్రహృష్యన్నితాంతం
ప్రజ్ఞానాళీవిలసనపరిజ్ఞాతతద్గేహభాగ
స్సౌధహైమావృతినలపదంతద్గృహంమన్యమానః ॥ ౮ ॥

ఉ॥ ఆతనియుక్తికన్న విభవాతిశయంబుల నొప్పుచుండి వి
ఖ్యాతినిఁబొందినట్టియలకన్ గనిమాటికిమాటికాత్మ సం

జాతములైనవింతలకుసంతసమందుచు మంచుకప్పుకం
జాతములోలుతద్గృహముచాయ నెఱింగెడు యక్షు నెన్నుచున్ ౧౯

అర్థము. తేన = ఆయక్షునిచే, ఉక్తాదపి = చెప్పఁబడినదానికంటె. అధికవిభవం = మిక్కిలి యైశ్వర్యముగల, పురోత్తమం = పట్టణశ్రేష్ఠమును, వీక్షమాణః = చూచుచున్నవాఁడై, కథ్యాప్ = సాకుసాకెను. జాత = పుట్టిన, అద్భుతసముదయ = ఆశ్చర్యాతిశయముగలవాఁడై. నితాంతం = మిక్కిలి. సంప్రహృష్యన్ = సంతసించినవాఁడై, ప్రజ్ఞాన = గుర్తులయొక్క. ఉక్తి = వచనముయొక్క, విలసన = కనఁబడుటచేత, పరిజ్ఞాత = తెలియఁబడిన, తద్గేహభాగః = ఆయక్షగృహముండు వైపుగలవాఁడై, హైమాకృతనలపదం, హైమ = మంచుచేత, ఆవృత = కప్పఁబడిన, నలపదం = పద్మముయొక్క రీతిగలదానిని. తద్గృహం = వానియింటినిగా, మన్యమానః = తలఁచినవాఁడై, తస్థౌ = అచట నుండెను.

తాత్పర్యము. ఆయక్షుఁడు చెప్పినదానికన్న నాపట్టణము మిగుల సౌందర్యముగలదై గొప్పయైశ్వర్యముతోఁ గూడియుండెను. ఆపట్టణమునుఁ జూచి నకొలఁది హెచ్చుచున్న యాశ్చర్యముగలవాఁడై, వెనుక యక్షుఁడుతనకుఁ జెప్పిన గుర్తులచే (అనగా క్రీడాశైలము, బాలమందారవృక్షము. మాధవీమంటపము, తన్మధ్యస్థమగు కాంచనవాసయష్టి, ఆగృహముయొక్క వాకిటనున్న శంఖపద్మములు మొదలగువానిచే) నది యక్షగృహమని గుర్తించి, యక్షుఁడు చెప్పిన ప్రకార మచ్చట క్రీడాశైలమందలి సానువులమీదఁ గూర్చుండెను. అప్పుడు వానికాగృహము మంచుచే నావరింపబడి కాంతిహీనములగు పద్మములుగలదై శోభలేకయుండిన సరస్సువలెఁ గాన్పించినది. భర్తయింటలేనందున నాయక్షకాంతగృహమును సింగారింపకుంటచే కాంతిహీనమని తాత్పర్యము. ఉత్తరమేఘమున యక్షుఁడే తనగృహమిట్లు కాంతితగ్గియుండునను " క్షామచ్ఛాయం భవనమధునా మద్వియోగేననూనం " అని చెప్పి, యట్లుండుటచేత నే యది తన గృహమని గుర్తింపవచ్చునని యుఁ జెప్పియున్నాఁడు. " తత్త్వద్ద్రాతామ్భ్తసముదయః " అనుటవలన (ఉ మే.1) "విద్యుత్వంతం" ఇత్యాదిశ్లోకములయందలి యక్షవర్ణనకంటె నాపట్టణము, మేఘుఁడు సమీపించుటవలన " ముక్తాజాలగ్రథితమ

పాదపద్మములయొక్క, ధ్యాన = స్మరణచే, నిర్వృత్తచిత్తా = సుఖించినమనస్సుగలదగుచు, వివృతనయనా = కన్నులువిప్పినదై, ప్రేయసః = ప్రియునియొక్క, కల్యవార్తాం = కుశలసమాచారమును, వ్యాఖ్యాతారం = చెప్పుచున్న, తం = ఆ, జలధరం = మేఘుని, నియ...లం, నియమసమయ = ధ్యానకాలమందు, ప్రాప్త = సంభవించిన, హర్షా = సంతోషమునను, అనుకూలం = తనునటుల, అద్రాక్షీత్ = చూచెను. అథో = తరువాత, ఏవం = ఈప్రకారము, చింతయామాస చ = ఆలోచించెను.

తాత్పర్యము. శ్రీపరదేవతా ధ్యానముచే, భర్తృవియోగమువలనఁ గలిగిన మనస్తాపము కొంత చల్లారినదై నప్పటికి, నావిరహదుఃఖంబుమితంబగుటవలనను, మేఘుఁడాసన్నంబగుటవలనను, (వర్షఋతువచ్చినటు) వృద్ధినొందినహృదయతాపముగలదై, తనభర్తకుశల వార్తఁజెప్పుచున్న మేఘునిఁజూచి దేవీధ్యానమువలనఁగలిగిన సుఖముగ నెంచుచు నీప్రకారము చింతించెను.

"నిర్వృత్తచిత్తా" యనుటవలన నికముందు ద్వితీయసర్గలో నియక్షాంగనయొక్క చెలికత్తెచేఁ జెప్పఁబడెడి, కుబేరునిభార్య యనుగ్రహించి యోగార్చిలలితనుపదేశించుటయు, నాదేవీయుపాసనముఁ జేయుచున్న నీమెకాపరదేవత ప్రత్యక్షంబై యచిరకాలముననే శుభముగలుగునని చెప్పినటయు నందువలన ననీమె శాంతచిత్తయగుటయు మొదలగు వృత్తాంతమును సూచించుచున్నది. మఱియునదియాశక్త్యుపాసనయందీమెకుఁగల నైష్ఠికతయు, ప్రత్యేకతానత్వమును మేఘసందేశమున నీమెయందారోపింపఁబడిన విప్రలంభశృంగార చేష్టాదికమునకుతోడు, ఇప్పుడు భక్తిరసాధికతయు, పాతివ్రత్యలక్షణంబులును స్ఫుటీకృతములగుచున్నవి. ఈమెయొక్కయుపాసనాదికమువలన చిత్తవైకల్యముపోయి మనము నిర్మలతఁ జెందినను వియోగమువల్లనైన హృదయసంతాపము చల్లారలేదు. కావుననే విషయవాంఛలను వదలి "త్యక్తలోకప్రచారా" (౨ సర్గ ॥శ్లో॥ ) భర్తృసమాగమమునకై జూచుచు నియమముగలదై దేవీపూజగావించుచున్నది. ఇదియే యామెపతిభక్తిని, దేవతాభక్తినిగూడ చాటుచున్నది.

"హృత్తాపార్తా" యనునది "సవ్యాపారామహనిసతథాపీడయేద్విప్రయోగశ్శంకేరాత్రౌగురుతరశుచంనిర్వినోదాంసఖీంతే" (ఉ మే. ౨౮ శ్లో॥) అను

యక్షవాక్యానుసరణముగ, పగలంతయు «ఆలోకే తే నిపతతి పురా సా బలివ్యాకు
లా వా» యన్నట్లుగ దేవీపూజావ్యగ్రురాలై యుండుటవలన శాంతచిత్తయై
యుండినను, రాత్రియందామె హృదయము పరితాపముఁ బొందియుండవచ్చు
ననియు కావున నిదియామె రాత్రియవస్థను తెలియఁజేయవచ్చుననియుఁ దోచు
చున్నది. «నియమసమయ... కాలం» ఈయుత్తరాంగన యాపరదేవతాధ్యానము
సల్పనపుడే తనయభీష్టము చేకూరఁగలదాయని యెట్లు సంతోషముచే మైమఱచు
నో ఇప్పుడు మేఘుఁడు తనభర్తకుశలవార్త జెప్పుచు కనఁబడగా నామె కట్టి
యానందము కలిగెనను. «అద్రాక్షీత్» పైశ్లోకమున «తస్థౌ» అని
క్రీడాశైలముమీద నుండెనని చెప్పఁబడిన మేఘునాయక్షకాంత యెట్లుచూచి
యుండునని యాక్షేపము గల్గవచ్చును. కాని మేఘుఁడు క్రీడాశైలము సమీ
పించి, గజశిశువువంటి దేహమును అనగా «గత్వా సద్యఃకలభతనుతాం శీఘ్ర
సంపాతహేతోః» అని యక్షనిర్దేశప్రకారమల్పదేహత్వమును పొందిన
వాఁడై «అర్హస్యంతర్భవనపతితాం విద్యున్మేషదృష్టిం» (ఉ. మే. 21 శ్లో॥) అని
యక్షుఁడు చెప్పినాఁడుగనుక విద్యుద్దృష్టితో చూచియుండును. అప్పుడు «రా
త్రౌ గురుతరశుచం నిర్వినోదాం» «నిశీథే తామున్నిద్రామవని శయనాం»
(ఉ. మే. 28 శ్లో॥) అనియు యక్షుఁడూహించినట్లుగా రాత్రినిర్వ్యాపార
యై మిగుల దుస్సహమగు దుఃఖము ననుభవించుచున్న నాయక్షకాంత వానికిఁ
గన్పట్టియుండును, కావున భర్తయొక్క కుశలవార్తఁ జెప్పి యామె నోదా
ర్చుటకుఁ దగుసమయమిదియేయని యెంచి «తత్సందేశైస్సుఖయితుమలం పశ్య
వాతాయనస్థః» (ఉ. మే. 28 శ్లో॥) అని యక్షుఁడు చెప్పినవాఁడుగాన,
నామె పరుండి యుండుగది కిటికీలోఁ జేరి కామరూపుఁడుగావున పురుషాకా
రమును ధరించినవాఁడై యాయక్షుని కుశలవార్తఁ జెప్ప మొదలుపెట్టెను. ఆమె
యు «వివృతనయనా» మేల్కొనియేయున్నది గాన వానిని కన్నులఁ జె
ఱచి చూచినదై యాక్రింద చెప్పబోవు ప్రకారము చింతింపఁదొడఁగెను.

ఇట్లనే రామాయణమునను మారుతాత్మజుఁడు నశోకపాదపముఁ జేరి
జనకాత్మజకుఁ దన్నుతా నెఱింగించుకొనుటకుఁ బూర్వమే « కథం ను ఖలు వా
క్యం మే శృణుయాన్నోద్విజేత వా » యని శంకించుకొని « రామమక్లిష్టకర్మా

వంశస్వబంధుమనుకీర్తయన్, నైనాముజ్జీవయిష్యామి" యని తలఁచి "రాజా దశరథో నామ" ఇత్యాదికముచే రామకథాసంకీర్తనముఁ జేసి, క్రమముగా తన్నుఁ దానెఱింగించికొని యుండుటవలన, నిప్పుడు మేఘుఁడు నట్లుఁజేసియుండుటను స్మరింపఁ జేయుచున్నది.

శ్లో॥ నేదంనిద్రాజనితవికృతిర్లోచనోత్ఫుల్లతాయా
న్నాయంకశ్చిజ్జన ఇతిమతిర్దుర్గమంఖల్వగారం
మాయాసారాన్మదనవశగః కోపిసంప్రాప్త ఇత్య
ప్యస్థానేయత్సుతవదిహమాంప్రేక్షతేప్రశ్రయేణ ॥

ఉ॥ ఇదికలగాదు మేలుకొనియే కనయుంటి నిదుర్గమంబుగా
సదనముదొంగసొచ్చుటకు శక్యమెయెవ్వఁడొయున్మదాత్ముఁడై
మదమునఁబన్నుకుచ్చితఁపు మార్గమునన్ జనుదెంచెనన్న ని
య్యదియిటఁగానరాదు వినయంబునఁబుత్రుఁడునాననుంగనున్

అర్థము. లోచనోత్ఫుల్లతాయాం = నేత్రవికాసము గలుగుచుండఁగ, ఇదం = ఇది, నిద్రాజనితవికృతిః = నిద్రవలనఁ గలిగినవికారము. న = కాదు. అయంకశ్చిజ్జనఇతి = వీఁడెవఁడోయొక (దొంగ) మానిసియని. మతిః = బుద్ధియు, న = కూడదు, అగారం = ఇల్లు, దుర్గమంఖలు = ప్రవేశింపశక్యముకాదు గదా, మాయాసారాత్ = మాయాబలమువలన. మదనవశగః = మన్మథాతురుఁడై, కోపి = ఎవఁడో, సంప్రాప్తఇత్యపి = వచ్చినవాఁడనుమాటయు, అస్థానే = తగియుండలేదు, యత్ = ఎందువల్లనంటే, ఇహ = ఇప్పుడు, సుతవత్ = కుమారుఁడువలె, ప్రశ్రయేణ = ఆదరముతో, మాం = నన్ను. ప్రేక్షతే = చూచుచున్నాడు.

తాత్పర్యము. అగసెకిటికీలోనుండి వర్తమానముఁ జెప్పమొదలుపెట్టిన మేఘునిఁజూచి యెవఁడోయని ఆశ్చర్యపడుచు నిట్లని చింతించె.

నేను కన్నులు తెఱచి చూచుచునే యుంటిని గాన నిది స్వప్నము గాదుకదా. మఱియు నీగృహము దుర్గమంబగుటవలన చోరులిందుఁ జొర లేరు. ఇక నెవఁడో మదాంధుఁడై నన్నుకామించి మాయాబలిమిచే నిచ్చటఁ

నీమె జీవితమైయుండ మేఘుని శుభవర్తమానమీ మెజీవితమంపలి యాశకు సత్తువనిచ్చినది.

శ్లో॥ నేతుస్సూతోయదికిముపరిస్యాదితి ప్రాప్తధైర్యా
తద్వాగ్వృత్తిశ్రవణ విముఖీచింతయంతీపరాంతాం
సఖ్యాక్లృప్తెవిమలశయనే నిక్షిపంతీశరీరం
చింతాజాతాంబకసలిల సంపూర్ణకర్ణాధిశిశ్యే ।

ఉ॥ వరుఁడిటు పంపుదూతయయి వచ్చిననాపయిఁజూతునంచు దా
స్థిరమతి నేఁడు మేఘుఁడటు చెప్పఁబ్రవృత్తి వినంగనొల్లకే
శరణని శక్తిధ్యానమును సల్పుచు సెజ్జసమర్పదూతికల్
సరగున మేనుఁజేర్చెఁగనులంగల నీరముచేరఁగర్ణముల్ ॥ ౧౩.

అర్థము. నేతుః = భర్తయొక్క, సూతోయది = దూతయయినచో, ఉపరి = ఇకముందు, కింస్యాత్ = ఏమియగునోచూతమని, ప్రాప్తధైర్యా = పొందబడిన ధైర్యముగలదై, తద్వాగ్వృత్తిశ్రవణవిముఖీ = వానిమాటలువినుటలో విముఖురాలై. తాంపరాం = అపరదేవతను, చింతయంతీ = ధ్యానించుచు, సఖ్యా = సఖురాలిచే, క్లృప్తె = కల్పింపబడిన, విమలశయనె = శుభ్రమగుపక్క యందు, శరీరం = దేహమును. నిక్షిపంతీ = ఉంచినదై, చింతా = భర్తృస్మరణమువలన విచారముచే, జాత = పుట్టిన, అంబకసలిల = కన్నీళ్లచె, సంపూర్ణ = నిండిన, కర్ణా = చెవులుఁగలదై. అధిశిశ్యే = పరుండెను.

తాత్పర్యము. వినయనమ్రత్వాది గుణములచే నొప్పుచున్నవీడు, తనభర్తచే పంపబడిన వాడౌనని నిశ్చయించినది. గనుకనే ధైర్యము తెచ్చుకొని, యామేఘుడు చెప్పబోవుచున్న వార్తనువిననొల్లకయే, అపరదేవతను మనమున ధ్యానింపనారంభించినదయ్యెను. పిమ్మట భర్తృస్మరణమువలన గలిగిన దుఃఖముచే వివశురాలై కన్నీళ్లు నించునాయక్షకాంత, తనచెలికత్తియచె సమర్పబడిన పక్కయందు పరుండెను. అట్లు వెల్లకిల పరుండుటవల నామెకన్నీళ్లు ధారలుగట్టి చెవులవరకు ప్రవహించెనని తాత్పర్యము.

నసలిలోద్గారసంసిచ్యమానాపి = కన్నీళ్లుగారుటచే తడుపఁబడిన దైనప్పటికి ఏతద్గాత్ర = ఈమెశరీరమునుండి, ప్రభవ = పుట్టిన, పృథు = విస్తారమైన, సంతాప = వేడిమివలన, జ = కలిగిన, ఆశ్యానభావా = ఎండిపోవుటగలదై కందర్పేణ = మన్మథునిచే, వ్యపగత = పోయిన, దయ = కరుణకలుగునట్లు, ఉత్సృష్ట = విడువఁబడిన, బాణౌఘః = బాణసమూహముయొక్క, తాప = వేడిమి, యొక్క, భిసంవృద్ధిం = మిక్కిలిఅతిశయమును, వ్యరచయదివ = చేసినదాని వలె, అస్యాః = ఈమెకు, క్లేశం = విచారమును, చకార = చేసెను.

తాత్పర్యము. అప్పుడామె పరుండియున్నపక్క, కన్నీళ్లచేఁదడిసినదైన ప్పటికి, నామెశరీరమందలి వేడిమిచేత మిగుల శుష్కముగలదయ్యెను. ఆయు షము తాపోపశమనంబునకై పుష్పపల్లవాదులచే గల్పింపబడిన శయ్యయందు నుండుటవలన, క్రౌర్యమువహించిన పుష్పబాణుని తీవ్రబాణములయొక్క ప్రతా పాగ్నిచేత ననునట్లతిశయముగ తాపము నొనరించెను.

“ గాత్రప్రభవసంతాప ” యనుటవలన విరహావస్థలలో తొమ్మిదవదియగు నీమెయొక్క సంజ్వరావస్థ సూచింపబడుచున్నది “ చక్షుఃప్రీతిర్మనస్సం గస్సంకల్పోథప్రలాపితా । జాగరః కార్శ్యమరతిర్లజ్జాత్యాగోఽథసంజ్వరః । ఉన్మాదో మూర్ఛనం చైవ మరణం చరమం విదుః ” అని ద్వాదశావస్థాపక్షమున సంజ్వరావస్థతొమ్మిదవదిగా జెప్పఁబడియె. “ సంవృద్ధి ” విరహులకు తలి రుల సెజ్జయు, చల్లతెమ్మెరలు, పండువెన్నెలలు, నుద్దీపనవిభావనలని యలంకార శాస్త్రప్రసిద్ధము. అందువలననే శైత్యోపచారమైనను తాపమునె వృద్ధిజేసిన దని భావము “ నవకిసలయ తల్పం పుంజతాంగారకల్పం ” అని కాళిదాసా దుల ప్రయోగప్రసిద్ధము.

శ్లో॥ సఖ్యాపీతంతదుచిత తమంసమ్యగానీయమోదా
ద్వాత్సాత్రైవోపవిశశశివన్మండలే దర్పణస్య
ఇత్యాభాష్యప్రియతమకథా కర్ణనాలోలచిత్తా
పశ్యఁతీతంసుతమివతదా వ్యాజహారప్రియోక్తిం ॥

మ॥ సకియొక్కర్తుక యోగ్యపీఠ మిడ వత్సా యింపు సూర్చుండుమా
ముకురాంతర్గతచంద్రుపై బలెవతె సంతోషంబుచేనంచు తే
ప్రకటింపన్ప్రియసత్కథాశ్రవణము న్వాంఛించియా మేఘుఁబు
త్రకురీతిం గనియక్షకాంత ప్రియవాక్ప్రారంభసంరంభయై

అర్థము. సఖ్యా = చెలికత్తియద్వారా (చేతను) ఉపనిహితం = ఆతనికిబాగుగతగినట్టి, పీఠం = ఆసనమును, దాపయ = తెప్పించి, వత్స = బిడ్డా, దర్పణస్య = అద్దముయొక్క, మండలే = బింబమందు, ప్రతిఫలితః శశివత్ = చంద్రునివలె, అత్రైవ = ఈపీటమీదనే, ఉపవిశ = కూర్చుండుమా. ఇతి = ఈలాగునని, మోదాత్ = సంతోషముతో, అభిధాయ = చెప్పి, ప్రియతమ = భర్తయొక్క, కథా = వృత్తాంతముయొక్క, ఆకర్ణన = వినుటయందు, లోల = ఆసక్తిగల, చిత్తా = మనస్సుగలదై, తం = ఆమేఘుని, సుతమివ = కుమారునివలెను, పశ్యంతీ = చూచుచున్నదై, తదా = అప్పుడు, ప్రియోక్తిం = ఇంపైనమాటను, వ్యాజహార = చెప్పెను.

తాత్పర్యము. తరుణపురుషుని యాకారము ధరించిన నామేఘునికి నర్హమగునొక యాసనమును తనచెలికత్తెచేఁ దెప్పించి, యాయక్షి, తనప్రియుని కుశలవార్త వీనివలన వినఁగలుగుదుఁగదాయని సంతోషించుచు, నోయీ ఒక చిన్నయద్దమందుఁ బ్రతిఫలించుచున్న చంద్రునివలె నీపీటమీద గూర్చుండుమా, యని పలికి, తనకత్యంత ప్రియుఁడైన యాయక్షుని వృత్తాంతముఁ దెలిసికొన నాతురతఁ జెందుచున్న మనస్సుగలదై, యేవరొయొక ప్రియమగు వర్తమానముఁ జెప్పవచ్చుచున్న కుమారునిఁ జూచుతల్లివలె సవిస్రంభంబుగను, సానునయంబుగను మేఘునివంకఁ జూచుచు, నిట్లు ప్రేమతో బలికెను.

« తదుచితతమం » ప్రియసందేశమించుక చెప్పవచ్చిన మేఘునియందలి గౌరవముచే శ్రేష్ఠమైన గద్దియ నొసఁగెనట. యక్షుని కుశలవార్తా శ్రవణముచే జీవితాశయగు నీయక్షియిట్లు మేఘుని సత్కరించుట, « త్వాముత్కంఠోచ్ఛ్వసితహృదయా వీక్ష్యసంభావ్యచైవ » (ఉ. మె. 38 శ్లో.) అనుయక్షుని మాటలను క్రియారూపమున వ్యక్తీకరించుచున్నది వలెనేయున్నది. ఆశ్రిత

లవిషయమై ప్రయోజనానుసారముగ గౌరవముంచుట రాజధర్మము. "వత్స" యనుటవలన ఏకముందు 29 వ శ్లోకమున జెప్పబోవురీతిని, మేఘసందేశమున "కామరూపం" అనుదానికి సరిగా మేఘుండీ మెగృహమును పురుషాకృతితోఁ బ్రవేశించెనని తెలియుచున్నది. "సఖ్యా, ఆసీయ" సఖియను కరణముచే తానే తెచ్చెనని యనుటవలన, ఆమె చూపిన ఆదరము వినయము ప్రకటనయగు చున్నది "శశివదుపవిశ" ఈమె తెప్పించిన యాసనము కొద్దిపాటిదైనను చంద్రుఁడు చిన్నదైనను ప్రతిఫలించురీతిని, దీనినాదరమున స్వీకరిం పుమా యనుటవలన నామె వినయాతిశయమును తెలియఁ జేయుచున్నది. మఱియు నాశనిర్వన మామెను చంద్రదర్శనమువలెనే హృదయాహ్లాదకరమ నియు సూచించుచున్నది. "సుతనివ" యనుటవలన భర్తృదం తముఁ జెప్పవచ్చిన మేఘునియందాదరమును, విశ్వాసమునెగాక యామె పాతివ్రత్య మును వెల్లడిఁజేయుచున్నది. "ప్రియాసఖకథాకర్ణ నాలోలచిత్తా" యను నది గోపత్తరిమేఘమున "పవనతనయం మైథిలీవోన్ముఖీసా తాముత్కంఠోచ్ఛ్వ సితహృదయా (ఉ. మే. 39 శ్లో.) యనుయత్తువాక్యముల స్మరింపఁజేయు చున్నది.

శ్లో॥ ప్రాగేతస్మాత్సముయత ఇతంప్రాణనాథస్య భవ్యం
శ్రుత్వాశ్రీవప్రగత విలసజ్జీవితా ప్రత్యయాస్మి
ప్రాణేశన్య ప్రమదచరితా ఖ్యాంచదానాదిదానీ
ఝన్నైనేవవ్యపగతశుచంకర్తు మర్హాస్యజస్రం ॥

చ॥ జలధరయిప్పుడీవు ప్రియుసౌఖ్యముఁ జెప్పఁగవింటిఁ బ్రాణముల్
గళితముగావటంచుమది గట్టిగనమ్మితి నాథుమోదవా
ర్తలవివరించిరోగికిబలం బొనగూర్పఁగ నిచ్చుపథ్యముఁగ
బలెమదిగల్గుదుఃఖమును, నాశమొనర్పఁగ నీవెదిక్కుగా ॥౧౬॥

అర్థము. ఏతస్మాత్ సమయతః ప్రాక్ = ఇంతకుమున్ను, ఇతం = నీచేఁ జెప్పఁబడిన, ప్రాణనాథస్య = భర్తయొక్క, భవ్యం = కుశలవార్తను, శ్రుత్వా = విని, అత్రీవ = మిక్కిలి, ప్రగత = సంభవించిన, విలసత్ = ప్ర

కాశించుచున్న, జీవిత = ప్రాణమందు, ప్రత్యయా = విశ్వాసముగలదానను అస్మి = అయితిని. ప్రాణేశస్య = నాప్రాణనాథునియొక్క, ప్రమదచరిత = సంతోషమైనవార్తయొక్క, ఆఖ్యానదానాత్ = చెప్పుటవలన, ఇదానీం = ఇప్పుడు, అన్నేనేవ = అన్నముచేతవలెనే, వ్యపగతశుచం = పోయినదుఃఖముఁగలదానివలె, కర్తుం = చేయుటకు, అజస్రం = ఎక్కుడలి, అర్హసి = తగియుందువు.

తాత్పర్యము. ఇంతకుముందు అనఁగా నీవర్తమానము వినుటకుపూర్వము, నీచేఁజెప్పఁబడిన నాప్రియుని కుశలవార్తను వినినతోడనే, మరలనాప్రియునందాసగలదాననైతిని. ఏదైననొక మహావ్యాధిచేఁ పీడింపఁబడుచు ప్రాణములయందాసవదలిన వారొక మహౌషధము సేవించుటవలన నాబాధనుండి తొలఁగింపఁబడినవారై మరల జీవితమందు నమ్మకముగలవారగుదురు. అట్లేప్రియుని శుభవర్తమాన మీమెకు మహౌషధ మయ్యెనని తాత్పర్యము. కావున నింకనాభర్తయొక్క కుశలవార్తా వివరణమువలన రోగికి పథ్యాహారముల నొసంగి జవసత్వముల గల్గించినరీతిగా, నాదుఃఖభరముచేఁ గలిగిన దౌర్బల్యమును పోఁగొట్టి నాకు సంతోషాతిశయ మొనగూర్పఁ దగియున్నాఁడవు.

“ ప్రాగేతస్మా... వార్తాం ” అనునది మేఘుడు 10 వ శ్లోకమునఁ జెప్పియున్న కల్యవార్తయు యక్షునిచేఁ జెప్పఁబడిన “ భర్తుర్మిత్రం ప్రియమవిధవె ” (ఉ. మె. 38) యనుశ్లోకముయొక్క సారాంశమై యుండునని తెలియుచున్నది. “ ప్రాణనాథస్య ” యను విశేషణ మీయక్షుఁడు తనజీవితమునకు నాథుడు గాన తనకాలమున (ననగా వర్షాకాలము విరహులకుఁ గడు దుస్సహమగుటవలన) జీవనప్రదుఁడగు జీమూతునిద్వారా స్వకుశలవార్తను దెల్పఁబూనుటవలన ప్రాణహానావశ్యకమగు సమయమును దెలిసినవానివలె గన్పట్టుటచే సార్థకము నొందుచున్నది. “ ప్రగతవిలసజ్జీవిత ప్రత్యయా ” ఈమె జీవితము పూర్వ మేఘమున యక్షుఁడు చెప్పినట్లుగా “ కుసుమసదృశ ” మై “ సద్యఃపాతి ” అప్పుడేరాలిపోవుటకు సిద్ధముగానుండగా, పరదేవతా ప్రత్యక్షము, వరము పొందలగువానివలన గలిగిన యాశాబంధ మాపినది

కథయా = భర్తృకథచేత, ప్రేమ్ణైవ = ప్రేమచేతనలెనే, అతాపం = చల్లదన
మును, నేతుం = పొందించుటకు, అర్హసి = తగియున్నావు.

తాత్పర్యము. నా హృదయనాయకునికిని నీకునిదివరలో నెట్టి సాంగత్య
మెట్లుగలిగినది. నా భర్తకు ప్రియమైన స్నేహితుడవైన నకపమున వానివృ
త్తాంత మంతయు నీకు బాగుగ దెలిసియే యుండును. అందువలన నీవు
చంద్రుడు, పగలంతయు నెండ వేడిమిచే బాధ నొందుచున్న చకోరాం
గనను, తనకిరణామృతము నిచ్చి పోషించినట్టులనే నాకు నీవు నా ప్రియుని
వృత్తాంతమును జెప్పి నాతాపమును పోగొట్టుటకు దగియున్నావు.
చంద్రుడమృతకరుడగుటచే పగటియందు సూర్యతాపముచే బాధనొందు చకోరాంగ
నలకు తనకరంబులనాహారంబుగ నిచ్చి ప్రోచినట్లు నీవును యీ యింటనున్న నా విరహతా
పముచే బరితపించుచున్న నన్ను నీవు నమృతకరుండవగుటచే ప్రియకథామృతంబొసంగి ప్రో
చువాడవు; ప్రియుని వృత్తాంత కథనముచే నాతాపోపశమనంబు చేయదగుదు
వని తాత్పర్యము. చకోరములు వెన్నెల పులుగులు. అవి చంద్రునియందు
వెన్నెలనుతిని బ్రతుకునవని శాస్త్రప్రసిద్ధము. "ప్రియసఖివత్తా" సహా
నవయస్కులను వారలకు గలుగుస్నేహము సఖివత్వ, అది క్షీణవయస్కులగు
వారల స్నేహముకంటె నెక్కువ పట్టుగలది. అట్టి సఖ్యసాహచర్యము గలుగు
వలననే యక్షుడీ వార్త నీచే నంపియుండునని తెలిసికొనినదానివలె సీత యనిపి
కన్పట్టుచున్నది. "కథంకారం" అనునది రామాయణమున హనుమత్సందే
శము విని జనకాత్మజయడిగిన "క్వ తే రామేణ సంసర్గః కథం జానాసి లక్ష్మణం
వానరాణాం నరాణాం చ కథమాసీత్సమాగమః" అను ప్రశ్నను స్ఫురింపించుచు
న్నది. మేఘసందేశమున నాయకుండు "హరశిరశ్చంద్రికాధౌతహర్మ్యా
ఇందోర్దైన్యం... బిభర్తి" "పాదానిందోరమృతశిశిరాన్" "పరిణతశరచ్చం
ద్రికాసు" ఇత్యాదుల పలుమారు చంద్రసామాన్యము దెచ్చుటవలనను "హర
శిరశ్చంద్రికాధౌతహర్మ్యా" యని చెప్పుటవలనను వీరికెల్లపుడు చంద్రసహవా
సము గలుగుట సూచించుచు నిచ్చట నీకవి యక్షాంగనవాక్యముల ద్వారా
దానిని దృఢపఱచుచున్నట్టు కన్పట్టును. "అతాపం" ఉత్తరమేఘమున
యక్షుడు తనప్రియురాలట్లు వహితయై తనవార్తను వినుటకు కారణముగా

కాని యిప్పుడు తనభర్త కుశలవార్త వినినతోడనే తనజీవితమందును నిశ్చయముగ నమ్మకము పుట్టినది. "శ్రుత్వా" ఈశ్రవణలాభము "కాంతోదంతః సుహృదుపనతః సంగమాత్కించిదూనః" అని (ఉ. మే. 39 శ్లో.) మేఘుఁడే చెప్పియున్నాడు. ఈయక్షాంగనయుదాని ననువదించుచున్నదివలెనున్నది. "ప్రమదచరితా" యనుటవలన తనభర్తకే యేవిషయములు సంతోషమును గలుగఁజేసినవోయవియె-వానికథనముచే-విరహార్తయగు తనకు పథ్యమువలె నుపచరించును. అవియే యామెకు సంతోషకరములగునని తాత్పర్యము. ఇట్లనుటవలన నీవియోగసమయమున వానిస్థితి యెట్లుండెనో యతఁడెట్లు కాలము గడపుచుండెనో తెలియగోరు నామెపాతివ్రత్యమును వెల్లడిఁజేయుచున్నది.

శ్లో. నేతుస్తే మే ప్రియసచివతా ప్రాక్కథంకారమాసీ
త్తచ్చేత్తస్యావిదితమపి తే వృత్తమిత్యేవమన్యే
తస్మాచ్చంద్రస్స్వకరసుధయావాసరార్తాం చకోరీం
ప్రేమ్ణా వేమాం రమణ కథయా నేతుమర్హస్యతాపం ॥౧౭॥

ఉ॥ నీకునునాదుభర్తకును స్నేహముగల్గుట యెట్లుస్నేహమే
నీకులభింపఁదచ్చరిత నిక్కముగావిదితంబగాన, నా
ప్రాకటమైనతచ్చరితఁ బార్వణచంద్రుఁడు వాసరార్తనా
కాకఁజకోరిసాకినటుగావగనన్ను వచింపవేడెదన్ ॥

అర్థము. మే = నాయొక్క, నేతుః = భర్తకును, తే = నీకును, ప్రాక్ = ఇదివరకు, ప్రియసచివతా = గాఢస్నేహము, కథంకారం = ఎట్లుగా, ఆసీత్ = ఆయెను. తత్ చేత్ = అట్టిప్రియస్నేహమున్నయెడల, తే = నీకు, తస్య = ఆనాభర్తయొక్క, వృత్తం = వృత్తాంతము, అవిదితం అపి = బాగుగాఁదెలిసియే యుండును. (అని) ఇత్యేవ = ఈలాగుననే మన్యే = తలఁచెదను. తస్మాత్ = అందువలన, చంద్రః = చంద్రుఁడు, స్వకరసుధయా = తనకిరణామృతముచేత, వాసరార్తాం = పగటియందుబాధనొందిన, చకోరీమివ = చకోరాంగననువలె, మాం = నన్ను, రమణక

థయా = భర్తృకథచేత, ప్రేమ్ణైవ = ప్రేమచేతవలెనే, ఆతాపం = దప్పిదనమును, నేతుం = పొందించుటకు, అర్హసి = తగియున్నావు.

తాత్పర్యము. నాప్రాణనాయకునికిని నీకునిదివరలో నిట్టిసాంగత్యమెట్లుగలిగినది. నాభర్తకు ప్రియమైన స్నేహితుఁడవైన పక్షమున వానివృత్తాంత మంతయు నీకుబాగుగఁ దెలిసియే యుండును. అందువలన నీవు, చంద్రుఁడు, పగలంతయుం దన నెడబాయుటచే బాధనొందుచున్న చకోరాంగనను, తనకిరణామృతము నిచ్చి పోషించినటులనే నాకునీవు నాప్రియుని వృత్తాంతమును జెప్పి నాతాపమును పోఁగొట్టుటకు బాగుగ తగియుందువు. చంద్రుఁడమృతకరుఁడగుటచే పగటియందు మాత్రమే బాధనొందు చకోరాంగనలకు తనకరంబులనాహారంబుగ నిచ్చిప్రోచినట్లునీవునురేయింబవళ్లు వియోగతాపముచేఁ బరితపించుచున్న నన్ను నీవు నమృతకరుండవగుటచే (ఉదకముగల్పించువాఁడు) ప్రియుని వృత్తాంత కథనముచే నాతాపోపశమనంబుఁ జేయనర్హుఁడవని తాత్పర్యము. చకోరములు వెన్నెల పులుఁగులు. అవి రాత్రులయందు వెన్నెలనుతిని బ్రతుకుననుట శాస్త్రప్రసిద్ధము. “ ప్రియసచివతా ” సమానవయస్కులగు వారలకుఁ గలుగుస్నేహము సచివత, అభిన్నవయస్కులగు వారల స్నేహముకంటె నెక్కువ పట్టుగలది. అట్టి పరమసౌహృదముగల్గుట వలననే యక్షుఁడీ వార్త వీనిచే నంపియుండునని తెలిసికొనినదానివలె నీయక్షి కన్పట్టుచున్నది. “ కథంకారం ” అనునది రామాయణమున హనుమత్సందేశము విని జనకాత్మజయడిగిన “క్వతే రామేణ సంసర్గః కథంజానాసిలక్ష్మణం వానరాణాంనరాణాంచకథ మాసీత్సమాగమః ” అను ప్రశ్నను తలపించుచున్నది. మేఘసందేశమున నాయక్షుడు “ హరశిరశ్చంద్రికాధౌతహర్మ్యా ఇందోర్దైన్యం...బిభర్తి ” “ పాదానిందోరమృతశిశిరాన్ ” “ పరిణతశరచ్చంద్రికాసు ” ఇత్యాదుల పలుమారు చంద్రసామాన్యముఁ దెచ్చుటవలనను “(హరిశిరశ్చంద్రికాధౌతహర్మ్యా ” యని చెప్పుటవలన,) వీరికెల్లపుడు చంద్రసహావాసము గలుగుట సూచించుచు నిచ్చట నీకవి యక్షాంగనవాక్యముల ద్వారా దానిని దృఢపఱచుచున్నట్టు కన్పట్టును. “ ఆతాపం ” ఉత్తరమేఘమున యక్షుడు తనప్రియురాలట్లు వహితయై తనవార్తను వినుటకు కారణముగా

“ కాంతోదంతస్సుహృదుపనతస్సంగమాత్కించిదూనః ” (ఉ. మే. 39)
అని చెప్పియున్నాడు. ఇప్పుడీ మెయునట్లనే తలంచెనని తోచెడిని.

శ్లో. స్యాచ్చేత్త్వద్భ్యేతరవచన తా తే హితాశః ప్రియో మే
తత్తద్వృత్తం రహసి జనితం కిం వదేత్ప్రత్యయేన
తస్మాత్తస్య స్థితిమవిరతం సాధు జానాసి సాధ్వో
నిశ్శంకం మే వద వివిధమప్యస్య తత్ప్రీతిదం స్యాత్ ॥ ౭౮.

చ: అనృతములాడు దేనియు, రహస్యములన్నియు నీకు జెప్పునా ?
నను బ్రియకింపనిన్నిటకు నాథుండుపంపున ? కాన చెప్పు నా
ఘనచరితంబు నీకెఱుక దుఃఖమొ? తోషమొ? కూర్పుగా కళం
కను విడి చెప్పు సత్యమును, గౌతుకమయ్యెడి నాకు నో ఘనా ॥

అర్థము. త్వే = నీకు, తద్ధ్యేతరవచనతా = అబద్ధమాడుట, స్యాచ్చేత్ = అయినట్టయితే, (అనగా నీవబద్ధములాడువాడవైతే) హితాశః = తనకు నిష్టమైన దానిగలవాడగుచు, మే ప్రియః = నాభర్త, రహసి = ఏకాంతమున, జనితం = జరిగిన, తత్తద్వృత్తం = ఆయావృత్తాంతమును, ప్రత్యయేన = నమ్మకముతో, వదేత్కిం = చెప్పునాయేమి. తస్మాత్ = అందువలన, సాధో = ఓయుత్తముడా, తస్య = వానియొక్క, స్థితిం = ఉనికిని, అవిరతం = ఎడతెగకుండగా, సాధు = బాగుగ, జానాసి = ఎఱిగియుందువు, మే = నాకు, నిశ్శంకం = సంశయములేక, వద = చెప్పుము. తత్ = అది, వివిధమపి = ఎట్టిదైనను, అస్య = ఈసమయమందు, ప్రీతిదం = సంతోషకరము, స్యాత్ = అవును.

తాత్పర్యము. నీవు అబద్ధము లాడువాడవైనచో రహస్యమైన యాయావృత్తాంతమును, నాహితమునుగోరు భర్త నీకెట్లు నమ్మకముతోం జెప్పియుండును. కనుక నివతని యథార్థమగు వృత్తాంతమునంతను సాకల్యముగ నెఱిగియుందువు. ఓయుత్తముడా నాప్రియుని నడవడినాకు సంతోషముం జేయునదైనను కాకున్నను సంశయింపక యావత్తు చెప్పుము. అది యెట్టిదియైనను నాకీసమయమున సంతోషమునే జేయునుగాని విరుద్ధముగా నేరదు.

" హితాశః " మేఘునిచేత తనశుభస్థితిఁజెప్పినఁగాని తనకాంత జీవింపనేరదని నమ్మినవాఁడై, యిట్లు మేఘునిచే నీవార్తఁబంపినవాఁడు గనుకనే హితమగు యాశయము గలవాఁడగుచున్నాఁడు. అందువలన నేరహస్యవృత్తాంతములఁగూడ వీనికిఁ జెప్పియుంపెను. ఇట్టిమెచెప్పుటచేత తనయందంత ప్రేమగలవాఁడని తెలిసి " దయితా జీవనాలంబనార్థీ...త్రిం " అను మేఘసందేశమందలి వాక్యమును మారువలుకుచు నున్నట్లున్నది.] " సాధో " యనునది మేఘుఁడు విశ్వాసపాత్రుఁడై, లోకోపకార మకారణముగనే (ఒకరియపేక్ష లేక వర్షాదులనిచ్చుటచే) జేయసమర్థుఁడని చాటుచున్నది. ఆమెకు వీనియందుఁగల గౌరవాతిశయమును వెల్లడించుచున్నది. " నిశ్శంకంవద " అనుటవలన యక్షుఁడు మేఘునితో నడ్డములేక లోనికి ప్రవేశించి వర్తమానముఁ జెప్పుమనినట్లిమెయు ప్రియోదంతశ్రవణ కుతూహలముచే ప్రియాభిప్రాయాను సారిణియైనట్లు స్పష్టీకరించుచున్నది.

" వివిధమపి " భర్తయొక్క నడవడి యేకాంతముగా నుండుటచే నన్యస్త్రీలోలత్వాది వ్యాపారముగలదైనప్పటికి జడియక చెప్పుమనుట

" తత్ప్రీతిదం " అనుటచే భర్తృసౌఖ్యము నే సదా కోరుచుండుటచే నాథుండన్యకాంతాసక్తుఁడైనను వానియందసూయాదులు లేకుండునట్లు కనబడుటవలన నీమె పాతివ్రత్యము విశదీకృతమగుచున్నది.

శ్లో॥ నష్టంహ్యానే శ్రవణ పదవీసంప్రవిష్టంనిషేవ్య
ప్రాణాన్ధర్తుంరమణ చరితంసాధుపీయూషమద్య
తస్మాత్వత్త్యుర్విరహవిధుతం జీవితంసాంప్రతంతే
కర్తుంయుక్తంస్థిరపరిచితం సాంప్రతంయద్వశంతే ॥ ౬౯.

చ॥ చెడిసదిమానసంబిపుడు సేకురభర్తృకథామృతంబుదాఁ
గడువడిఁబ్రాణముల్నిలుపఁగా దలపోయుచు నుండెనాథుప్రే
ముడినిఁగృశించి, నీచెలిమిఁబొందియు, జీవితమిప్డునీకులోఁ
బడియె, నుపేక్షసేయఁదగవా బ్రతికింపగదోయిమేఘుఁడా ॥

అర్థము. నష్టం = చెడిపోయిన, మేహృత్ = నామనస్సు, శ్రవణపద వీసంప్రవిష్టం = శ్రోత్రమార్గమునుపొందిన, రమణచరితం = భర్తృవృత్తాంత మనెడు, సాధు = యోగ్యమైన, పీయూషం = అమృతమును, అద్య = ఇప్పుడు, నిషేవ్య = సేవించి, ప్రాణాణ్ = జీవమును, ధత్తు౦ = వహించు టకు, యతతే = (ఆనెడు పదమధ్యాహారము) యత్నించుచున్నది. తస్మాత్ = అందువలన, పత్యుః = భర్తయొక్క, విరహవిధుతం = వియోగము చేఁబాధపడినట్టియు, సాంప్రతం = ఇప్పుడు, స్థిరపరిచితం = బాగుగపరిచ యముఁగలదై, తే = నీకు, వశంయత్ = స్వాధీనమైనదో అట్టియు, జీవితం = ప్రాణము, యుక్తం = శరీరముతో గూడినదానిగా, కర్తుం = చేయు టకు, సాంప్రతం = తగినది.

తాత్పర్యము. నామనస్సు భర్తృవియోగమువలనఁ జెడిపోయినది. కాని నేనిప్పుడు వానివృత్తాంతమనెడి యమృతపానముఁజేసి బ్రతుకదలఁచు చున్నాను. అట్లుచెడిన నామనము నీయందధీనంబయ్యెఁ గావున సంతపరిచ యము గలదాని నుపేక్షింపఁజనదు. కావున నన్నుఁబ్రదికింపుము. "నష్టం హృత్" భర్తృవియోగముచే బాహ్యవిషయాసక్తి మఱచుటెగాక, మనస్సె ల్లప్పుడు భర్తృనిష్ఠముగుటవలన నాంతరిక వ్యాపారశూన్యంబు నయ్యెననుట. "స్థిరపరిచితం" ఆమె, రమణకథాస్వాదనమునను జీవింపఁబడి, మేఘుఁడుచెప్పు వర్తమానము వినుట యందత్యంత కుతూహలముగలదయ్యెను. అందువలననే "వశం" ఆమెమనస్సు మేఘుని యధీనమయ్యెను. ఈమెమాటలకు సరిగ నుత్తరమేఘమునయక్షుఁడు "ఉత్కంఠోచ్ఛ్వసితహృదయా" శ్రోష్యత్యస్మాత్ప రమవహితా" (ఉ. మే. 39 శ్లో) అని చెప్పియుండుటచే, వీరిరువురుల భావ ముల బాగుగఁదెలిసికొని యుండిరనియు నందువలన వారియన్యోన్యమున భేద చింతయు వ్యక్తమగుచున్నది.

శ్లో॥ ఏవంతస్యాంమృదులవచసీత్యుక్త్వతూష్ణీంయువత్యాం
సౌహార్దాంచన్మతిధృతి తయాసంగతప్రశ్రయోసౌ
భాస్వత్కీర్తిర్మిమిపకుము దినీంసమ్మదంసంప్రణేతుం
చక్రేజైవాతృక ఇవతదాగాసుధామాధురీకాః ౨౦.

చ॥ మృదులములైన వాక్కులిటులింపుగఁబల్కఁగ, యక్షకాంతనా
రిదముప్రమోదధైర్యముల వృద్ధినిజెందినబుద్ధి, నమ్రితన్
బొదలుచుఁబ్రొద్దువేఁడిమికిఁ బోడిమివీడినఁ గల్వరాజనా
సదయతగోసుధాతతులఁ జల్లెనుబెల్లుగనుల్లసిల్లగన్ ॥

అర్థము. తస్యాంయువత్యాం = ఆయక్షకాంత, మృదులవచసి = మార్దవముగల వాక్కులుగలదై, ఏవం = ఇట్లు, ఉక్తవత్యాం = చెప్పినదగుచుండగా, సౌహార్దాంచన్మతిధృతితయా, సౌహార్ద = స్నేహముతో, అంచత్ = ఒప్పుచున్న, మతిధృతితయా = బుద్ధిధైర్యములుగలవాఁడగుటచేత, సంగతప్రశ్రయః = ఒప్పుచున్న యడకువగలవాఁడై, అసౌ = ఆమేఘుడు, ఘస్రక్లిష్టాం = సూర్యకాంతివలన వాడిపోయిన, కుముదినీం = కలువతీగను, జైవాతృక ఇవ = చంద్రుఁడువలె, సమ్మదం = వికాసమును, సంప్రణేష్యన్ = చేయుటకు, తదా = అప్పుడు, సుధామాధురీకాః = అమృతమువలె మధురములగు, గాఇవ = కిరణములవలెనున్న వాక్కులను, చక్రే = చేసెను. అనగా చెప్పెననుట.

తాత్పర్యము. ఇట్లాయక్షకాంత మృదువులగు వాక్కులతో నామేఘునను నమ్మకముపుట్టించుచు మాట్లాడగా, నామేఘుఁడు వృద్ధినొందిన స్నేహమును మనోధైర్యమును గలవాఁడై యడఁకువగలిగి, పగలు సూర్యకాంతిచే వాడిపోయిన కలువతీగను చంద్రుఁడు తనయమృతంపు కిరణములతో వికసింపఁజేసినట్లు, అమృతంపు తేటలను తనమాటలచే విరహార్తయై కృశించిన యామెకు సంతోషముఁజేయుచు నిట్లనియె. "మృదులవచసి" పూర్వశ్లోకములయందు ప్రియోదంత వివరణమును, వియోగతాపశమనార్థిత్వమును, వివిధప్రియవార్తాశ్రవణకుతూహలంబును, జీవితదానమునుం గ్రమంబుగ గోరుచు, వినయానునయపాతివ్రత్యదైన్యములసూచించుటచే, నామెవాక్కులం దమృదుత్వారోపణ జేయంబడియె. "సౌహార్దాంచ...తయా" మొట్టమొదట నాయక్షిపీడెవఁడో యని శంకించినదై విముఖియగుటవలన మేఘుడు కొంత సంకోచించినవాఁడైనను, ఇట్టియామెవాక్యముల వినినతోడనే, స్నేహాతిశయమున

వాఁజెప్పఁబోవువార్తఁ జెప్పుటకు ధైర్యము వానిమనమున జనించినది. కాని "సంగతేప్రశ్రయః" అణఁకువమాత్రము విడువలేదు. మఱియునిది దౌత్యలక్షణము "జైవాతృకః" అనునది జీవనదాతయందును ప్రసిద్ధముగాన, సూర్యతాపక్లిష్టమగు కలువతీగను చంద్రుఁడువలెనే, వియోగతాపఖిన్నయగు నాయకికి కుశలవార్తఁ జెప్పి ప్రాణదానముఁజేసి రక్షించుట సహజమని తాత్పర్యము. "గాస్సుధామాధురీకాః" వరునిచే బాధపెట్టఁబడిన కుముదుని చంద్రుని కరస్పర్శనమున నెట్లుప్రకాశించెనో అట్లె "కాంతోదంత...కించిదూనః" అని యక్షుఁడు చెప్పినట్టిమెను వీనిమాట లమృతప్రాయములై నిర్వృతగఁజేయువని తెలియుచున్నది.

శ్లో॥ యత్తేప్రేయాన్మయిసదయమాగాత్తనూజత్వభావం
దూరేతస్మిన్నపిచభవసిప్రేమధూర్నిర్భరాత్మా
నూనంతస్మాదహముపగతో న్యాయతస్తాతభావం
పుత్రింమత్వాతవహృదయసంభాషణం నిర్విశంకా॥

చం॥ ననుసుతుడంచుఁబ్రేముడిమనంబున నెంచెను, నీప్రియుండు నీ
వునుఁగడుదూరముండియును, బుత్రునిరీతిని బ్రేమఁజూపనా
కునుదలపంగఁబాడిజనకుఁ వలెనీ పతిఁజూడనన్నునం
దనునిగనెంచినీమదిని దల్లిరోశంకనుమానిపల్కుమా ౨౧.

అర్థము.—యత్ = ఏహేతువువలన, తే = నీయొక్క, ప్రేయాన్ = భర్తయగు, సః = ఆయక్షుఁడు, దయయా = కరుణచేత, మయి = నాయందు, తనూజత్వభావం = పుత్రుఁడనెడితలంపును, అగాత్ = పొందెనో, తస్మిన్ = అట్టినీభర్త, దూరేఽపిచ = దూరమందున్నను, ప్రేమధూర్నిర్భరాత్మా = ప్రేమాతిశయముచేనిండినమనస్సుగలదానవు, భవసి = అగుచున్నావో, నూనం = నిశ్చయముగ, తస్మాత్ = అందువలన, అహం = నేను, న్యాయతః = న్యాయముగనే, తాతభావం = తండ్రియనెడునభిప్రాయమును ఉపగతః = పొందినవాఁడను, (కావుననన్ను) పుత్రం = కుమారునిగ, మత్వా = తలఁచి, తవ = యొక్కహృదయసంభాషణం = మనస్సునందలిమాటనుగూర్చి, నిర్విశంకా = సందేహములేనిదానవు. భవ = కమ్ము.

తాత్పర్యము.—నీభర్త యగు యక్షునికి నాయందు పుత్రప్రేమగలిగినది ఆమనదూరమందున్నను, మద్విషయకమగు వానియభిప్రాయముఁ దెలిసికొనిన దానివలెనే నీవును నాయందు, పూర్ణమగు వాత్సల్యముఁ జూపించుచున్నావు. కనుక భార్యాభర్తలగు మీరిరువురు నాయందు సమానమగు పుత్రవాత్సల్యముఁ జూపుటవలన నాకుయక్షునియందుఁ గలిగిన పితృభావము న్యాయముగనే యున్నది. అందుకని యాపుత్రభావము స్థిరపఱుప, మనమున నెంతమాత్రము సంశయింపక నీమనస్సులోని మాట చెప్పుము. "నిర్వ్యాశంకా" పూర్వమున నామెకుఁగలిగిన చోరాద్యనుమానముల మనమునసుంచక, యక్షుఁడు తనయందు తనూజత్వభావము గల్గియుండుటవలన (ఆత్మావై పుత్రనామాసి యను ప్రత్యర్థమునను సరించి) వానిస్వరూపముగనే యెంచి వెనుకతీయకరహస్యసంభాషణాదికము జఱుపుమనుట.

శ్లో॥ జల్పంతంతంనిజచరణ యోస్సంపతంతంయదృచ్ఛా
నారాకారంవినయ భరితంసాపయోదంనిరీక్ష్య
ఉత్తిష్ఠంతీశయనతలతః ప్రేమపూర్ణాంతరాత్మా
పశ్యంతీతందినకరకరస్ఫారనీరేజనేత్రా ॥

చ॥ తనపతివార్తనిట్లు విశదంబుగఁ జెప్పుచునారరూపముఁ
గనివినయంబునన్ నతులనంతముగా నొనరించుమేఘునిన్
గని, దిగిసెజ్జ, నానినటుఁగాంచెను, ప్రేమరసోదితాత్మయై
దినకరచారుసారఘృణిదీపితపద్మపలాశనేత్రయై ॥ ౨౨.

అర్థము.__సా = ఆయక్షాంగన, జల్పంతం = ఇట్లుచెప్పుచు, నిజచరణయోః = తనపాదములయందు, సంపతంతం = పడుచున్నటువంటియు, యదృచ్ఛానారాకారం = కామరూపుఁడగుటచే నుదకరూపధారియయినట్టియు, వినయభరితం = అడఁకువతోఁగూడినట్టియు, పయోదం = మేఘుని, నిరీక్ష్య = చూచి, శయనతలతః = పక్కనుండి, ఉత్తిష్ఠంతీ = లేచినదగుచు, తం = ఆమేఘుని, ప్రేమపూర్ణాంతరాత్మా = ప్రేమచేనిండినమనస్సుగలదై, పశ్యంతీ = చూచుచు, దినకర = సూర్యునియొక్క, కర = కిరణములచే, స్ఫార = వికసిం

చిన, నీరేజ = పద్మములవంటి, నేత్రా = కన్నులుగలదనుచు, తస్థౌ = ఉం
డెను. ఇది అధ్యాహారము.

తాత్పర్యము.—ఇట్లు చెప్పుచు నా మేఘుఁడా మె పాదములమీఁదఁబడి వినయముతో నా మెకు నమస్కరించెను. ఇచ్ఛాధీనమగు స్వరూపముఁగల వాఁడు నవకరూపుఁడునైన యా మేఘునిఁ జూచి తానుపడుకొనియున్న శయ్య నుండి లేచినదై, పరిపూర్ణమగు ప్రేమగలదనుచు, సూర్యకిరణముల తాపుచే బాగుగ వికసించిన తమ్మిరేకులవలె ప్రకాశించుచున్న నేత్రములతో వానిని జూచెను. "చరణయోర్న్యపతంతం" నమస్కరించుటవలన మేఘుఁడు తన వినయగౌరవాతిశయమును వెల్లడించుటే కాక, తన పుత్రభావము నంగీకరించి నిశ్శంకముగ నీభర్తవిషయమును వార్తఁ దెలిసికొమ్మని వేడుకొనుచున్న వాని వలె నున్నాఁడు. మాతాపితలకు గురుదైవములకు సాష్టాంగ నమస్కారము ధర్మశాస్త్రవిహితముగాన, తల్లిగా భావించిన యామెకు సాష్టాంగనమస్కా రము చేయుటచే శౌనకాదిశ్లోకముల చెప్పినమాటను క్రియారూపమున గూడ సమర్థించినాఁడు. "యదృచ్ఛా" అనునది మేఘుఁడే సమయమున నేరూప ము కావలెనన్న నారూపము ధరింపగలఁడని సూచించుచు "కామరూపం" అను యక్షునిమాటను స్మరింపఁజేయుచున్నది. "స్ఫారనీరేజనేత్రా" ఇది వఱకు కన్నీళ్లతో నిండి వాడియున్న యీ మెకన్నులు, మేఘునిఁ జూచుటవల నను, ఆ మేఘుఁడు తన పాదములమీఁదఁబడి సానుభూతిని విశ్వాసమును జూపుట వలనను, పెనియుంచిలి ప్రేమాతిశయముచే నా మెకన్నులు విప్పారినవి. ఈ విశే షము ఉత్తరమేఘమున యక్షుఁడు చెప్పిన "త్వయ్యాసన్నే నయనముపరిస్పం దిశంకే మృగాక్ష్యాః, మీనక్షోభాచ్చలకువలయశ్రీతులామేష్యతీతి" (ఉ. మే. 34 శ్లో.) యనుమాటను జ్ఞాపకము చేయుచున్నది.

శ్లో. దాక్షిణ్యంహి ప్రవిదితగుణః పూరుషాణామజస్రం
మాతుస్త్వేయం త్వదృతకథ నాత్ప్రత్యయాన్మామకీన
సల్లాపేత్వం గళిత విశేయస్సత్యమేవానుయాత
స్త్వస్యావస్థాంకథయసకలాం వంచనీయాస్మినాస్మి॥

చ॥ పురుషులకెల్ల దక్షిణత ముఖ్యమయౌగావున నీవు సత్యవా
క్స్థిరుఁడవని నమ్మి సత్యముగఁ జెప్పుము నా ప్రియవృత్తమెల్లనో
స్థిరమని నమ్మి సత్యముగఁ జెప్పుము నాప్రియవృత్తమెల్లనో
పరసుడ మోసగించుటకుఁ జాలినదానను, నీవెఱుంగవే॥ ౨౩.

అర్థము.— పురుషాణాం = పురుషులకు, దాక్షిణ్యం హి = దక్షిణనాయకత్వమే, అజస్రం = మిక్కిలి, ప్రవిదితగుణః = ప్రసిద్ధమైన గుణము, (అంగుళిక్షేపాత్) త్వద్వృత్తకథనాత్ = నీవు సత్యము చెప్పుటవలన, మా కుప్యేయాః = కోపింపకు, ప్రత్యయాత్ = విశ్వాసమువలన, మామకీనే = నాదైన, కల్పే = మాటయందు, గళితవిశయః = పోయిన సంశయముగలవాఁడవై, సత్యమేవ = యథార్థమునే, అనుయాతః = అనుసరించినవాఁడవై, సకలాం = సమస్తమైన, తస్యాః = నా ప్రియురాలియొక్క, అవస్థాం = స్థితిని, కథయ = చెప్పుమా. అస్మి = నేను, వంచనీయా = వంచింపతగినదానను, నాస్మి = కాను.

తాత్పర్యము.— పురుషులకు దక్షిణనాయకత్వము-అనఁగా నుదారస్వభావము వహించుట మిగుల ప్రశంసనీయము. అందువలన నీవు నేనేమియును కోపింతునో యని సంశయింపక యథార్థముగనే యతని వృత్తాంతమును, నన్ను మోసపుచ్చక చెప్పుము.

యక్షుఁడు తనయాత్మయందు తనభార్యకు నమ్మకము గలుగుటకుగాను "త్వమపి శయ్యానేకాంతల గ్నాపురా మె" ఇత్యాది శ్లోకముల తమరహస్యవృత్తాంతమును చెప్పుమని మేఘునితోఁ చెప్పియంపెను. ఆయాత్ముఁడూహించినట్లుగనే, యీయాక్షియు నట్టిరహస్యవృత్తాంతము నిదర్శనముగఁ గోరియే యిట్లనుచున్నట్లు కనుపట్టుచున్నది. "దాక్షిణ్యం" "తుల్యోనేకత్ర దక్షిణః" అని పలువురు స్త్రీలయందు సమానభావముతో మెలఁగువాఁడు దక్షిణుఁడు. అట్టివాఁడు మిగుల నౌదార్యముగలవాఁడు కావలయును. తనభర్త యట్టివాఁడని తెలిసికొనినది గనుక నే, వానివృత్తాంతమెట్టిదైనను తనకు సంతోషముఁ జేయునని చెప్పినది.

శ్లో॥ తత్స్నేహార్ద్రప్రవిమలమనాజీవితేశస్యవార్తాం
శంసేదానీమితరవనితా సంగరూపాంచ కామం
అస్మచ్చేతస్సమమఖిలతో వ్యక్తిభేదేపికీదృ
గ్వాస్యాత్తస్యాభిలషితమిదం సాధుపీయూషమేవ ॥

చ॥ వసుపయిసీకుఁగల్గుహితభావవి నిర్మలచిత్తవృత్తితోఁ
బరవనితానురాగమున, భాసిలియున్ననుఁ గచ్చరిత్రిముఁ
వెఱవక చెప్పుమాప్రియునివృత్తమునూఁకును, మేనుభిన్నమై
పఱలినఁజిత్తమొక్కటియె, వానిప్రియంబె సుధారసంబగుఁ బిర

అర్థము.—తత్స్నేహార్ద్రప్రవిమలమనాః = వానిస్నేహముచేనిర్మలమైన మనస్సుగలదానవై, ఇతరవనితాసంగరూపాంచ = అన్యస్త్రీసంభోగరూప మైనటువంటియు, జీవితేశస్య = భర్తయొక్క, వార్తాం = కథను, ఇదానీం = ఇప్పుడు, కామం = యథేచ్ఛముగ, శంస = చెప్పుము. వ్యక్తిభేదేపి = శరీరములువేరైనప్పటికి, అస్మచ్చేతః=మామనస్సు, అఖిలతః = అన్నివిషయములను సమం = ఒక్కటియే. తస్య = వానియొక్క, అభిలషితం = కోరిక, కీదృగ్వాస్యాత్ = ఎట్టిదైనకానిమ్ము, ఇదం = ఇది, సాధు = యోగ్యమైన, పీయూషమేవ = అమృతమువంటిదై యగును.

తాత్పర్యము. అతనిస్నేహముచేత నిర్మలమైన మనస్సుగలదానవు గనుక, నన్యస్త్రీసంగరూపమైనను సరె యతని వృత్తాంతమును యథేచ్ఛగాఁ జెప్పఁగలిగియుందువు. మేము రెండు రూపములు ధరించియుండినను ప్రతికార్యమందును మామనస్సొక్కటియె. అతఁడెట్టికోరిక కోరిచేసినను ఆపని నాప్రస్తుతావస్థయందమృతతుల్యమేయగుగాని, కోపకారణంబుగా నేరదు.

శ్లో॥ వ్యాధిగ్రస్తప్రకృతివికలస్యౌషధిస్తిక్తరూపా
ప్యాదత్తే హిప్రకృతిమహితాసంప్రాతాశేషజాడ్యా
తస్మాదన్యప్రకృతి విరసంచాపివృత్తంమనోజ్ఞం
తస్యస్యాదిత్య విరతమహంసాధువృత్తంహిమన్యే ॥

చం॥ కటువుగనున్నరోగికి సుఖంబొనరించునుమంచిమందుసం
కటములనెల్లఁబాపియిటు, కాంతుమనోజ్ఞ చరిత్రమెంత యేఁ
గుటిలతనూననిమ్ము, వినగోరెద సాధుచరిత్ర మట్లునా
యటమటఁదీర్పఁగాఁ దగినయౌషధమింకొకఁడుండునే ఘనా ౨౫.

అర్థము. ప్రకృతిసహితా = స్వభావసిద్ధమగు ఓర్వ్యము చేనొప్పుచున్న, ఓషధిః = జాడ్యనివర్తకమగువస్తువు, తిక్తాపి = చేదుగలదైనను, సంహృతాశేషజాడ్యా = పోఁగొట్టఁబడినసమస్తరోగములుగలదై, వ్యాధిగ్రస్తప్రకృతివికలస్య = రోగమువచ్చిస్వభావముచెడి వికారముఁ బొందినవానికి, ఆవర్తేహి = పూర్వపురోగ్యమును చేయుచున్నదిగదా. తస్మాత్ = అందువలన, తస్య = అట్టి, అస్య = ఈనాభర్తయొక్క, మనోజ్ఞం = స్వభావసుందరమైన, వృత్తం = వృత్తాంతము, ప్రకృతివిరసంచాపి = స్వభావముచెడి చెడిపోయినదైనను, అవిరతం = మిక్కిలి, సాధువృత్తంస్యాదితి = మంచిదేయగునని, అహం = నేను, మన్యే = తలఁతును.

తాత్పర్యము. జాడ్యనివర్తన సామర్థ్యముగలయోషధివిశేషము సేవించునపుడు చేదుగానున్నను, రోగికి నారోగ్యమునుఁ జేయురీతి, స్వభావమున యోగ్యమగు నాభర్తృవృత్తాంతము ప్రస్తుతమున నన్యసంగాములచే వినుటకు కఠినముగా నుండునదైనను, ఎట్లైనను తనికి సుఖమునే కోరెడునాకు సరిపిన నింపుగనే యుండునుగాని కటువుగాదు.

శ్లో॥ లోకేవస్తూన్యపికతిచన స్వస్వభావేనచేతో
వైకల్యాపాదనపటుతరాణ్యప్యనేహ ప్రకృత్యా ।
ఇష్టానిస్యుర్నగరలమసువ్యాధిసంక్రాన్తకాయ
స్యాస్తేకింవాతదవసరభూవైః కృతార్థేపదత్తం ।

చం॥ కరమువికారముల్సలుపఁగాఁదగు వస్తుచయంబుకాలవై
ఖరినిమనోహరంబగుటఁగాంచవె? యెప్పుడుఁజంపఁజాలినన్
గరలముప్రాణముల్విడుచు కాలమునందు సుధాసమంబుగా
వఱలుచుసర్వరోగములఁ బాపఁగలేదొకొజీవనప్రదా ॥ ౨౬.

అర్థము.—లోకే = ప్రపంచమందు, కతిచన = కొన్ని, వస్తూని = వస్తువులు, స్వస్వభావేన = తమస్వభావముచేత, చేతోవైకల్యాపాదనపటుతరాణ్యపి = మనస్సునకువికారము చేయుటయందు మిక్కిలి సమర్థములైనను, అనేహప్రకృత్యా = కాలస్వభావముచేత, ఇష్టాని = ఇష్టములైనవి, స్యుః = అవును. అనువ్యాధిసంగ్రస్తకాయస్య = ప్రాణాపాయకరమైన రోగముచే పీడింపఁబడుచున్నశరీరముగలవానికి, గరలం=విషము, తదవసరభూవైకృతాక్షేపదక్షం, తదవసరభూ= ఆసమయమందైన, వైకృత = వికారమును, ఆక్షేప = పోఁగొట్టుటయందు, దక్షం = సమర్థమైనది, నస్యాత్ కింవా = కాదాయేమి.

తాత్పర్యము.—లోకమందు విషము ఎప్పుడును తనను సేవించినవాని ప్రాణమునుతీయు స్వభావము గలదైనను, ప్రాణాపాయసమయమున వ్యాధిపీడితుఁడైన వానిబాధపోఁగొట్టి ప్రాణమిచ్చునట్లుగా, నాప్రియునివడువడి, మఱొకప్పుడు వినుటకు కష్టముగా నుండునదేయైనను, సమయమునుబట్టి యిష్టముగ నేయుండును. సమయమనగా ఎట్లైన నతడు జీవించియుండిన చాలునని యు అతడు సుఖముగనుండిన గాని తనప్రాణములు దక్కవనియు తలంచుచున్న కాలమని తాత్పర్యము.

శ్లో॥ భర్తుర్దోషే ప్రభవతి యయా మోక్ష్యతే త్యక్తశంకం
సంకోచే న త్యుపగత నయం ఖిద్యతే సా నతీహ ।
ధర్మజ్ఞాస్తే సుకృతచరితాః కామనక్తాశయానా
ముద్ధారార్థం కలుష జలధేస్సంవదం త్యేవ సర్వే ॥

చం॥ పెనిమిటిసేనంతసించుతటి బ్రీతిపహించుట, శంకమానుచుఁ
పనవినభర్తదుఃఖముల బాములనొందుట,నీతివేదియా ।
ఘనతరసాధ్విలక్షణముగా వచియింతురు ధర్మవేత్తలా
మనసిజతాపవార్ధి పరిమగ్నులనుద్ధరణంబొనర్పఁగాఁ ॥ ౨౭.

అర్థము. యయా = ఏస్త్రీచేతను, త్యక్తశంకం = నిస్సందేహముగా, భర్తుః = పెనిమిటికి, మోదే = సంతోషము, ప్రభవతిసతి = కలిగినదగుచుం

డగా, మోద్యతే = సంతోషించునో, సంక్షోచేసతి = విచారముసంభవింపగా ఉపగతనయం = తెలిసికొనినసీతిమార్గముగలదై, ఖిద్యతె = విచారించునో, సా = అట్టిస్త్రీ, సతీహి = పతివ్రతగదా. (అనునీమాటను) శేసుకృతచరితాః = పుణ్యాత్ములైనట్టియు, సర్వే = సమస్తులైన, ధర్మజ్ఞాః = ధర్మశాస్త్రవేత్తలు, కలుషజలధేః = పాపసముద్రమునుండి, కామసక్తాశయానాం = మన్మథపీడితులగువారియొక్క, ఉద్ధారార్థం = రక్షించుకొఱకు, సంవదంత్యేవ = చెప్పుచు నేయున్నారు.

తాత్పర్యము. మన్మథపీడితులైనవారిని పాపసముద్రమునుండి రక్షించుటకే అనగా దుర్మార్గములఁ జొరకుండునట్లు చేయుటకే, మనువుమొదలగు ధర్మజ్ఞులందఱు, భర్తసంతోషముఁజెంద సంతసించునదియు, దుఃఖమునొందిన తానును ఖిన్నయగుస్త్రీయే పతివ్రతనుగా నెన్నుచున్నారు. అనగా భర్తగుణదోషములను గణింపక, యతనిసుఖదుఃఖములు తనవిగా నెంచినదే పతివ్రత.

“ దాక్షిణ్యంహి ” ఇత్యాది 23 వ శ్లోకముమొదలు 27 శ్లోకమువఱకు నీయక్షాంగన తనకు పుత్రసమానుఁడగు మేఘునిఁజూచి తనభర్త యన్యవనితా సంగరూపాది వ్యాపారమున నుండినను సంశయింపక చెప్పుమని పదేపదే యడుగుట గానవచ్చుచున్నది. లోకమున పురుషుఁడన్యస్త్రీలోలుఁడై యుండిన, స్త్రీయయైనను ఖండితవ్యాపారము నవలంబించుట సహజము. ఇంతేకాక యీయక్షి యేస్వప్నమందైనను నాథుని పరస్త్రీసంగము సహింపకుండుట యుత్తరమేఘమున “ కితవరమయత్ ” (ఉ మె. 51) ఇత్యాది యక్షుఁడు చెప్పిన రహస్యవృత్తాంతమున స్పష్టమగుచున్నది. కాని ఇప్పుడీమె తననాథుఁడన్యస్త్రీ సక్తుడైనను ఆతనివర్తమానము తనకమృతప్రాయమనియు, వ్యాధిగ్రస్తునికి తిక్తమగునౌ షధివిశేషమారోగ్యమిడునట్లు, తనతాపమును బోగొట్టి బ్రదికించుననియుఁ జెప్పుచు నత్యాశచే దానినె వినగోరుటయుంచుక విరుద్ధంబుగ గాన్పింపవచ్చును. కాని ఇట్లీమె తలఁచుటకు నిమిత్తంబగు పాతివ్రత్యమె కారణము. మొదట యక్షుని శాపకారణమీయక్షియం దత్యాసక్తతయేయనియు కుబేరుఁడందువలననే భార్యనెడబాయుటయే శిక్షగా విధించెననియు, యక్షులతికాముకు లగుటవలన నీయక్ష యక్షాఁగనలు

సీత్ = ఆయెనో, సంప్రతి = ఇప్పుడు, కథమివ = ఎట్లుగా, అస్తే = ఉన్నాడో తథ్యం = నిజమును, ఉక్త్వా = చెప్పి, రమణకుశలో దంతసంప్రాణితం = భర్తకుశలవార్తచేఁ బ్రతికింపఁబడిన, మే = నాయొక్క, హృత్ = మనస్సును, సముత్థితతద్వార్తయా = ఇంపగు నావృత్తాంతము చేత, సంపుష్టం = పోషింపఁబడినదానిగా, సంతనుష్వ = చేయుమా.

తాత్పర్యము. నీవు నాభర్తను పలుమారులు చూచియుంటివి. ఆయన యరణ్యమందు మును పెట్టులుండెనో ఇప్పుడెటులున్నాడో చెప్పుము. ఆతని కుశలవార్తఁజెప్పి నన్ను బ్రదికించినావవుకాని యతనిస్థితినిగూడఁ జెప్పి బలముఁగలదానిగఁ జేయుము.

భర్తృవియోగపీడితులగువారు తమభర్త సమీపమునుండివచ్చినవారితోను తమ భర్తయొక్క రూపాదికమును, తాత్కాలికావస్థనుఁ దెల్పుమని యడుగుటకు రామాయణమున నొక నిదర్శనము గానవచ్చు. హనుమంతుని, తనభర్తదగ్గర నుండివచ్చిన వాఁతయని తెలిసికొనినతోడనే, సీత « కీదృశంతస్యసంస్థానం, రూపం రామస్యకీదృశం » అని శ్రీరాముని యవయవపన్నివేశమును గురించియు, రూపలావణ్యాదులగురించియు, చెప్పుమని కోరినది. దీనివలన భర్త యొక్క నిజావస్థ తెలియఁగోరుటేకాక, వీడు భర్తయొక్క మాఁతయయినదిఁ నిశ్చయింపనిలచినట్లును గన్పట్టు చున్నది.

శ్లో॥ ఏవంపృష్టఃప్రియవనితయాతేస్య యక్షోత్తమస్య
ప్రత్యాహైనాంతరుణపురుషాకారదీప్రఃపయోదః ।
సాభిజ్ఞానంగదితుముపచక్రామవక్రాంకధీర
స్తత్సౌరభ్యంమరుదివ పరంవర్ధయన్ప్రత్యయర్ధిం ॥

చం॥ అడుగఁగనిట్లుయక్షునిప్రియాంగన, మేఘుఁడుప్పురుషాకృతిన్
వడయుచునామెతో బదులువల్కెఁగడంగెనుప్రేమవార్ధిధీ
రుఁడుసుమసౌరభంబును మరుత్తుచుబోలివివృద్ధిసేయుచున్
వడిమదినమ్మకంబవుదు, బల్కెనభిజ్ఞగఁదచ్చరిత్రమున్ ౭౯.

అర్థము. తస్యాయక్షోత్తమస్య = ఆయక్షశ్రేష్ఠునియొక్క, ప్రియావనితయా = భార్యచేతను, ఏవం = ఇట్లు, పృష్టః = అడుగఁబడినవాఁడై, పయోదః = మేఘుఁడు, తరుణపురుషాకారదీప్తః = ఒకయౌవనపురుషునియాకారముగలవాఁడై, ఏనాం = ఈమెనుగూర్చి: ప్రత్యాహ = ప్రత్యుత్తరమిచ్చుచున్నాడు. నక్రాంకక్షీరః = సముద్రగంభీరుఁడైనయామేఘుఁడు, మరుత్ = వాయువు, తత్సౌరభ్యమివ = అపుష్పములయందలి పరిమళమునువలె, ప్రత్యయార్థం = విశ్వాసాధిక్యమును, వర్ధయన్ = వృద్ధిఁబొందించుచు, సాభిజ్ఞానం = గుర్తులతోఁగూడునట్లుగా, సందేశం = చెప్పుటను, ఉపచక్రామ = ప్రారంభించెను.

తాత్పర్యము.—ఆయక్షుని భార్యయిట్లడుగఁగా మంచియౌవనముచేఁ బ్రకాశించుచున్న యాకారము వహించిన యామేఘుఁడు, సముద్రునివలె నతిగంభీరుఁడై యామెకు ప్రత్యుత్తరమొసఁగెను. అట్లామేఘుఁడామెకా గుర్తులను సరిగఁజెప్పుచు మాట్లాడుటవలన, వాయువు పుష్పములయందు నిమిడి యుండు పరిమళమును మెల్లమెల్లగ పరిసరదేశముల వ్యాపింపఁజేయునట్లు, ఆమెకా మేఘుఁడు చెప్పిన కుశలవార్తవలన బొడమిన నమ్మకమంతకంతకు వృద్ధి నొందసాగెను.

“ తరుణపురుషాకార ” మేఘుఁడు కామరూపుఁడు గావున, పూర్వమేఘమున యక్షుఁడు చెప్పిన “ గత్వాసద్యః కలభతనుతాం ” మనువాక్యమునను సరించి, యట్టి యక్షకాంత కనఁబడిన నామె భీతిల్లునేమోయనియు, మిగులసాధ్వులగువారి నోదార్చువిషయమున, తమతో సమానులగువారి సానుభూతియే వారి తాపోపశమనమునకుఁ దోడ్పడుననియు, పురుషాకారమును దాల్చియుండును. ఇట్లుచేయుటవలన పైఁజెప్పిన యక్షాదేశమును సమయోచితముగ నిర్వర్తించిన వాఁడాయెను.

శ్లో॥ తతోఽఖండండప్రతివిలసతః సంశ్రితావక్రభావే
శ్రీతాచారంపరము పగతేన్నై తదాశ్చర్యపాత్రం
ఆత్మీయశ్రీవిహితకమలాక్షేపమప్యక్షియుగ్మం
నిత్యంపుష్టప్రచురకమలానందమేవాతిభాతి ॥

కాని " కమలా + ఆనంద " కమలాశబ్దము లక్ష్మీపరముగాన నేత్రములు లక్ష్మీనివాసస్థానము లనుటవలన నీయక్షుని యాభిజాత్యాదివర్ణనయు పైవిరోధమునకు పరిహారమును ప్రాప్తించుచున్నవి. " దీర్ఘభ్రూ బాహుముష్కస్తు చిరంజీవీధనీనరః " అను సాముద్రిక లక్షణముంబట్టి కనుబొమ్మలు విశాలములగుటయు, " నేత్రయోర్వసతేలక్ష్మీః " అనుటంబట్టి నేత్రములు లక్ష్మీనివాసస్థానములగుటయు మహాపురుషలక్షణములు " శోభించెడి " యనునప్పుడు ఉపమేయము కనుబొమ్మ లాహ్యములగుటవలన విషయనిగరణమలంకారము. కాళిదాసు మేఘసందేశము వ్రాయునప్పుడు, సీతనుగూర్చి హనుమత్సందేశము మనమున నిడుకొని వ్రాసినట్లు కన్పట్టుచుండుటవలన, నిచ్చటను ఈకవి రామాయణమున హనుమంతుడు " రామఃకమలపత్రాక్షః " ఇత్యాది మహాపురుష లక్షణ ప్రతిపాదనముచే శ్రీరాముని వృత్తాంతము ప్రారంభించుటను " కమలాక్షేపమప్యక్షిణీయుష్మ్యం " అనియక్షుని యవయవ వర్ణనములచే ననుసరించెనని తోచెడిని

శ్లో॥ స్వస్యోల్లాసంపరివిదధతః శీతభానోఃప్రమోదే
 నీతేవత్రీఇవవిలసతో వక్త్రసంవ్యాజభాజః
 సంమోదోద్యత్కుముదమణినాజ్ఞాతతత్కృప్తభాసా
 భాతోనేత్రేవదనముకురేతస్యయక్షోత్తమస్య ॥

చ॥ తనకిలశీతభానుఁడుముదం బొనగూర్చెనటంచుఁగల్వయ
 క్షునిముఖకైతవంబునను శోభిలుసోమున కాత్తమోదసూ
 చనముగనిచ్చుపత్రిముల నంపనఁబోలుచుఁగన్నుదోయియా
 యనఘునిమోముటద్దమున నమ్మరొకాంతులనీనుచుండెడిఁ ౩౧॥

అర్థము — స్వస్య = తనకు, ఉల్లాసం = వికాసమును, పరివిదధతః = చేయుచున్నట్టిన్ని, వక్త్రసంవ్యాజభాజః = ముఖమనుమిషనుపొంది, విలసతః = ప్రకాశించుచున్నట్టియు, శీతభానోః = చంద్రునియొక్క, ప్రమోదే = సంతోషమువిషయమై, జ్ఞాతతత్క్లృప్తభాసా = తెలియఁబడినచంద్రకృతమగుతనప్రకాశముగలదగు సమ్మోదోద్యత్కుముదమణినా = సంతోషయుక్తమగు (అనగా

పరిమళయుక్తమైన) కలువచేత, నీతె = తీసికొనిరాబడిన, ప్రతేఇవ = (కానుకగానొసగిన) దళములవలె, తస్య = ఆ, యక్షోత్తమస్య = నిభర్త్యయగుయక్షునియొక్క, వదనముకురే = అద్దమువంటిముఖమందు, నేత్రె = వీనికన్నులు, భాతః = ప్రకాశించుచున్నవి.

తాత్పర్యము, చంద్రకాంతిసోకినతోడనే పగలంతయు కాంతిహీనమైమూసుకొనియున్న కలువలు వికాసముఁజెందుననుట లోకప్రసిద్ధము. లోకములో తమకెవరైన నుపకారమొనర్చిన వారికి తిరిగి కృతజ్ఞతాపూర్వకముగ నేదైన కానుకనొసఁగుదురు, ఇప్పుడీ యక్షుని నేత్రము లెట్లున్నవనఁగా, వాని ముఖచంద్రుడు తనకు వికాసమునుఁజేయగా, మిగులసంతోషించినదై యొక కలువ వానికి తనకృతజ్ఞతఁ జూపుటకై తనయొద్దను ఏమియు లేకుండుటవలన రెండురేకులను మాత్రము కానుకగ నర్పింప నిచ్ఛయించినదై వానిసమీపమున నుంచెనోయన్నట్లున్నవి. అనగా ముఖము చంద్రునివలెను, కన్నులురెండు కలువరేకులవలె నున్నవని తాత్పర్యము.

“ పత్రె ” అనుటవలన దళములనియు, “ సంమోద ” మనగా సంతోషమనియు, పరిమళమనియు నర్థాంతరములు గన్పట్టుచున్నవి. అట్లనుటచే లోకమున తమకు సంతోషముఁజేయువారలకు వాహనాది బహుమానము నొసఁగినట్లు, ఈకలువ చంద్రునివలన వికసింపఁజేయఁబడి, పరిమళరూపమగు సంతోషముగలదై వాహనశబ్దవాచ్యములగు పత్రములను మాత్రము కానుకగ నర్పించి తనకృతజ్ఞతను జూపినది. “ వక్త్రిసంవ్యాజభాజః ” లోకమున చంద్రుఁడు రాత్రికాలముననే కలువలను వికసింపఁజేయ సమర్థుఁడగుచుండ యక్షముఖమిది నొంది సర్వదా (పవలును) యుల్లాసముఁజేయ నెంచెనని తాత్పర్యము. “ కుముదమణినా ” ఇచ్చట మణిశబ్దము శ్రేష్ఠవాచకము. అశ్రేష్ఠత తనకుపకారము చేసిన చంద్రుని మఱవక శక్తివంచనలేక కృతజ్ఞతఁజూపుటచేఁ గలుగుచున్నది. “ వదనముకురె ” ఇచ్చట ముకురశబ్దము లావణ్యద్యోతనార్థము.

శ్లో॥ పర్జన్యోపాసనకృత మహాఖర్వదుర్వారగర్వ
స్తద్వక్త్రేందుంస్థగయితుమనాఃకోపిజీమూతనేతా
ఆగత్యైతత్పిహితుమబలస్తస్యపాశ్చాత్యదేశే
పిండీభూతస్స్థితఇవశిఖాబంధఇంద్రోపలాభః ॥

మ॥ ఘనమొక్కండమరేంద్రసేవలకడుంగర్వించినీభర్త మో
మునుగప్పంగ జనుదెంచి వ్యర్థబలుండై పోఁగప్పఁగాలేకవె
న్కనుడాగంజనిముద్దయై నిలిచెనో కాకున్ననింద్రోపలా
భనుగన్పట్టునె కేశబంధమహహా వర్ణింపఁగాశక్యమే. 3

అర్థము. పర్జన్య = ఇంద్రునియొక్క. ఉపాసన = సేవచేత, కృత = చేయబడిన, మహత్ = గొప్పదైన, అఖర్వ = సంపూర్ణమైన, దుర్వార = అణపరాని, గర్వః అహంకారముగల, కోపి = ఒకానొక, జీమూతనేతా = మేఘశ్రేష్ఠము, తత్ = నీభర్తయొక్క, వక్త్రేందు = ముఖచంద్రుని, స్థగయితుమనాః = ఆవరింపనిచ్ఛగలవాడై, ఆగత్య = వచ్చి, ఏతత్ = ఈముఖ (చంద్రమండల)మును, పిహితుం = కప్పుటకు, అబలః = అసమర్థుఁడై, తస్య = ఆముఖముయొక్క, పాశ్చాత్యభాగే = వెనుకను, పిండీభూతః = ముద్దయై, స్థిత ఇవ = ఉన్నట్లుగా, ఇంద్రోపలాభః = ఇంద్రనీలమణికాంతిగల, శిఖాబంధః = జుట్టుముడి ప్రకాశించెను.

తాత్పర్యం. ఇంద్రోపాసన బలమున్నది గదా యని గర్వముచేత నల్లనియగు మబ్బు అతనిముఖచంద్రుని ఆవరింతమనివచ్చి, అట్లు చేయలేక వెనుకపడి పోయెనన్నట్లుగా, వీనివెనుక జుట్టుముడి నల్లగాఁ బ్రకాశించెను. ఎవడైన సామర్థ్యమెఱుఁగక గొప్పవాని నొకని యోడింతమని వచ్చి చేతగాక వెనుక భాగమున పడుట ప్రసిద్ధము. అతనిముఖము చంద్రునివలె జుట్టుముడి నల్లనిమబ్బువలెను నుండెనని సౌందర్యవర్ణనము “ పర్జన్యోపాసన ” ఇంద్రుఁడు మేఘవాహనుఁడని ప్రసిద్ధము. కనుక ఇంద్రునకు వాహనరూపమై సేవించుట ఉపాసన “ కోపి ” ఇట్లు సేవించువారిలో నొకఁడాకాశమునందు చంద్రుని నొకానొకప్పుడు గప్పగల్గుటచే, నట్లనే యతనిముఖచంద్రుని గప్ప గల్గుదుగదా

యని యింకొక మేఘము వచ్చెనని యర్థము. (“ అబలః ” ఉపాసనా బలగ ర్విష్ఠుడైనను ఈచంద్రుని నొకప్పుడైన గప్పుటకు సామర్థ్యము లేనివాడయ్యెను)

శ్లో॥ ముక్తాళీనాంనివసన తయాచారురేఖాస్పదత్వా
ద్బింబగ్రాహిద్యుతిపదతయాధీరతారస్వరత్వాత్
కంబుస్సామ్యందయితగళతఃకించిదభ్యేతినూనం
నోసాకల్యంతతఇవపరంపాండిమాలక్ష్యతేత్ర ॥

ఉ॥ శరణముముక్తహారలకును చక్కనిరేఖలకాస్పదంబును
స్వరముగంబల్కుశక్తియును ఛాయగ్రహింపఁగఁ జాలిశబ్దవి
స్తరమునుగల్గియుకుగళ సామ్యముగొంచెమునొంది పూర్తిగా
వరలకకాదె యా దరము పాండిమమైగనుపట్టుసీభువిన్ ౩౩.

అర్థము. ముక్తాళీనాం = ముత్యాలహారములకు, నివసనతయా = ఆధారమగుటచేతను, కంఠము (ముత్యములవరుసకు నాధారమగుటవలన శంఖము) చారురేఖాస్పదత్వాత్, చారు = సుందరములైన, రేఖ = గీతలకు, ఆస్పదత్వాత్ = స్థానమగుటవలన, కంఠము (శంఖమునీదఁగూడ చక్కనిరేఖలుండును). బింబ = ప్రతిబింబమును, గ్రాహి = గ్రహించునట్టి, ద్యుతి = కాంతికి, పదతయా = స్థానమగుటచే, కంఠము (శంఖముగూడస్నిగ్ధంబగుటవలన ప్రతిఫలించుచుండును) ధీరతారస్వరత్వాత్ = గంభీరమైనయున్నతధ్వని కలుగుటవలనను, కంఠము (శంఖముఊదినపుడు పెద్దధ్వనిజేయునది) కంబుః = శంఖము, దయితగళతః = నీభర్తయొక్క కంఠముతో, సామ్యం = పోలికను, కించిత్ = కొంచెము, అభ్యేతి = పొందుచున్నది. నూనం = నిశ్చయముగ సాకల్యం = సంపూర్ణత్వమును (అనగా సామాన్యమును) నో = పొందలేదు. తతఇవ = పూర్తిగసామాన్యమును, పొందలేకపోతినను హేతువున, అత్ర = అశంఖమందు, పరం = మిక్కిలి, పాండిమా = తెల్లఁదనము ఆలక్ష్యతే = కనఁబడుచున్నది.

తాత్పర్యము. కరీంద్రజీమూత వరాహశంఖమత్స్యాహిశుక్త్యుద్భవ వేణుజాని ” యనుటవలన శంఖమున ముత్యములుండుటయు, చక్కనిగీతలుం

డుటయును, నునుపుగానుండుటవలన వస్తువులు ప్రతిఫలించుటయు, గొప్పగా ధ్వని చేయుటయు శంఖమునకు స్వభావములు. యక్షునికంఠమున ముక్తాహారములు గలుగుటవలనను, శుభచిహ్నములగు రేఖలుండుటవలనను లావణ్యముగల్గుటచే వస్తువుల ప్రతిబింబమును గ్రహించుచుండుటవలనను, గంభీరస్వనముగలదౌటవలనను, శంఖమీతని కంఠముతో పోలవచ్చి సమర్థముగానుండుటచే పరాభవమునొంది తెల్లబోయెనని తాత్పర్యము. శంఖమందు ముత్యములెల్లపుడు నుండకపోవుటచేతను, కాంతిహీనముగలదౌటచేతను, స్వయముగా ధ్వని చేయలేకపోవుటచేతను యక్షుని కంఠమున కోడెనని ధ్వనించుచున్నది.

శ్లో॥ అంసావస్య శ్రుతిపరిచితౌ మానసంచ ప్రతీతం
తన్వంతావప్రకటనమధో పశ్యతాం దేహభాజాం
నైజాత్స్వవృత్తాద్వలయయుగళీవృత్తతాం సంప్రకృష్టాం
వ్యాతన్వానౌ పరమలసతాం శ్రేష్ఠరూపౌ ప్రకోష్ఠౌ ॥

ఉ॥ వానిభుజంబులా శ్రుతి విభాగ్యులు మానసమా శ్రుతీతమా
వానిప్రకోష్ఠముల్లనెడివారికిఁ బూర్తిగగానరాకయే
వానిస్వభావవృత్తములవారిగఁగంకణవృత్తరూపస
న్మానమొసంగ శ్రేష్ఠములనంగడుశోభలనీనెనమ్మరో. ౩౪.

అర్థము. అస్య = వీని, అంసౌ = బుజములు, ప్రతిపరిచితౌ = చెవులనంటినవి, మానసం = మనస్సు, ప్రతీతం = వేదోక్తధర్మమందాసక్తిగలది. శ్రేష్ఠరూపౌ = చక్కనివైన, ప్రకోష్ఠౌ = ముంజేతులు, పశ్యతాం దేహభాజాం = చూచువారికి. అధో = పూర్ణముగ, అప్రకటనం = కానబడకుంటను, తన్వంతౌ = చేయుచున్నవగుచు, నైజాత్ = స్వకీయమైన. (స్వభావసిద్ధమైనయనియర్థాంతరము.) వృత్తాత్ = గుండ్రతనముకంటె, వలయయుగళీవృత్తతాం = మురుగులగుండ్రతనమును, ప్రకృష్టాం = అధికముసుగా, వ్యాతన్వానౌ = చేయుచున్నవగుచు, పరం = మిక్కిలి, అలసతాం = ప్రకాశించినవి.

తాత్పర్యము. అతనిభుజాగ్రములు బలిసి కర్ణపర్యంతము వ్యాపించినవి. ఎగుభుజములు గలుగుట మహాపురుషలక్షణము. వీనిమనస్సు ధర్మాసక్త

మైనది. వీనియుం జేతులు వలయస్థానమున తమనిజస్థితి నితరుల కనుపఱుపక యు తమనాశ్రయించిన కంకణములను, నిజవృత్తమువలన, అనగా తాము గుండ్రముగ నుండుటవలన కంకణముల గుండ్రతనమును వృద్ధిచేయుచున్నవి.

“ వృత్తము ” నకు స్వభావమర్థంబగుటవలనలోకమందు మంచిస్వభావముగలవాఁడు తనమంచిస్వభావమును పరులకు స్వయముగా బ్రకటింపకయే, స్వాశ్రయుల వృత్తమును శ్రేష్ఠమైనదానిగా జేయుటవలన ప్రకాశించుచున్నాఁ డని ధ్వనించుచున్నది.

శ్లో॥ పాణీబాణాసనగుణపరిస్పర్శనోద్యత్కిణాళీ
సంజాతాంగుళ్యధికవిభవౌ హల్లకస్ఫూర్తిశోభా
దోషౌజంభాసురకరికరాక్షిప్త దోషౌసశేషౌ
సాదృశ్యేతావనుపమజయశ్రీపదేవ్యాపదేతౌ ।

చ॥ కరతలమల్లెరాపడిని గాయలుగాచిన వ్రేళ్లశోభచే
సరగుననెఱ్ఱగల్వలపిశంకటవృత్తి జయించెచిత్రమా
సురకరిహస్త సంపదల సొక్కఁగఁజేయఁగఁజాలుచేతులా
దరమున వానిఁబోల్చుటకు ధాత్రినిగన్పడకుండె వస్తువుల్ ౩౯.

అర్థము. బాణాసన = ధనుస్సుయొక్క, గుణ = త్రాటియొక్క, పరిస్పర్శన = త్రాఁకుడుచేత, ఉద్యత్ = పుట్టిన, కిణాళీ = కాయలయొక్కసంపుచేత, సంజాత = పుట్టిన, అంగుళ్యధికవిభవౌ = వ్రేళ్లయొక్క అధికమగు శోభగల, పాణీ = అతనిచేతులు, హల్లకస్ఫూర్తిశోభా = కలువలతీరుస్ఫురించు శోభకలవి. తౌదోషౌ = ఆహస్తములు, జంభ = జంభుఁడనెడిరాక్షసునియొక్క అసుర = ప్రాణములుతీసినయింద్రునియొక్క, కరికర = ఐరావతముయొక్క తొండమునకు, ఆక్షిప్తదోషౌ = కల్పించినదోషముకలవియును, సాదృశ్యే = పోలికయందు, సశేషౌ = మిగులుతో గూడినవియు, (అనగా సాటిలేనివనుట) వ్యాపదేతౌ = సుఖముచేనొప్పినవై, అనుపమజయశ్రీపదే = సాటిలేనిజయలక్ష్మికిస్థానములునై, భాతః = ప్రకాశించుచున్నవి.

తాత్పర్యము. ధనురాకర్షణముచేత కాయలుకాచినవైనను అతనికరతలములు వ్రేళ్లకాంతిచే భాసిల్లుచు నెఱ్ఱకలువలఁబోలెను. కరములు ఐరావతముతొండమువలె బలిష్ఠములై యుండెననియు సుఖముగ, ననాయాసముగ నే జయలక్ష్మిని పొందువాఁడనియు తాత్పర్యము, దీనివలన విలువిద్యయందు మిగుల నైపుణ్యముగలవాఁడగుటచే శత్రువుల సులభముగా జయింపఁగలవాఁడని తెలియుచున్నది.

శ్లో॥ ఊరూతస్య హ్రియమనయతాంమంజురంభాతరూణాం
శుండాదండస్యచసురపతేర్దిగ్గజైరావణస్య
నాసాచాంపేయకమపిముఖవ్యాజపీయూషభానో
స్సక్తేర్వీక్షామధుపనికరానశ్రమాన్సంవిధత్తే ॥

మ॥ అరటులసిగ్గుగొల్పును సురాధిపదిగ్గజహస్తసంపదన్
నరగునమాపు పెందొడలు సంపగియౌ చనుదానునాసనం
బరముగఁజూపులన్మధుపపాళికి నాస్యసుధాకరాప్తిచే
వఱలఁగఁజేయుసౌఖ్యమిల సాధ్వి హోవానినుతింపశక్యమే, ౫౬

అర్థము. తస్య = వానియొక్క, ఊరూ = తొడలు, మంజురంభాతరూణాం = సుందరములైనయరటిచెట్లకును, సురపతేః = ఇంద్రునియొక్క, దిగ్గజైరావణస్య = దిగ్గజమగునైరావతముయొక్క, శుండాదండస్యచ = తొండమునకును, హ్రియం = సిగ్గును, అనయతాం = తెచ్చినవి, నాసాచాంపేయకమపి = సంపంగిపువ్వుఁటి యతనినాసికమును, ముఖవ్యాజ = ముఖమనుమిషనొందిన, పీయూషభానోః = అమృతకిరణునియొక్క, అనగా చంద్రునియొక్క, సక్తేః = సంబంధమువలన, వీక్షామధుపనికరాన్ = చూపులనెడి తుమ్మెదలను, అశ్రమాన్ = బాధలేనివానినిగా, సంవిధత్తే = చేయుచున్నది.

తాత్పర్యము. వానియూరువులు సుందరములగు నరటిచెట్లను, ఐరావతముయొక్క, తొండమునుగూడ తిరస్కరించుచున్నవి. వానినాసిక సంపంగివలె నున్నది. వీనిచూపులుతుమ్మెదలవలె నున్నవి. సంపంగిపువ్వు తుమ్మె

దలకు విరోధమగుట వలన నీరెండు నేకస్థలమున నుండుట యసంభవము. కాన నిచ్చట నెట్లుండెననగా ముఖమును చంద్రుడు తన యమృతధారలచే సంపంగివలన తుమ్మెదలకు గలుగు బాధను తొలగించుచున్నాడని తాత్పర్యము.

శ్లో॥ హృద్దేశోఽస్యక్షపితభృగుధర్మోఽపి జాతిప్రసూన
శ్రీమాంజుల్యంహరతినితరాంతన్వితత్ర్యాదృశౌచ
పాణీమార్ద్వీనికషణకిణప్రోల్బణౌశోణిమానం
మాద్యత్పుష్పంధయపరివృతోత్ఫుల్లరక్తోత్పలస్య ॥

చ॥ తరుణిరొ వానిరొమ్ముజితంబగుసద్భృగుధర్మమయ్యుసుం
దరమగుజాజిమార్దవమునన్ గనుపట్టె, కరద్వయంబుబం
ధురతతిగల్గుచెంగలువబాతిగనెఱ్ఱగనారిరాపిడిన్
గరముగఁగాననయ్యెపెనుగాయలుగాచినవౌటఁజూడఁగన్ ౩౭.

అర్థము. తన్వి = ఓయమ్మాంగనా, అస్య = వీనియొక్క, హృద్దేశః = హృదయప్రదేశము, క్షపిత = తిరస్కరింపబడిన, భృగుధర్మాపి = కొండప్రదేశముయొక్క కాఠిన్యవైశాల్యరూపమైన ధర్మముగలదైనను, (భృగుమహర్షియొక్క ధర్మముఅనియు నర్థాంతరము) జాతిప్రసూన = జాజిపువ్వులయొక్క, శ్రీమాంజుల్యం = మంచిమార్దవమును, హరతి = తిరస్కరించుచున్నది. తత్ర్యాదృశౌ = అట్టిప్రసిద్ధములగు, పాణీచ = చేతులున్ను, మార్ద్వీనికషః = నారిరాపిడివల్లనైన, కిణ = కాయలచేత, ప్రోల్బణౌ = ఉబ్బినవై, మాద్యత్ = మదించిన, పుష్పంధయ = తుమ్మెదలచేత, పరివృత = ఆవరింపఁబడిన, ఉత్ఫుల్లరక్తోత్పలస్య = విచ్చినయెఱ్ఱకలువయొక్క, శోణిమానం = ఎఱ్ఱఁదనమును, హరతః = తిరస్కరించుచున్నవి. (అని అధ్యాహారము.)

తాత్పర్యము. నీపెనిమిటియొక్క వక్షస్థలము కొండ చరియనుబోలి విశాలముగా నుండినను, మార్దవముచే జాజిపువ్వులను తిరస్కరించుచున్నది. హస్తములు నారిరాపిడివల్లనైన కాయలుగలవౌటచేత తుమ్మెదలతోఁగూడిన ఎఱ్ఱకలువలవలె ప్రకాశించుచున్నవి.

ములను ముక్త్యాలహారములతోఁ గూడిన నీవక్షోజములు గాను, వానినడకను నీవ నడకగాను, తలఁచి పరిశీలించి చూడ, నవినీయవయావములతోను విలాసములతోను బోల్పదగినవి కావని కొంచోలను పెదవివిటిచి యనాదరమును జూపుచున్నాడు.

“ ముక్తాంతరవిలసనా ” ఏనుగులకుంభస్థలములయందు ముత్యములు గలుగుట రత్నశాస్త్రప్రసిద్ధము. కావున కుంభస్థలములు ముక్తాంతరములు ఆమె ముక్తాహారముల ధరించియుండుటచే నావక్షోజములును ముక్తాంతరములగుట సాదృశ్యము సిద్ధించుచున్నది. “ ఉన్మీల్య ” విరహులు ప్రియాసాదృశ్యముగల వస్తువులనైనగని స్వతాపోపశమనంబుఁ జేసికొనఁ జూతురుగాన నరణ్యమున హఠాద్దృష్టములగు గజగమనంబుల జూచి ప్రియురాలినడలనిశ్చి మించితన్ని జానిజములనిర్ధారణజేసికొన బరిశీలించుటకు నేత్రముల బాసుగ విప్పెను. “ నిశ్వాసవాతం ” భ్రమపడి సంతోషముతో జూచినను, పరిశీలించి చూచునప్పటి కవిప్రియురాలి నడకనుగాని యవయవములకుగాని సరిరాకుండుటచే నాశాభంగమగుటవలన నిట్టూర్పువిడిచెను. వియోగమందు మనస్స్వస్థతలేనివారిట్లు సదృశవస్తువులచే కాలము గడపుటవలన తాపోపశమనమగుట.

“ వియోగేఽయోగవా ప్రియ జనసదృశానుభవనం
తతశ్చిత్రంకర్మ స్వపనసమయే దర్శనమపి
తదఙ్గస్పృష్టానాముపనతవతాం స్పర్శనమపి
ప్రతీకారోఽనంగ వ్యథితమనసాంకోపిగదితః ॥ ఇట్లువర్ణింపఁబడియె.

“ భంగరమ్యంతనోతి ” యనునది యుత్తరమేఘమున యక్షుఁడు చెప్పిన “ హన్తైకస్మిఙ్క్వచిదపినతె చండిసాదృశ్యమస్తి ” యని శాపమువలన ప్రత్యక్షముగా నిన్నుజూడలేకున్నను సాదృశ్యాదికముచేనైన మనమున కూరట గలుగ జేసికొనెదమన్నట్టి సాదృశ్యము మెచ్చుట గానరాకపోయెగదా యని యక్షుడు సందేశమున పలుకుటను జ్ఞాపకము చేయుచున్నది.

శ్లో॥ వల్లీర్వన్యారుచిర కుసుమస్తోమగుచ్ఛాభిరామా
యాతాయాతప్రసవవిల సత్పింప్సలిటాఫలిరమ్యాః

హీరాంకూరస్ఫురణముకుళాశ్శశ్వదాలోక్యరాగీ
తీక్ష్ణశ్వాసైర్జితకిసలయందూషితందంతచేలం ॥

చం॥ సురుచిరపుష్పగుచ్ఛములశోభలనీనుచు వజ్రిఖండవి
స్ఫురణవహించిమించుపువుమొగ్గల వచ్చుచుబోవుచుండుబం
భరములఁజక్కనైనప్రసవంబులు గల్గినతీవెగుంపులన్
దరచుగఁజూచిదంతవసనంబునఁ గందగనీడెనూర్పులన్ ॥౩౯॥

అర్థము. రుచిరకుసుమస్తోమగుచ్ఛాభిరామాః = చక్కనిపూలగుత్తులచే నందమగునట్టియు, యాతాయాత = రాకపోకలచేత, ప్రసవవిలసత్ = పుష్పములయందుఁబ్రకాశించు, పుష్పలిడ్భిః = తుమ్మెదగుంపులచే, రమ్యాః = చక్కనివైనట్టియు, హీరాంకూర = వజ్రపుముక్కలయొక్క, స్ఫురణ = రీతిగల, ముకుళాః = మొగ్గలుగలిగినట్టియు, వన్యాఃవల్లీః = అడివితీగలను, శశ్వత్ = మాటిమాటికి, ఆలోక్య = చూచి, రాగీ = ప్రేమగలవాఁడై, జితకిసలయం = చిగురుకంటెనెక్కువగానున్న, దంతచేలం = పెదవిని, తీక్ష్ణశ్వాసైః = వేడియూర్పులచేత, దూషితం = మలినముగా చేయుచున్నాఁడని యనువర్తింపనగును.

తాత్పర్యము. మఱియు నాయకుండు వజ్రిజములబోలు పూగుత్తులను, పూవులనుబోలు, మకరందమునకై పుష్పముల పైవ్రాలు తుమ్మెదలను, నేత్రధావళ్యమును బోలు తెల్లనిమొగ్గలను, గలిగియున్న నీశరీరమువంటి లతనుఁజూచి ప్రేమచే నీవేగదాయని తలఁచినవాఁడై, అట్లుగాకపోవుటచే నాశాభంగము గలవాడై వేడి నిట్టూర్పువిడుచుటచే కిసలయమును బోలువాని యధరోష్ఠము వాడినదై మలినమయ్యెను.

శ్లో॥ కామాభోలాశయవనమృగీలోలనేత్రాంచలాంతాన్
పౌనఃపున్యప్రసృతవయసో వీక్ష్యనిష్పత్తిపాతం
వాతాఘూతామృతధర దశాంకల్పయన్స్మర్తదేశ
స్యానీలాక్షాలకకలనతశ్శ్వాసముష్ణంచకార ॥ ॥౪౦॥

ఉ॥ వనమున యౌవన ప్రభలభ్యాసిలి మారవశంవదంబులై
దనరు మృగీకటాక్షములఁ, దద్దయు గాంచుచుఁ గన్నుమూయకే
ఘనమగు వేడియూర్పువిడి. కంపముఁ జేయ శిరంబు నీలస
న్మణితతిఁ బోలు వాని శిఖ మారుతకంపితయభ్రమాయెగా. ॥౮౦॥

అర్థము: పౌనఃపున్య = మాటిమాటికి. ప్రస్ఫుటితయౌవనస్య = ప్రకటితయౌవనములైన, కామాలోలా...లాంతాః, కామాలోల = మన్మథవశములైన, వనమృగీ = అడవిలేళ్ళయొక్క, లోల = చంచలములైన, నేత్రాంచలాంతాః = ప్రక్కచూపులను, నిష్ప్రత్యూహపాతం = రెప్పపాటులేకయే, వీక్ష్య = చూచి, నీలాశ్మాలక = ఇంద్రనీలముల కాంతిగల ముంగురులయొక్క, కలనాత్ = అవరించుటవలన, శీర్షదేశస్య = శిరోభాగమునకు, వాతాహత = గాలిచేఁగంపింపబడిన, అమృతధర = మేఘముయొక్క, దశాం = స్థితిని, అనగా సాదృశ్యమును, కల్పయన్ = చేయుచు, శ్వాసం = నిట్టూర్పును, ఉష్ణం = వేడిగా, చకార = చేసెను.

తాత్పర్యము. మఱియు నాయక్షుఁడు, యౌవనముచే మించియున్న లేళ్లయొక్క చూపులను మాటిమాటికి రెప్పవేయక చూచి, నీచూపులతో సమానముగాకపోవుటచే, వీనికి సాదృశ్యమైన లభించుట దుర్లభమాయెగదాయని శిరఃకంపము జేయుచు నిట్టూర్పువిడిచెను. అట్లు కంపించుటవలన కదలిన నల్లని ముంగురులు గలవాని శిరంబు వాయువుచే చలింపజేయబడిన మేఘమండలము వలె గనబడినది.

లేడిచూపులకును, స్త్రీలచూపులకును నుపమానోపమేయ భావము. కావుననే లేడిచూపులనంత శ్రద్ధతో జూచినాడు. అందులో "కామాలోలాయ" ములగుటవలన వానిచూపులును చేష్టలును మఱింత రమ్యములై యుండును. ఈశ్లోకము ఉత్తరమేఘమున యక్షుకుచెప్పిన వృత్తాంతములో "చకితహరిణీప్రేక్షణేదృష్టిపాతం ఉత్పశ్యామి" యని చెప్పినదానితో సరిపోవుటవలన నీయాశయమునే మేఘుడు విశదీకరించి చెప్పినట్లున్నది.

శ్లో॥ తత్రత్యా అప్యహ మవిరతం తస్య తత్తత్ప్రవృత్తం
సంవీక్ష్యైష ప్రకృతివిలసత్కాంతయా విప్రయుక్తః
తస్మాత్తస్యా అవయవచయస్యార్హతాం నో విజాన
న్నిశ్వాసాదీ న్ప్రకటయతి చేత్యేవ ముద్వ్యద్వితర్కాః ॥

మ॥ అనయము నేను చిత్రగిరియందున వాసము సల్పువారు య
త్కునిచయుఁ డంబులెల్ల వెసఁ జూచి యితండొక సుందరాంగి యా
వనితను బాసి యాయవయవంబులఁ బోలిన వస్తువారముల్
గనమి మనోవికారమును గాంచినవానిగ నెంచినాము గా ౪౧.

అర్థము. తత్రత్యాః = ఆచిత్రకూటవాసులును, అహమపి = నేనును. అవిరతం = ఎడతెగకుండ, తస్య = వానియొక్క, తత్తత్ప్రవృత్తం = ఆయా వ్యాపారములను, సంవీక్ష్య = చూచి, ఏషః = ఇతడు, ప్రకృతివిలసత్కాంతయా = స్వభావముచేఁ జక్కనిదియగు భార్యతో, విప్రయుక్తః = వియోగము పొందినవాడు, తస్మాత్ = అందువలన, తస్యాః = ఆప్రియురాలియొక్క, అవయవచయస్య = అంగసముదాయమునకు, అర్హతాం = తగియుంటను, అనఁగ తగినసాదృశ్యమును, నోవిజానన్ = ఎక్కడ తెలిసికొననివాడై, నిశ్వాసాదీన్ = నిట్టూర్పు మొదలుగాఁగల యనాదరసూచనలను, ప్రకటయతి = కనుపఱచుచున్నాడు. ఇత్యేవం = అని ఈప్రకారముగా, ఉద్యద్వితర్కాః = అనుకొన్నవారమైతిమి.

తాత్పర్యము. చిత్రకూటమున వియోగావస్థ ననుభవించుచున్న నీ పెనిమిటి వ్యాపారములను మేమందఱము జూచి సుకుమారియగు తన ప్రియురాలి నెడబాసినకతన నామె యవయవసదృశవస్తుదర్శనము చేత దన పరితాపము మాన్పుకొనఁ దలచి అట్టివస్తువులనైన నెచ్చటను గానకుండుటచే పరితాప మధికమైన నిట్టూర్పుల విడుచుచున్నాడని తలచితిమి.

శ్లో॥ హాతభ్రంశాద్గురుతరమురస్తస్య ఘర్మాంశుదీప్త్యా
శేషాక్షిప్తప్రచురమిహికాబిందు సందోహపాళేః

పారిపత్యస్యామరపదగిరేఃసాహచర్యంసుపూర్ణం
స్వాభావేనశ్రియమపహరేత్తద్ధికింభూషణంస్యాత్ ॥

ఉ॥ సరములుజారసీపతి విశాలతరోరముగాంచచండభా
స్కరకరతప్తమైనహిమసంతతిచే నలరారుమేరుభూ
ధరవరసాహచర్యమునుదాల్చెను దానటలేకయున్నసుం
దరతహరింపకున్నదగ, నాజనునాదగునాధరాస్థలిన్ ॥౪౭॥

అర్థము. సురుతరం = గొప్పదైన, తస్య = వానియొక్క, ఉరః = వక్షస్థలము, హారభ్రంశాత్ = హారములుతొలగిపోవుటవలన, ఘర్మాంశుదీప్త్యా = సూర్యకాంతిచేత, ఆశేషాక్షిప్త = నిశ్శేషముగా పోగొట్టబడిన, ప్రచురమిహికాబిందుసందోహపాశైః = విశేషముగ మంచుబిందువుల వరుసగల, తస్యఅమరపదగిరేః = ఆప్రసిద్ధమైన మేరుపర్వతముయొక్క, సుపూర్ణం = పరిపూర్ణమగు, సాహచర్యం = పోలికను, పారిపత్ = పొందెను. యత్ = ఏది, స్వాభావే = తనులేకుండగా, శ్రియం = శోభను, నాపహరేత్ = పోగొట్టదో, తద్ధి = అదియైతే, భూషణం = అలంకారము, స్యాత్ కిం = అవునా.

తాత్పర్యము.—యక్షునివక్షస్థలము ముత్యాలహారముతో శూన్యమగుట చే, సూర్యకిరణములతాపన, పోయిన మంచుబిందువులు గలుగుటచే తళతళలాడు మేరుపర్వతపు చరియతో సమానముగా నుండెను. భూషణమనగా తన సాహచర్యము వీడినపుడు నలంకృతమగుదాని శోభనుహరించునట్టిదేకాని మఱియొండుగాదు. కావున సహజసౌందర్యముగల యీతని వక్షమున ముత్యాలహారము మేరుపర్వతము నావరించిన మంచుబిందువుల వరుసవలె నున్నది. అనగా సహజ సౌందర్యవంతుల ప్రకాశావకాశములకు భూషణములు కారణములుగాలేవని తాత్పర్యము.

ఇంతకు మునుపు "తతోదంతే" ఇత్యాది ౩౦ వ శ్లోకమునుండి పైశ్లోకమువఱకును, "పురాక్రీదృగాసీ" త్తని ౨౭ వ శ్లోకమున యక్షకాంత తన్నడిగిన ప్రశ్నకు సరిగా యక్షుని పూర్వావస్థావర్ణన జేసి, "సంప్రత్యాస్తె కథమి

తమప్రాణనాథః ” అనుదానికి నుత్తరమీయదొడంగి, కాళిదాసుని పూర్వమేఘమున, మేఘదర్శన సమయమున నవయువైకగ్రహణముచే శరీరమంత యుక్ర్ంచియుండెనని సూచించునట్లుగా “ కనకవలయభ్రంశరిక్త ప్రకోష్ఠః ” అని వర్ణింపబడిన యక్షుని యాకారము మనమున నుంచుకొని, హారభ్రంశ మొదలగు నున్మాదావస్థ సూచకములను వానితో మొదలు పెట్టెను.

శ్లో॥ జ్ఞాతాజ్ఞాతక్రమవిగళితా కల్పజాలస్యతస్య
ఛాయాహీనంప్రియసఖ మభూత్తద్వపుస్త్వేకకాలే
చూతస్యాత్యాహితదపవనాభుగ్న శాలాటవస్య
ప్రుష్వాకీర్ణంతదపినముమోచాంగ మాత్మీయశోభాం ॥

ఉ॥ తెలిసియనాదరంబునను, తెల్వియొకింతయులేమిభూషణం
బులువడివోవనొక్కతఱిపోడిమి దక్కినమేనుగాలికా
యలువెసరాలుమామిడికి నాప్తమునాదగియున్నస్వేదసం
కలితమునాఁగనీమగనికాయము సాజపుకాంతివీడెనే ॥౮౩॥

అర్థము.—జ్ఞాతాజ్ఞాత = తెలిసినట్టియు తెలియనట్టియు, క్రమ = రీతిచేత, విగళిత = పోయిన, ఆకల్పజాలస్య = నగలవరుసగల, తస్య = ఆయక్షునియొక్క, ఛాయాహీనం = కాంతిలేని, వపుః = శరీరము, అత్యాహితద = మిక్కిలియుపద్రవముజేయు, పవన = గాలిచే, ఆభుగ్నశాలాటవస్య = రాలిపోయినకాయలుగల, చూతస్య = మామిడిచెట్టునకు, ప్రియసఖం = సమానము, ఏకకాలే = ఒకసమయమున, అభూత్ = ఆయెను. తదపి = అలాగైనను, ప్రుష్వాకీర్ణం = జలబిందువులచే వ్యాప్తమైన, అంగం = శరీరము, ఆత్మీయాశోభాం = నైజమైన సౌందర్యమును, నముమోచ = విడువలేదు.

తాత్పర్యము.—తెలిసినపుడు అనాస్థచేతను, తెలియనపుడు తెలియకుండుటచేతను, క్రమముగా శరీరమునుండి జారిన నగలుగల యాయక్షుని శరీరము పెద్దగాలికి రాలిపోయిన కాయలుగల మామిడిచెట్టువలె నుండెను, గాని చిరుచెమటబట్టిన యతని శరీరమునకు స్వాభావిక శోభ యొంతమాత్రము తగ్గలేదు.

"జ్ఞాతాజ్ఞాత" యనుటవలన, వియోగమున వాని యున్మాదావస్థ తెలియుచున్నది. "విగళితాకల్పజాలస్య" యనునది "కనకవలయభ్రంశరిక్తప్రకోష్ఠః" అను పూర్వమేఘ వర్ణనతో సరిపోవుచున్నది. "చూతస్య" కాయలతో నిండియున్న మామిడిచెట్టు చూచుటకు మిగుల సొంపుగానుండును. కాని పెద్దగాలివేసిన నాకాయలన్నియు రాలిపోవుటే గాక, కొమ్మలువిరిగియు, సరిగానున్న యాకులు, కొమ్మలు నడ్డదిడ్డంబులై శోభతగ్గియుండును.

శ్లో॥ మ్లానంమ్లానంవకుల కుసుమంస్వీయసౌరభ్యలక్ష్మీ
మప్యాదత్తేతవవిరహాతఃక్లిశ్యమానంచమాతః
దేహాంతస్యప్రకృతిసుభగం శుంభతేదంభవృత్తేః
క్షీరంసంతప్తమపిమధురంసేవ్యతే సర్వలోకైః ॥

ఉ॥ వకులసుమంబువాడఁగను వాడఁగఁదావులీనునట్లుదా
వకపతిచిక్కినక్ విరహబాధలఁజిత్తమునన్యకామినీ
నికరముఁజేరకుండుటగణింపఁగనయ్యెనుమేనికాంతిపా
వకపరితప్తమౌకొలఁదిపాలురుచింపవె లోకపంక్తికిన్ ౭౭.

అర్థము.—వకుళకుసుమం = పొగడపువ్వు, మ్లానంమ్లానమపి = మిక్కిలివాడిపోయినను, స్వీయసౌరభ్యలక్ష్మీం = స్వాభావికమైన పరిమళసంపత్తును, ఆదత్తే = గ్రహించును. (ధరించుననుట) గనుక మాతః = తల్లీ, అదంభవృత్తేః = పరాంగనాసక్తి మొదలైనవాని వలన, కపటవృత్తి లేనట్టి, తస్య = వానియొక్క, ప్రకృతిసుభగం = స్వభావసుందరమైన, దేహం = శరీరము, తవవిరహాతః = నీవిరహముచేత, క్లిశ్యమానం = బాధితమైనను, శుంభతే = ప్రకాశించుచు నేయున్నది. మధురం = తియ్యనిదగు, క్షీరం = పాలు, సంతప్తమపి = కాచబడినవైనను, సర్వలోకైః = అందఱచేతను, సేవ్యతే = అనుభవింపఁబడుచున్నవి.

తాత్పర్యము.—నీవిరహతాపముచేత బాధితమైన యతని శరీరము కృశించినను శోభతగ్గియుండలేదు. ఏలయన శాపనిహతుడైనను గర్వమునువదు

లక పరాంగనాసక్తుఁడై చరించుచుండిన, వాని నైజకాంతి యాపాపసంసర్గమున క్షీణించునుగాని, యెల్లప్పుడు నిన్నేతలఁచుచు నేకపత్నీవ్రతుఁడైన వాని శరీరము గాసిజెందినను కాంతిహీనముగాదు. మఱియు లోకమున సౌందర్యవంతులు చిక్కినను, సహజకాంతి వీడదు. ఎట్లన పొగడపువ్వు వాడినను సహజ పరిమళము వీడదు. క్షీరములు తప్తములైనకొలది వానిమాధుర్యము హెచ్చును.

"వపుస్తనుము" మ్మనుటవలన వీనిశరీరమతిసుకుమారమై మృదువై నదని తెలియుచున్నది. "అదంభవృత్తేః" అనుట నాయకుడు గర్వించియుండక పరాంగనా సాంగత్యమున మనసుజారనీక యింద్రియ నిగ్రహముగల వాఁడగుటచే నికముందు జెప్పబోవునటుల ధ్యానాదికముచేతను తపస్సుచేతను కాలము పుచ్చుచున్నాడని సూచించుచున్నది.

శ్లో॥ తిష్ఠత్యేవం ప్రియసుహృదయం కాయమాత్రేణతత్ర
త్వయ్యాయత్తప్రణయగురుణాచాంతరంగేణనిత్యం
తస్మాచ్ఛాపావధిమథకథంకారమప్యత్రసోఢుం
ఘస్రాంతంవాఖలుకుముదినీత్వార్హసిత్వంముదైవ ॥

మ. నిలిచెనుగానిచిత్రగిరిసీపతిఁగాంచశరీరమాత్రుఁడై
నిలిపెనుప్రాణవర్గమును నిత్యమునీపయిఁబ్రేమధైర్యముం
గలిగిముదంబునన్గడుపుకాలము నెట్టులయిన సంజలో
దలఁచెడుకల్వతీవవలె, తల్లిరొ సౌఖ్యములబ్బకుండునే ॥౭౫॥

అర్థము.—ప్రియసుహృదయం = నీప్రియుఁడైనయక్షుడు, కాయమాత్రేణ = శరీరముచేత మాత్రము, తత్ర = ఆచిత్రకూటపర్వతమందు, నిత్యం = ఎల్లప్పుడు, త్వయి = నీయందు, ఆయత్త = ఆధీనమైన, ప్రణయగురుణా = స్నేహాతిశయముగల, అంతరంగేణ = మనస్సుచేత, తిష్ఠతి = ఉన్నాడు. తస్మాత్ = అందువలన, అథ = ఇకను, అత్ర = ఈసమయమున, కుముదినీ = కలువతీగె, ఘస్రాంతంవా = సాయంకాలమునువలె, త్వం = నీవు, శాపావధిం = శాపముయొక్క అంతమును, ముదైవ = సంతోషముతోనే, కథంకారమపి = ఎట్లుగానో, సోఢుం = సహించుటకు, అర్హసిఖలు = తగియుందువు

తాత్పర్యము.—నీప్రియుడు సహజసౌందర్యము గలవాఁడైనను నీవియోగముచే కృశించి శరీరమాత్రుఁడై నీయందనురాగముచే ప్రాణముల నీయందనిలుపుకొని యున్నాఁడు. శాపాంతమున నిన్నుఁజూడఁగలుగుదుననునాశచేతనే జీవించియున్నాఁడని తాత్పర్యము. అందువలన నిప్పుడు నీవెట్లయినను సంతోషముతో, కలువతీవె చంద్రదర్శనమునకై సాయంకాలముయొక్క రాకకై వేచియుండునట్లు స్వల్పకాలము విరహము సహించి శాపావధిని వేచియుండుము.

‘ఘ్రస్రాంత’ మిత్యాదికమువలన సూర్యతాపముచే వాడిన కలువ క్షణములకొలది పగటికాలము తగ్గుచుండుటవలన సాయంకాలము సమీపించుచున్నదను నాశచే నెట్లుకాలముగడుపునో, యట్లే «ఆశాబంధః కుసుమసదృశం» అని పూర్వమేఘమున చెప్పినట్టుల శాపావధియందు ప్రియసమాగమము కాఁగలదను నాశచే బ్రదికియుండునని నమ్మియున్న యక్షాభిప్రాయాను సరణముగ, మేఘుడు తనరాకచే (అనఁగా వర్షఋతుప్రాప్తిచే) శాపావధియు సమీపించెను గాన నెట్లయినను సహించి యూరడిలియుండుమని చెప్పుచున్నాఁడు. «కాయమాత్రేణ» ఆయనశరీరము మాత్రమే యక్కడనున్నది కాని మనోవ్యాపారములన్నియు నీయక్షియందే లీనమైయున్నవనుట. «తవసహచరో రామగిర్యాశ్రమస్థః అవ్యాపన్నః» చిత్రకూటమందవ్యాపన్నుఁడై, అనఁగా బ్రదుకుమాత్రము గాంచియున్నవాఁడు గాని ప్రాణములీమెనే చేరియున్నవని చెప్పియుంపుటను, మేఘుడు తిరిగి చెప్పుచున్నవాఁడుగ నున్నాఁడు. మఱియు «అంగేనాంగం ప్రతనుతనునా......దూరవర్తీ సంకల్పైర్విశతి» శరీరము దూరమందుండుటవలన స్పర్శాదికము గాకున్నను, మనోవ్యాపారముల నడ్డగించువారు లేనందునను ఈమనము జడశరీరమువలెఁ గాక, యణురూపముగలదై దేశకాలవ్యవస్థల నతిక్రమింప సమర్థముగలదౌటవలన నామెశరీరమును సంకల్పరూపమున ప్రవేశించుచునేయున్నదనియు, చెప్పిన యక్షాభిప్రాయమును మాఱువలుకుచున్నాఁడు. «ఆయత్తప్రణయగురుణా» యనునది ఉత్తరమేఘమున «ఆస్యాః ప్రణయిని మయి స్వప్నలబ్ధైకథంచిత్» అనునప్పటి యక్షాశయమువలన స్వీకృత మగుచున్నది.

శ్లో॥ శూరంవీరంసదయహృదయం సౌదరీమందిరంతం
మన్యేత్తేస్తైస్స్ఫుటతమపదైరంబవిశ్వాసమేహి
ప్రాగేకాసీన్నుతమతికథాశ్రూయతాంసంప్రతీతః
కాలుష్యంతేసకలమపితద్ధ్వాంతమర్కాదివేయాత్ ॥

చ॥ జననివిశ్వసింపుమను. చక్కదనంబులకిక్కయౌనునీ
పెనిమిటిశూరుఁడౌను మఱివీరుఁడునౌనుకృపార్ద్రచిత్తుఁడౌ
ననిభువిచాటుచిహ్నములుపోవినుపింతు చరిత్రమొక్కటేఁ
వినమనిసంశయంబువిడు, వేడివెలుంగునధ్వాంతమున్బలెఁ రట॥

అర్ధము.—అంబ = ఓతల్లీ, తైస్తైః = అయా, స్ఫుటతమపదైః = మిక్కిలిస్పష్టమైన పదములచేత, తం = నీభర్తను, శూరం = శూరునిగాను, వీరం = వీరునిగాను, సదయహృదయం = దయాస్వభావముగలవానినిగాను, సౌందరీమందిరం = "యత్రాకృతిస్తత్రగుణాః" అన్నట్లు సౌందర్యమునకు స్థానమైనవానిగాను, మన్యే = తలచెదను, విశ్వాసంఏహి = విశ్వాసముగలదానవగుము-నమ్ముమనుట. నుతమతీ = మంచి ఆనగాకొనియాడతగిన బుద్ధిగలదానా, ప్రాక్ = పూర్వము, ఏకాకథా = ఒకసంగతి, ఆసీత్ = ఆయెను. సంప్రతి = ఇప్పుడు, శ్రూయతాం = వినుబడుగాక, ఇతః = ఈవినుటవలన అర్కాత్ = సూర్యునివలన, ధ్వాంతమివ = చీకటివలెనే, సకలం = సమస్తమయిన, తే = నీయొక్క, కాలుష్యం = మనస్సందేహము, ఇయాత్ = నశించుగాక.

తాత్పర్యము.—ఓతల్లి " పాణీబాణాసన" " క్షపితభృగుధర్మోపి " ఇత్యాదిశ్లోకములు జెప్పబడిన, నీపెనిమిటి శరీరాదిలక్షణములచేత, శూరునిగను వీరునిగను, దయాశాలిగను, సహజసౌందర్యవంతునిగను తెలిసికొని, నీపెనిమిటి వృత్తాంతమును సాకల్యముగ జెప్పుటచే నన్ను వానిదూతగానమ్ముము. (నీమనమున నావిషయమై మొదటగలిగిన సందియము పోగొట్టుకొమ్మనుట)

ఓబుద్ధిమంతురాలా యచ్చట జరిగిన యొకవృత్తాంతమును జెప్పెదను. అది నీభర్తృవిషయకమగు సందేహమును సూర్యోదయము చీకటినివలె నశింపజేయును.

"శూరంవీరం...... పౌండరీమందిరం" అని వీనివర్ణన "మహాసత్త్వోతిగంభీరః క్షమావానవికత్థనః... ధీరోదాత్తస్ససమ్మతః" ఇత్యాద్యాలంకారికప్రసిద్ధములగు ధీరోదాత్తుని లక్షణములతో సరిపోవుటవలన, పూర్వమేఘమున "యాచ్ఞామోఘావరమధిగుణే నాధమేలబ్ధకామా" "అంతర్బాష్పశ్చిరమనుచరో రాజరాజస్యదధ్యౌ" ఇత్యాదిశ్లోకముల పద్ధతిక్రమమును యక్షుని ధీరోదాత్తత్వమును మేఘుడన్నట ప్రకటీకరించుచున్న వానివలె నున్నాడు. "అంబ" లక్ష్మీయనుటవలన నిన్ను మాతృదేవతగా నమ్మి దేవతాసాన్నిధ్యమందువలె నే నిశ్చయముగాని నే చెప్పుచున్నానుగాని నిన్నెట్టియసంతోషపెట్టుటకుఁ బ్రయత్నించుటలేదని సప్రమాణముగ జెప్పుచున్నట్లు గనఁబట్టుచున్నది. "గాలుష్యం" భర్తృవిషయకమును నితర వనితాసంసర్గ రూపకాలుష్యంబని భావము. మనఃకాలుష్యమును చీకటితో బోల్చుట సుప్రసిద్ధము. ఈప్కాంతిమనెడి సూర్యకాంతి యాచీకటిని పాఱఁదోలుననుట.

శ్లో॥ స్వశ్రీసంహృత్యుదితహృదయఃకశ్చిదభ్యేత్యనూనం
కర్తుంతీవ్రింతపఇతిమహాపుణ్యగణ్యాశ్రమాంతే
లక్ష్మీనేత్రంశజరఘుమణీపాదవిన్యాసపూతే
భూభృద్రత్నేసపదిచరతీతీంద్ర ఆశంకమానః ॥

చ॥ తనసంపత్తుహరింపఁగోరి, మదిశ్రద్ధాయుక్తుఁడై యెవ్వఁడో
ఘనపుణ్యాశ్రమగణ్యమానము రమాకాంతాంశసంభూతురా
మునిపాదాంకితపావనంబునగునా, భూమీధ్రశీర్షంబుసం
దునఁజేసెన్దపమన్చువజ్రివినిదాదో దూయమానాంగుఁడై ౭౭

అర్థము.—స్వశ్రీ = తనసంపదయొక్క, సంహృతి = అపహరించుటయందు, ఉదిత = యత్నముగల, హృదయః = మనస్సుగలవాఁడై, కశ్చిత్ = ఎవఁడో, అభ్యేత్య = వచ్చి, నూనం = నిశ్చయముగా, ఇతి = ఈప్రకారము, తీవ్రం = కఠినమైన, తపః = తపస్సును, కర్తుం = చేయుటకు, మహాపుణ్యగణ్య= మంచిపుణ్యముచే నెన్నబడిన, ఆశ్రమ = తపస్థానములచే, అంతే=సుందరమైనట్టియు, లక్ష్మీనేత్ర = విష్ణుమూర్తియొక్క, అంశజ = అవతా

రమైన, రఘుమత్తే = శ్రీరాములవారియొక్క, పాదవిన్యాస = తొక్కుట చేత, పూతే = పవిత్రమైనట్టియు, భూభృద్రత్నే = చిత్రకూటమందు, సపది= ఇప్పుడు, చరతి = తిరుగుచున్నాడు. ఇతి = ఈలాగున, ఆశంకమానః = శంకించుచున్నవాడై.

తాత్పర్యము.—ఈయక్షుని యింద్రియనిగ్రహము, ధీరోదాత్తత్వాదిగుణముల ప్రకటించునట్టియు, వీనిపరిభావాదికములను వెల్లడిజేయునట్టియు, ఈవృత్తాంతమును జెప్పి, యక్షుడనుకూల నాయకుడనియె యక్షకాంతకు తెలియజేసి విశ్వాసమును పుట్టించి యౌదార్యం జూపుచున్నాడు. ఇంద్రుడితరులు తమ తపోమహిమచే తనయింద్రపదవి నాక్రమింతురేమోయను భయము కలవాడగుట వలన, నీయక్షునిజూచి యెవడో తనసంపత్తును హరింపవలెనని ఘోరతపస్సు చేయుటకై, మహావిష్ణ్వవతారమేయగు శ్రీరాములవారి పాదస్పర్శనముచే పవిత్రమయినదై గొప్పపుణ్యక్షేత్రములను నాశ్రమములతో సుందరమైన యీచిత్రకూటమునకు వచ్చియుండవచ్చునని వీనిని జూచి సందేహించినవాడాయెను.

“ మహాగణ్య...మానే ” “భూభృద్రత్నే ” ఈవిశేషణమువలనను మేఘసందేశమున జెప్పబడిన “ రఘుపతిపదై రంకితం మెఖలాసు ” “ జనకతనయాస్నానపుణ్యోదకేషు ” ఇత్యాది విశేషణములచేతను, అచ్చటి యాశ్రమములు, సుందరములనియు, పవిత్రములనియు, తపోయోగ్యములనియు తెలియు చున్నది.

శ్లో॥ గత్వాగారంనిజమమరరాట్సం విచింత్యాంతరాయం
తస్యాధాతుంనిరుపమకళా యోగరూఢాభిధానాం
రంభాదిభ్యో౽ప్యధికచతురాంనాకవేశ్యాంసురూపా
మేవంప్రాహప్రముదితమతింసంవితన్వంశ్చటూక్తైః॥

చ॥ సురపతిస్వీయమందిరముఁజొచ్చి తపంబునకంతరాయముం
దిరముగ యోజఁజేసియువతిం గనెసార్థకనామనొక్కతెం
నిరుపమమౌ చమత్కృతిని, నిర్జితరంభనునాకవేశ్యసుం
దరిని సురూపనంతటముదంబునబొందచటూక్తులాడుచుం ౭౭॥

అర్థము.—అమరరాట్ = ఇంద్రుడు, నిజంఅగారం = తనయింటికి, గత్వా= వెళ్లి, సంవిచింత్య=ఆలోచించి, తస్య=వానియొక్క, అంతరాయం =ఏకపత్నీవ్రతమునకుభంగమును, ఆధాతుం=చేయుటకు, నిరుపమకలా = సాటిలేనికాంతిచేత, యోగరూఢ=సార్థకమైన, అభిధానాం = పేరుగలిగినట్టియు, రంభాదిభ్యోపి = రంభమొదలైనవారికంటెను, అధికచతురాం = మిక్కిలిచాతుర్యముగలిగినట్టియు, సురూపాం = సురూపయనెడు, నాకవేశ్యాం = దేవతావేశ్యను, చటూక్తైః = ప్రియవాక్కులచే, ప్రముదితమతిం = సంతసించినబుద్ధిగలదానిగా, వితన్వన్=చేయుచు, ఏవం = ఇట్లు, ప్రాహ = చెప్పుచున్నాడు.

తాత్పర్యము.—అప్పుడా దేవేంద్రుడు తనగృహమునకుఁజని యక్షుని తపోమహిమచే తనపదవికి భంగముకలుగునని భయముచే యక్షుని తపోభంగము కావింపనెంచి, సౌందర్యవతియైనట్టియు, చాతుర్యమునరంభాదులను తలదన్నినట్టియు, సార్థకనామముగల సురూపయను దానిపిలిచి ప్రియవచనములచే దాని సంతోషపెట్టుచు ఈప్రకారముగా చెప్పెను.

“ గత్వాగారం ” అనుటవలన దేవేంద్రుడు, దేవతలకు నమస్కరింపతగినట్టియు, రామపాదాంకితమైనట్టియు, మంచిపుణ్యాశ్రమములచే నొప్పుచున్నట్టియు, నాపర్వతముమీదికి నొకానొకప్పుడు తానువచ్చి, యక్షునిజూచెనని తెలియుచున్నది. “ యోగరూఢ ” ఈనాకవేశ్యపేరు సురూప. సురూపయనగా మంచిరూపముకలది. నిరుపమమగు కాంతిచే నొప్పుచున్నదిగనుక నే దానిపేరు యోగమున సరిపోవుచున్నది. దానికి లోకప్రసిద్ధమగుపేరు సురూపయగుటవలన నామెయందానామము రూఢము. కావున సురూపయను పేరు యోగరూఢమై పరగుచున్నది.

శ్లో॥ యక్షుఃకశ్చిచ్ఛిఖరిణి భరద్వాజపుణ్యాశ్రమాంతే
తీవ్రంతప్స్యంయతతఇతి విజ్ఞాయ తేజలంమయాద్య
త్వాంద్రష్టైవత్య జతినియతింనూనమేషత్వదీయా
శ్చేష్టాద్రష్టాయదివిధువిభావిద్రుతో వేందుకాంతః ॥

చ॥ రమణిరో! యక్షుఁడొకఁడు రామధరాధరకూటపావనా
శ్రమమునఁదీవ్రమౌతపము సల్పుచునుండినయట్లువింటినో
సుమతిరో నీమచేష్టలకు సాక్షితపంబును వీడునిక్కమౌ
హిమకరదీధితిక్ గనిద్రవింపక యుండునెచంద్రకాంతముల్ ౪౯

అర్థము.—కశ్చిత్ యక్షః = ఒకయక్షుఁడు, శిఖరిణి = చిత్రకూటపర్వత మందు, భరద్వాజపుణ్యాశ్రమాంతే = భరద్వాజాశ్రమముచెంత, తీవ్రం = కఠినముగా, తప్తుం = తపస్సు చేయుటకు, యతత ఇతి = యత్నము చేయుచున్నాఁడని, మయా = నాచేత, అద్య = ఇప్పుడు, విజ్ఞాయతే = తెలియఁబడుచున్నది. త్వదీయాః = నీవైన, చేష్టాః = శృంగారచేష్టలు, దృష్టాయది = చూడఁబడినట్టయిన, ఏషః = వీఁడు, విధువిభావిమిశ్రితః = చంద్రకాంతిచేఁగఱగిన, ఇందుకాంతేవ = చంద్రకాంతమణివలె నూనం = నిశ్చయముగా, త్వాందృష్ట్వైవ = నిన్నుచూచుచునే, నియతిం = నియమమును, త్యజతి = విడుచును.

తాత్పర్యము.—యక్షుఁడొకఁడు భరద్వాజాశ్రమమువద్ద తీవ్రమగు తపస్సు గావించుచున్నాఁడని నాకు తెలియుచున్నది. కానినిన్ను నీవిలాసముల జూచి నతోడనే చంద్రకిరణప్రసారమువలన, ద్రవించు చంద్రకాంతమణులవలెనే, వానిమనస్సు కఱగిపోయి నియమమును విడుచును. అనగా రాయివలె నెంత కఠినహృదయుఁడయ్యును నీవిలాసములఁ జూచినతోడనే నీయందు లీనమై యుండుననుట. చంద్రకాంతమణులు చంద్రోదయమగుటతోడనే ద్రవింపఁ జొచ్చుననుట లోకప్రసిద్ధము.

“విధువిభా” అనుటవలన చంద్రబింబముతో సమానమగు నాసురూపయాననము జూచుటకంత యాహ్లాదకరమై యుండునని ధ్వనించుచున్నది.

శ్లో॥ తస్మాచ్ఛంకావిరహితగతిశ్చిత్రకూటాచలంతం
నానాపుష్పోత్కరసురభిళప్రాంతరంకాంతదేశం
గత్వాయక్షంనిజగుణగణాబద్ధచిత్తంవిధేహి
ప్రాప్తేర్థోగేప్రశమనవిధేః ప్రాక్ప్రతీకారఇష్టః ॥

ఉ॥ కావునశంకమానిచనఁగాఁదగు నీకునసేకపుష్పసం
భావితసౌరభోత్కరవిభాసి మనోహరచిత్రకూటమం
దావిధినున్నయక్షుఁగనియాత్మగుణాళినిబద్ధుఁజేయుమా
భావిగదానినాశమేశుభంబు, శమించుటకన్నరోగముల్ ॥౫౦

అర్థము.—తస్మాత్ = అందువలన, శంకావిరహితగతిః = కొంచెమైన సశంకలేనిదానవై, నానాపుష్ప = అనేకములగు పుష్పములయొక్క, ఉత్కర = సమూహముచేత, సురభిప్రాంతరం = పరిమళించుపరిసరప్రదేశము గలిగినట్టియు, కాంతదేశం = రమ్యమైనట్టియు, తంచిత్రకూటాచలం = ఆచిత్రకూట పర్వతమునుగూర్చి, గత్వా = వెళ్లి, యక్షం = యక్షుని, నిజగుణగణాబద్ధచిత్తం = నీగుణముల సమూహముచే నరికట్టబడిన మనస్సుగలవానిగా, విధేహి = చేయుము. రోగప్రాప్తౌ = రోగముప్రాప్తించినవనుచుండగా, ప్రశమనవిధేః = కుదుర్చుకొనుటకంటె, ప్రాక్ = రోగమురాకముందు, ప్రతీకారః = నివృత్తి జేయుటయే, ఇష్టః = మంచిది.

తాత్పర్యము.—ఆహేతువువలన నీవనేక పుష్పవాసనలచే సుందరంబై యొప్పుచున్న చిత్రకూట పర్వతమున కరిగి, తపోనిష్ఠుడైన యాయక్షుని మనమును, నీవిలాసాదిగుణములచే లోబఱచుకొని తపోభంగము గావింపుము. శరీరమునకు వ్యాధిజనించునని శోధించునప్పుడది సోకకమున్న, దానిని వృత్తికై ముందుగా జాగరూకత వహించుటయె శ్రేయస్కరముగదా.

శ్లో॥ ఇత్యుక్తాసాసురపతివచస్సీ ధుమత్తస్వభావా
స్వాంగాలంకారిత వివిధసద్భూషణాఢ్యాసమంతాత్
నానాకాంతిస్ఫురితకుసుమశ్రేణికాసంచరంతీ
వల్లీవాపక్షితిధరవరంవజ్రిణాసంప్రదిష్టం ॥

చ॥ పలుకఁగనిట్లుదేవపతివాక్సుధమత్తలుచిత్తవృత్తితో
కలికియలంకరించుకొనఁగాఁదగుభూషలు చిత్రపుష్పసం
కలితముజంగమంబునయికాంతివహించెడు వల్లిచాడ్పునన్
పాలతిమహీధరంబుగనఁబోయె బిడౌజునియాజ్ఞపెంపునన్ ౫౧.

అర్థము.—ఇతి = ఈప్రకారముగా, ఉక్తా = చెప్పఁబడిన, సా = ఆసురూప, సురపతి = దేవేంద్రునియొక్క, వచః = మాటలనెడి, సీధు = మద్యముచేత, మత్త = మదించిన, స్వభావా = స్వభావముకలదై, సమంతాత్ = అంతటను, స్వాంగ = తనయవయవములయందు, అలంకారిత = అలంకరింపబడిన, వివిధ = అనేకములైన, సద్భూషణా = మంచినగలచేత, ఆఢ్యా = ఒప్పినదై, (గనుకనే) నానా = అనేకములగు, కాంతి = కాంతులచేత, స్ఫురిత = వెలుగుచున్న, కుసుమశ్రేణికా = పువ్వులపజ్క్తిగలిగి, సంచరంతీ = సంచరించుచున్న, వల్లీవ = తీగవలెనున్నదై, వజ్రిణా = ఇంద్రునిచేత, సంప్రదిష్టం = చెప్పబడిన, క్షితిధరవరం = శ్రేష్ఠమైన చిత్రకూటపర్వతమును, ఆప = పొందెను.

తాత్పర్యము.—ఇట్లుసురూప ఇంద్రుని చాటూక్తులనువిని, రంభాదులకన్న తనకు నెక్కువగౌరవము గలిగినందులకు మైమఱచి, తనకుగల చక్కదనము నినుమడింప వివిధములగు భూషణముల నలంకరించుకొని చిత్రవర్ణముల గుపూగుత్తులచే నిండి, నడచుచున్న తీవెయోయన్నట్లు యింద్రుని పంపున చిత్రకూటము చేరెను.

‘‘వచస్సీధుమత్తస్వభావా’’ మద్యపానముచేసినవారు మైమఱచి కార్యాకార్యవిచారణయు ఎదిరితమసమర్థతలు నరయజాలక ఎట్టియకృత్యమునకైన శంకింపక జొరపడునట్లు, సురూపయు దేవేంద్రుని ప్రియవచనములచే మదించినదై యతుప్రతభంగమున దలపడసాహసించెనని తెలియుచున్నది.

శ్లో॥ యత్కూటేషూత్కటకటకకంజోపలాంశూత్కరాణాం
సక్తైశ్శోణీకృతనిజరుచా వృష్ణగోర్వాజిరాజౌ
దృష్ట్వాసంప్రత్యహికుల కృతేర్వ్యాగ్రజాతంచరంతం
హైర్యాన్ద్రిభూభృత్కటకని కటేశంకతేలోకజాతః ॥

ఉ॥ ఏగిరిప్రాంశుకూటముల నిమ్ముదొలంకెదుపద్మరాగస
ద్రాగముమింటఁబ్రాకరవిరథ్యములెఱ్ఱఁగఁగానుపించునో

ఏగిరిన ప్డుచూచిజను లెంతురొ తూరుపుకొండమీద నా
భోగివిరోధియగ్రజుఁడు పుట్టిచరింపగనున్నయట్టులన్ ౫౨.

అర్థము,—ఇచ్చటనుండి ౫౬ వ శ్లోకమువఱకును చిత్రకూటవర్ణన యత్కూటేషు = ఏపర్వతశిఖరములయందు, ఉత్కట = గొప్పదైన, కటక = మధ్యభాగములయందు, కంజోపల = పద్మరాగమణులయొక్క, సక్తేః = కూడికవలన, ఉష్ణగోః = సూర్యునియొక్క, వాజిరాజౌ = గుఱ్ఱములగుంపు, శోణీకృత = ఎఱ్ఱఁగాఁజేయబడిన, నిజరుచా = తనకాంతిగలవిగాఁగ, సంప్రతి = తత్కాలమందు, లోకజాతః = జనసమూహము, దృష్ట్వా = చూచి, ఐన్ద్రిభూభృత్ = పొడుపుకొండయొక్క, కటకనికటే = మధ్యభాగమందు, చరంతం = సంచరించునట్టి, అహికుల = సర్పసమూహమందు, కృత = చేయబడిన, ఈర్ష్య = అసూయగలగరుత్మంతునికి, అగ్రజాతం = అన్నయగుఅనూరునిగ, శంకతే = ఊహించుచున్నది.

తాత్పర్యము —ఆచిత్రకూటపర్వతముయొక్క, మధ్యభాగములయందు పద్మరాగమణులు విశేషముగా నున్నవి. ఈపద్మరాగములయొక్క రిక్తమనూర్యుని గుఱ్ఱములనుగూడ నెఱ్ఱనికాంతిగల వానినిగాఁ జేయుచున్నది. ఆపర్వత పరిసరవర్తులగు వారాపర్వతముయొక్క ఉపరిభాగమున నీరొత్తుదనముఁ జూచి పొడుపుకొండపై యరుణోదయమని భ్రాంతిజెందుచున్నారు. దీనివలన నీపర్వతకూటము లాకాశమువరకు వ్యాపించెననియు నది రత్ననిలయమనియు స్ఫురించుచున్నది.

శ్లో॥ యత్క్రీడాగ్రాంచిత విహృతయస్సింధుబంధుంనిరీక్ష్య
ప్రేక్షుం తేక్షీపతివిరహతో జాతతాపార్దితాయాః
భూకాంతాయావసనమివనందీప్రసీలోపలాభం
ముక్తాపాళిగ్రథితముదయ చ్ఛీకరోర్మి ప్రభూతం॥

ఉ॥ ఏనగశృంగపంక్తి విహరించు జనంబులకబ్ధిఁజూడభూ
మానినిబాయ(శ్రీ)విభుడు మన్మధతాపపరీతయాచుఁదా

నూనినసీలవస్త్రిమన నొప్పఁగఁదోఁచెందరంగపంక్తులా
చానధరించుముత్యములజానగు పేరులటంచుదోఁచెడిన్ ॥ ౫౩.

అర్థము.—యత్కూటాగ్ర = ఏపర్వతశిఖరములయందు, అంచిత = ఒప్పుచున్న, విహృతయః = విహారములుగలవారు, సింధుబంధుం = సముద్రమును, నిరీక్ష్య = చూచి, శ్రీపతివిరహతః = విష్ణుమూర్తి వియోగమువలన, జాతతాపార్దితాయాః, జాత = పుట్టిన, తాపార్దితాయాః = తాపముచేబాధితురాలైన, భూనాయికాయాః = భూమియనునాయికయొక్క, ఉదయచ్ఛీకరోర్మిప్రభూతం, ఉదయత్ = పుట్టుచున్న, శీకర = తుంపురులుగల, ఊర్మి = తరంగములచేత, ప్రభూతం = అధికమైనదనుటవలన, ముక్తాహారిగ్రథితం = ముత్యాలవరుసచే గూర్పబడినట్టియు, సందీప్ర = వెలుగుచున్న, నీలోపలాభం = నీలమణికాంతిగలట్టియు, వసనమివ = బట్టవలె, ప్రేక్షంతే = చూచుచున్నారు.

తాత్పర్యము.—లోకమందు విరహబాధితలైన స్త్రీలు తాపనివారణార్థము నల్లనిబట్టను ముక్తాహారమును ధరించుట వాడుక. చిత్రకూటపర్వతమందు విహారులగు విలాసిజనులు సముద్రమునుజూచి, తనభర్తయగు విష్ణుమూర్తి నెడబాసినభూనాయిక, విరహతాపమునపనయింప నల్లనిబట్టను ముక్తాహారములను ధరించినట్లుగా నుత్ప్రేక్షించుచున్నారు.

విష్ణుమూర్తి చాతుర్మాస్యులందు సముద్రమున శయనించుట పురాణప్రసిద్ధము. కావున భూనాయిక విరహతాపయుక్తయైనట్లు తలంచుటవలన నందలి జనులు విలాసవంతులని తెలియుచున్నది. భూమి సముద్రవసనయనుట మహాకవిప్రసిద్ధము. కావున నున్నతమగు పర్వతాగ్రమందుండి చూచువారికి దూరమునమన్న సముద్రము నల్లనివస్త్రముగను, తుంపురులతోఁగూడిన తరంగములు ముత్యాలహారములవలెను గన్పట్టుననుట స్వభావము.

శ్లో॥ నావశ్చాపిద్రుతతరగతీస్సాగరస్యాంతరాళే
యాతాయాతక్రమవిధివశాత్సాధుతైమింగిలానాం

దర్వ్యేద్రికాదుపరిచరతాం కామమభ్యాశభాజః
పోతానేవ ప్రతిపదమరం జానతే యత్రలోకాః ॥

ఉ॥ జలనిధిమధ్యమం దెప్పుడు జక్కఁగవచ్చుచుఁబోవుచుండనా
వలనొ,క వేళ దర్పమునఁ బైపయినీదు తిమింగిలంబులన్
గనుఁగొని చేరఁ బోతములుగాఁగలపోయగ నవ్యచిత్రమా
మలనివసించుభాగ్యజనమండలి పుణ్యమదేమొచూడఁగన్॥ ౫౪

అర్థము.—యత్రలోకాః = ఏచిత్రకూటపర్వతమందలిజనులు, సాగరస్య = సముద్రముయొక్క, అంతరాళే = మధ్యను, యాతాయాత = రాకపోకలయొక్క, క్రమవిధివశాత్ = సంచారవశమువలన, ద్రుతతరగతీః = శీఘ్రగమనముగలిగినట్టియు, దర్పోద్రేకాత్ = గర్వాతిశయమువలన, ఉపరి = నీళ్లమీదను, కామం = స్వేచ్ఛగా, చరతాం = సంచరించునట్టి, తైమింగిలానాం = తిమింగిలములను పెద్దచేపలయొక్క, అభ్యాశభాజః = సమీపము నొందినట్టియు, నావశ్చాపి = పెద్దయోడలనుకూడ, ప్రతిపదం = ఒక్కొకదాని వద్దనున్న, పోతానేవ = చిన్నపడవలనుగానే, అరం = బాగుగ, జానతే = తెలిసికొనుచున్నారు.

తాత్పర్యము.—మఱియు నాపర్వతము పైవిహరించువారు సముద్రమధ్యమున తిరుగుచున్న పెద్దయోడల, నొకానొకప్పుడు మదించి నీళ్లపైభాగమున నేకదలకయుండు తిమింగిలములనెడి పెద్దచేపల సమీపమున జేరగాజూచి చిన్నపడవలనుగా తలంచుచున్నారు. ఇందువలన తిమింగిలములు దరిజేరుటకు వీలులేని పెద్దపాగయోడల వలెను, వానియందుండు వస్తువుల గైకొని దరిజేర్చుటకై వచ్చుచు బోవుచునుండెడి చిన్నపడవలవలె నీనావలును వాటికి గన్పట్టుచున్నవని తాత్పర్యము. ఇట్లు నావికాయాత్రికులు సముద్రమధ్యమున నీటిపై తేలియుండు పెద్దపెద్దచేపలను, ద్వీపములని తలచి సమీపించి యచ్చట విశ్రమింప జూచుటయు ధ్వనించుచున్నది. ఇట్టి స్వభావవర్ణనలు పూర్వగ్రంథముల విరళములుగా గన్పట్టునని తోచు.

శ్లో॥ యత్రక్షోణీధరవరశిరస్యబ్ధిమధ్యస్థితాః కామిలోకా
స్తన్మధ్యస్థాచలతటభువస్సంశ్రితానక్రయోషాః
భూకాంతోరోజనివిరచితాస్సాధుశోభావిధానే
సాక్షాత్క్లృప్తా ఇవమకరికాపత్రికా జానతేఽలం ॥

ఉ॥ లలితగశృంగసీమల విలాసముగావిహరించు కాముకుల్
జలనిధిఁజూచికొండల మొసళ్లొక చెంతనువిశ్రమింపగా
దలఁచిరిభూసతీకుచపదంబుల శోభలసీననిక్కమా
జలచరపత్రరేఖలివిస్పష్టముగా రచియించిరంచెదక్ ॥ ౫౫.

అర్థము.—యత్ర = ఏ, క్షోణీధరవరశిరసి = చిత్రకూటపర్వతాగ్రమందు, స్థితాః = ఉన్నట్టి, కామిలోకాః = కాముకజనులు, తన్మధ్యస్థ = ఆసముద్రమధ్యమందున్నట్టి, అచల = కొండలయొక్క, తటభువః = దరులను, సంశ్రితాః = ఆశ్రయించినట్టి, నక్రయోషాః = మొసలులను, సాధు = యోగ్యముగా, శోభ = అలంకారముయొక్క, విధానే = చేయుటయందు, సాక్షాత్క్లృప్తాః = ప్రత్యక్షముగ చేయబడిన, భూకాంతా = భూనాయికయొక్క, ఉరోజని = స్తనములయందు, విరచితాః = రచింపబడిన, మకరికాపత్రికా ఇవ = మకరికాదిపత్రములవలే, అలం = బాగుగా, జానతే = తెలిసికొనుచున్నారు.

తాత్పర్యము.—ఆపర్వతము నెక్కి విహరించెడి కాముకులు సముద్రమధ్యమందుండు పర్వతముల దరిజేరిన మొసళ్లను జూచి భూనాయికాకుచమందు ప్రత్యక్షముగ రచియింపబడిన మకరికాదిపత్రములవలె నూహించుచున్నారు.

శ్లో॥ శోణద్యోతస్థగితనికటప్రోల్లసద్వ్యోమశ్రీమాళీ
వల్లీవ్రాతస్థగితసవిధాన్యస్యగోత్రాభృతోఽపి
ప్రోద్యత్కాశ్మీరజనిరజసారంజితప్రాంతపృథ్వీ
వక్షోజాతశ్రియమనుకలంనంస్మరంత్యేవకమ్రాః ॥

ఉ॥ పవడపుతీవెలల్లుకొనఁ బ్రాంతనగాంతములందు నెఱ్ఱఁగా
దవులకుఁగానుపింపఁగ సుదంబున రామనగంబుసందుప
ల్లవులుచరించుచుంగ్ష్మితిలలామపయోధరసీమఁ బూయఁగా
దివిరిసెఁగుంకుమశ్రియ మిదేయని బొంగుచునుందు రెప్పుడున్ ౫౬

అర్థము.—కమ్రాః = కాముకులు, నానాస్థలి = ఏచిత్రప్రదేశములయొక్క, శోణద్యోత = ఎఱ్ఱనికాంతిచే, స్థగిత = కప్పబడిన, నికట = సమీపమందు, ప్రోల్లసత్ = ప్రకాశించుచున్న, విద్రుమ = పగడములయొక్క, ఆళీ = వరు సయొక్క, వల్లీ = తీగలయొక్క, వ్రాత = సమూహముచేత, స్థగిత = వ్యా ప్తమయిన, సవిధాన్ = ప్రాంతములుగల, గోత్రాభృతోపి = ప్రత్యంతపర్వతముల గురించియును, ప్రోద్యత్ = ప్రకాశించుచున్న, కాశ్మీరజని = కుంకుమయొ క్క, రజసా = చూర్ణముచేత, రంజిత = పూయబడిన, ప్రాంత = పార్శ్వము లుగల, పృథ్వ్యా = భూనాయికయొక్క, వక్షోజాత = స్తనములయొక్క, శ్రియం = శోభను, అనుకలం = నిపుణముగా, సంస్మరంత్యేవ = స్మరించుచు నే యున్నారు.

తాత్పర్యము.—ఆసముద్రమందుండు పగడపుతీగెలు చుట్టుకొనుటవలన రక్తిమగలిగిన ప్రత్యంతపర్వతముల జూచి, కుంకుమపూత చేరంజిత మైన ప్రాం త భాగములుగల, భూనాయిక స్తనశోభను కాముకులు మాటిమాటికి తలంచు చున్నారు.

శ్లో॥ బుద్ధంస్వాంతే ప్రసపక్షసుమం మంజుమంజీరనాదై
రీర్ఘ్యాషాం గైరచితనిగళాన్ పశ్యతస్సాభిలాషం
తన్వానాసస్మితసముదితైరంశుజాలైశ్శరీరాత్
ప్రాంతానంతాస్సితిమకలితా స్పందథానానురూపా॥

మ॥ తనమంజీరని నాదసంకలన జిత్తంబంమునిద్రించుమా
రుని మేల్గొల్పుచుఁదన్నుఁజూచు జనులన్ రుద్ధాత్ములం జేయుక్రీ

గనుల౯ జూచుచునవ్వుల౯ దెలుపుగాగావించుచు౯ బ్రాంతదే
శని కాయంబులఁగొండఁజేరెసుర వేశ్యారత్నమందంబుగ౯ ॥౫౭॥

అర్థము — సురూపా = అసురూపా, మంజు = మృదువైన, మంజీరనాదైః = అందెలచప్పుళ్లచేతను, స్వాంతే = మనస్సునందు, ప్రసవధనుషం = మన్మథుని, బుద్ధం = మేల్కొన్నవానిగనున్నా, సాభిలాషం = కోరికతో కూడుకొన్నట్లుగా, పశ్యతః = చూచువారిని, దీర్ఘాపాంగైః = విశాలములగు నేత్రాంతములచేతను, రచితనిగళా౯ = బంధితులనుగాను, తన్వానా = చేయుచున్నదై, శరీరాత్ = తనశరీరమునుండి, సస్మిత = నవ్వుతో కూడునట్లుగా, సముదితైః = బయలుదేరిన, అంశుజాలైః = కాంతిపుంజములచేత, ప్రాంతావంతాః = సమీపభూములను, సితిమ = తెల్లదనముతో, కలితాః = కూడినవానినిగా, సందధానా = చేయుచున్నదై (యుండెను.)

తాత్పర్యము.—అసురూప తన పాదముందలి మంజీరాదుల రవముచే నచ్చటనుండు వారిమనంబుల మన్మథోద్రేకము గల్గించుచు, విశాలమగు తనచూపులచే వారిని బంధించుచు, తనచిరునగవుయొక్క కాంతులచే సమీపభూములను ప్రకాశింపఁజేయుచు నాచిత్రకూటము జేరెను. ఇది వేశ్యయే గావున నచ్చటిజనులలో బఱచుకొనుటకై “స్త్రీణామాద్యం ప్రణయవచనం విభ్రమో హి ప్రియేషు” అనునట్లు గానట్టివిలాసముల నాద్య ప్రణయవచనముగ బ్రకటింప జేయుచున్నది.

శ్లో॥ తత్తాంబూలప్రసవసురభి ప్రాప్తలజ్జాహిమవల్యో
మందస్పందానిలవిసరణ చ్ఛద్మనాపాక్షిప్తరూఢాః
నిస్సౌహార్దంఖలుసుమనసస్త్యాజుస్తాశ్చపాంధా
మోదాధానవ్యతికర ఫలాస్సోఢపీడాఃపతన్తి ॥

చ॥ ఆలలనాశిరోమణియహార్య తటంబునసంచరింప, దాం
బూలవుదావిసిగ్గుగొని పూవులతీవెలుపాక్షిప్తరూఢవతా

పూలనురాల్చె గాలిమిష బూర్వపుస్నేహముపీడి, పాంథులా
పూలనుజూచికూలెనివిపుష్ప శరంబులటంచు నుబ్బగన్ ॥౫౮॥

అర్థము.—తత్ = ఆసురూపయొక్క, తాంబూల = తాంబూలమువలన, ప్రసవ = పుట్టిన, సురభి = పరిమళముచేత, ప్రాప్త = పొందబడిన, లజ్జాః = సిగ్గుకలవియగు, వల్ల్యోపి = తీగలైతే, మందస్పంద = మందగతిగల, అనిల = వాయువుయొక్క, విసరణ = ప్రసారము (వీచుట) అనే, ఛద్మనా = మిషచేత, ప్రాక్ ప్రరూఢాః = పూర్వముపుట్టిన, సుమనసః = పువ్వులను, నిస్నేహార్ద్రం = స్నేహములేకుండగా, తత్యజుః = వదలిపెట్టినవి, తాశ్చ = ఆపుష్పములున్నూ, పాంథ = విరహులను, ఆమోద = సంతోషముయొక్క, ఆధాన = చేయుట యొక్క, వ్యతికర = సంబంధమే, ఫలాః = ఫలముగకలవై, సోఢ = సహింపబడిన, పీడాః = బాధకలవగుచు, తపన్తి = క్రిందపడుచున్నవి.

తాత్పర్యము.—ఆచిత్రకూటమందలి తీవెలు మందానిలము వీచుటవలన పువ్వులను రాల్చుచున్నవి. ఇట్లురాల్చుట యచ్చటికేతెంచిన సురూపయొక్క ముఖపరిమళమును గాంచినదై యాతీవెలు తామంతకుపూర్వము వహించిన పుష్పములకిట్టి పరిమళములేకుండెగదాయని లజ్జించి వీనియందలి ప్రేమవీడి విడిచిపెట్టినవన్నట్లుగాను, ఈపువ్వులును, తాము క్రిందరాలిపోవుట విరహులకు సంతోషకరముగాన నాబాధ సహింప సమగ్రములయ్యె నన్నట్లును త్ప్రేక్షింపబడియె లోకమున సమానస్థితి నొందియుండినవారిలో నొకరొకకాలమున నాధిక్యము వహించిన నితరులు వారియాధిక్యము నోర్వలేకయు స్వసామర్థ్యమున వారితో సమానులుగాకుండుట చేతను తమకంతకు బూర్వముగలుగు విభవాదులనుగూడ పరిహరించుట ప్రసిద్ధమే. ఈసురూపపైన ౫౧ వ శ్లోకమున సంచరించుచున్న తీగెవలె నీపర్వతమును ప్రవేశించినట్లు వర్ణింపబడినది. కావున నచ్చటనున్న తీవెలీమెను ఈమె ముఖపరిమళమును గాంచి యట్టిశోభతమకు కల్గమిచే వాయువును మిషగల్పించుకొని తమకదివరకు గలుగు పుష్పములను సైతము విడిచివేసినవి. ఈసురూప యాప్రదేశము చేరునప్పటికి మందమందముగా గాలి వీచుచున్నదనియు, నచ్చటవికసించిన పుష్పములతో 

రిండ్లున్నవనియు, నచ్చటపాంథులు తమశ్రమలనుడుపుకొందురనియు ముఖ్య తాత్పర్యము.

"నిస్స్వాహార్ద్రం" అసూయాగ్రస్తులగువారు తమకుపకారకులగువారి యందలిచిరకాల స్నేహము నైన పరిగణింపరని భావము. "సుమనసః" మంచి మనస్సుగలవారు తాముబాధనొందిరైనను పరులకుపకారము జేయుటయంద యాసక్తి గల్గియుందురు. కాన తన్నుబాధించుచున్న పాంథులను ప్రసూనములుగా తమకాధారములైన తీవెలచేవిడిచి పెట్టబడినవైనను పాంథతాపోపశమన సమర్థంబు లగుటవలన తద్వియోగమును సహించి సార్థకమైనవని ధ్వనించుచున్నది.

"పాంథామోదాధాన" అనుటవలన పాంథులు తీవెలనుండి రాలుపువ్వులను జూచి, వియోగావస్థనున్న తమయందు ప్రయోగించుటకై యెత్తబడిన మన్మథబాణములని తలచువారగుటచే నట్టిబాణములు ప్రయోగింపబడకయే క్రిందపడిపోవుచుండుటవలన తమనింక బాధింపజాలవుగదాయని సంతసింపుదురని తెలియుచున్నది. "పతంతి" అనుట యున్నతస్థితి నుండి యధోగతిపాల గుటస్ఫురించుచున్నది. పరోపకారార్థ మీశ్వరజటాజాలము వదలి యధోగతి ననుసరించి సగరసాగరుల నుత్తరింపజేయుటచే శ్లాఘ్యములగు గంగానద్యాదుల వలెనే పాంథరక్షణార్థమీసుమన సములధః పతనంబును సహించినవని తెలియు చున్నది.

శ్లో॥ దూర్వాసోగ్రేసరమునివర స్వాంతసారస్వతేజ్ఞై
రృంథానాద్రిప్రథితఘనతాస్సైర్విలాసైరనోజ్ఞైః ॥
కేయంకాస్యాత్త్రిదశవిభునాకస్యవాధైర్యభంగం
కర్తుంకామాస్త్రివితతిరమా ప్రేషితాయాతినూనం ॥

చ॥ వాసవుఁడేనిధైర్యమునుమాపగఁ బంపెనొదీనిఁజూడదూ
ర్వాసుఁడులోనుగాఁగల తపఃపరిపాకులు, చిత్తధైర్య
రాసికిమందరాద్రియనరా ! స్మరపుష్పశరేందిరాభ, యే
మోసముఁజేయనెచ్చటికిఁబోవుచునున్నదొస్త్రీయసంపద ॥౩౯॥

అర్థము—మనోజ్ఞైః=సుందరములైన, స్వైః=తనవైన, విలాసైః=విలాసములచేత దూర్వా...ఘనతా దూర్వాసః=దూర్వాసముని, అగ్రేసర=మొదలుగాఁగల మునివర=ఋషీశ్వరులయొక్క, స్వాంత=మనస్సనెడు, సారస్వతేటో=సముద్రునకు, మంథానాద్రి=మందరపర్వతముయొక్క, ప్రథిత=ప్రసిద్ధమైన ఘనతా=గొప్పతనముగల, ఇయం=ఈ స్త్రీ, కా=ఎవతె, స్యాత్=అయియుండునో; కామాస్త్రవితతిరమా=మారునిబాణసమూహలక్ష్మి (యైనయీ స్త్రీ,) కస్య వా=ఎవనికో, ధైర్యభంగం=జితేంద్రియత్వముయొక్క నాశమును, కర్తుం=చేయుటకొఱకు, త్రిదశవిభునా=ఇంద్రునిచేత, ప్రేషితా=పంపఁబడినదై, ఆయాతి=వచ్చుచున్నది, నూనం=నిశ్చయము.

తా—తనవిలాసములచేత మునులయందతికఠినుఁడగు దుర్వాసునివంటి మునుల మనస్సును మందరపర్వతము సముద్రమునువలెనే కలఁతనొందించుచున్న యిది యెవతయయియుండును? మన్మథబాణశోభగల యీ స్త్రీ ఇంద్రునిచేతనే మహానుభావుని మనస్సు కలఁతనొందించి ధైర్యభంగము చేయుటకుఁ బంపఁబడెనోయన్నట్లు గావచ్చుచున్నది.

శ్లో॥ ఏవంప్రద్రష్టృష్వవహితమతిష్వంచితానల్పమోదా
మత్వాతంహాస్వలలితవశంకామమూయేవదీపా
కాదంబిన్యామివవసభువిప్రేక్ష్యమాణానురూపా
విద్యుద్వల్లీప్రియసహచరీవ్యానయత్కాలమల్పం॥

ఉ॥ అచ్చటనున్న వారవహితాత్ములుగాఁగను చుండవీనిబల్
"మచ్చికసేతునిప్పుడువిలాసములంబచరించి" యంచునా
యచ్చరయానురూపవనమందుఁజరించె నొకింత సేపువా
రచ్చెరువందనంబుదచయంబునఁదోఁచుమెఱుంగుకై వడిన్॥ ౬౦

అర్థము—అవ... షు=అవహిత=జాగరూకమైన, మతిషు=బుద్ధిగలవారైన (యక్కణివారు) ఏవం=పైనఁజెప్పిన ప్రకారము (చెప్పుచున్నవారై) ప్రద్రష్టృషు=చూచుచున్నవారగు చుండఁగ, అంచి... మోదా=ఒప్పినయధికమైన సంతోషము

గలదై తనుఁగూర్చి యిట్లుచెప్పుకొనుచున్నారుగదా యని సగర్వయైయనుట, తం హా=ఆనీప్రియునిఁగూడ, స్వలలితవశం=(ఇతరులవలె)తనవిలాసమునకు లోఁబడిన వానిఁగా, మత్వా=తలచి, కామమాయేవ=మన్మథమాయవలె, దీప్రా=వెలుగుచున్నదై, కాదంబిన్యామివ=మేఘమాలయందువలెనే, వనభువి=ఆయరణ్యమందు విద్యుద్వల్లీ ప్రియసహచరీ=మెఱుపుతీగకు సమానురాలైన, సురూపా=సురూపయనునచ్చర, ప్రేక్ష్యమాణా=అందఱిచేఁ జూడబడినదై, అల్పం=కొంచమైన. కాలం=సమయమును; వ్యానయత్=గడిపెను.

తా—ఆయాశ్రమమందలివారు అత్యంతాసక్తితోఁ దానఁజెప్పిన రీతిగానను కొనుచుఁ జూచుచుండగ వీరందఱునన్నుఁజూచి మోహాతురులైనన్ను బ్రశంసించుచున్నవారు. గనుక వీనినావిలాసముచే మోహింపఁ జేయుదునని తలఁచి మేఘపంక్తిలో మెఱుపుతీగవలెఁ బ్రకాశించుచు నాసురూపయకొంతఁ గాలక్షేపముచేసెను.

శ్లో॥ నిర్వేలోద్యచ్ఛుచిజలధిరాడ్భంగభంగాయమాన
ప్రోద్యల్లీలానిలయవపుషాపోషయంతీస్మితేన
జ్యోత్స్నాహారాశిపతగవనితాస్స్వీయసౌందర్యదృప్తే
ర్నిర్లోలాంతర్హృదయమపితంసానురూపావివేద॥

చ॥ చెలియలికట్టదాటిచను చెల్వపుసంద్రములోనియూర్మిమా
లలవలెవెల్గుచుండెడు విలాసములంగనుసన్వువెన్నెలల్
చిలుకుచుస్త్రీచకోరములఁ జీరువిలాసినియాసురూపతాఁ
దెలిసికొనెన్మనోహరుఁడు ధీరతతోనిరసించినట్లుగాన్॥ ౨౧

అర్థము—నిర్వేలా...వపుషా=నిర్వేల=ఒడ్డునుదాటి, ఉద్యత్=ప్రకాశించు, శుచి=శృంగారరసమనెడు, జలధిరాట్=సముద్రముయొక్క, భంగ=తరంగములకు; భంగాయమాన=నాశకమైన, ప్రోద్యత్=విస్తరించు, లీలా=విలాసములకు, నిలయ=చోటైన వపుషా=స్వరూపముగల, స్మితేన=మందహాసముచేత, జ్యోత్స్నాహారాః=వెన్నెలఁదినునట్టి;పతగవనితాః=ఆడుపిట్టలను(చకోరములనుట) పోషయంతీ=పెంచుచున్నదైన సా=ఆసురూప,స్వీయ=దృప్తేరపి=తనచక్కఁదన

ముచూచుటవలననున్న; తం=నీభర్తను; నిర్లో—దయం=ఆసక్తిలేనిమనన్నుగల వానిగ, వివేద=తెలిసికొనెను.

తా—ఒడ్డుదాటిన శృంగార సముద్రమందలి తరంగములవలె మిక్కిలి వెలుగుచున్న విలాసములుగల వెన్నెలవంటి తనమందహాసముచేత నాడు చకోరములను దృప్తిపఱచునదై యాసురూపయట్టి తనచక్కఁదనమును జూచినప్పటికి తనయందాసక్తిలేనివానిగానే నీభర్తనుదెలిసికొన్నది సుమా.

శ్లో॥ నూ్యనంధ్యానాంతరవశతయావర్తతేమామపశ్య
న్నారాదద్యప్రకటమహమేవేత్యతంరంజయామి
వీతాంతర్ధానిరతమభితస్సంస్ఫురన్త్యంసుధాంశో
ర్మూర్త్యాకోవానభవతిగతకాఠిన్యకశ్చంద్రకాన్తః॥

చ॥ మరియొకచింతయందు తనమానసముం దగిలించియుంట జూ
పరయఁడునాడువంకనిఁకనాతనిడగ్గఱివానిమోహముం
బొరయఁగఁజేతునేనశశిమూర్తినిఁజూచినమాత్రనేసుధా
కరశిలయేనియుందనదు కాఠిన్యమువీడి ద్రవింపకుండునే॥ ౬౨

అర్థము—ధ్యానాంతరవశతయా=పరధ్యానమునకులోఁబడుటచేత, మాం=నన్ను అపశ్యన్=చూడనివాఁడగుచు, వర్తతే=ఉన్నాడు, నూనం=అదేనిశ్చయము, గనుక, అద్య=ఇప్పుడు, ఆరాత్=దగ్గిరకు, అహమేవ=నేనే, ఏత్య=వెళ్ళి, ప్రకటం=స్పష్టముగా, తం=వానిని, రంజయామి=మోహింపఁజేతును, (అదియెట్టులనఁగ) సుధాంశోః=చంద్రునియొక్క, మూర్త్యా=స్వరూపము, నిరంతరం=బాగుగ, వీతాంతర్ధా=పోయిన యావరణగలదై, అభితః=అంతటను, సంస్ఫురంత్యాం=వెలుగుచుండఁగ, కోవాచంద్రకాంతః=ఏచంద్రకాంతరత్నము, గతకాఠిన్యకః=పోయినకాఠిన్యముగలది (ద్రవించునది) నభవతి=కాదు.

తా—అటులు తనయందాసక్తి వానికిలేదని తెలిసియు సురూపయను కొనుచున్నది. యక్షుఁడు తాను పరధ్యానముచెనన్ను చూడలేదుగనుక నేనేదగ్గిరకువెళ్ళి మోహింపఁజేయుదును. చూచినయడల మోహింపకమానఁడు. ఎటులనఁగా, చం

ద్రకాంతి యేమియునడ్డులేక ప్రకాశించుచుండగాఁ జంద్రకాంత మనెడి రత్నము ద్రవింపకమానునా? వెన్నెలసన్నిధిఁ జంద్రకాంత మణివలెనాయదుట యక్షుఁడు మనసు కరగకుండునాయని తాత్పర్యము.

శ్లో॥ సంచింత్యాత్మన్యుచితనియమంతంసురూపావలేపా
ద్గత్వాతస్యాన్తికమమసృణచ్ఛాయమాలక్ష్యశాఖం
తస్యాగారంవిటపినమధోవీక్షమాణాస్మితశ్రీ
సంస్పృష్టోద్యత్ప్రసవజరమాంస్వాధరస్యాజగామ॥

చ॥ నిరుపమసువ్రతాత్ముఁడగు నీపతినాననముగ్రహించియుగ్ర
వెరుపకయాసురూపసిజవృత్తి సమాహితగర్వచిత్తయై
తరుకుసుమోహమస్మితవిధానము దోఁచెడుమోముపంచి తా
నరిగె రవంతనీడనిడునల్పపు గొమ్మలచెట్టుకిందికిన్॥ ౬౩

అర్థము—సురూపా=సురూప, తం=నీభర్తను, ఉచితనియమం=తగ్గనట్టి వ్రతముగలవానిగా, ఆత్మనిసంచింత్య=మనస్సునననుకొనియు, అవలేపాత్=గర్వమువలన, తస్య=వానియొక్క, అంతికం=దగ్గిరకు, గత్వా=వెళ్ళి; అమసృణచ్ఛాయం=కొంచెము నీడగలదియు, ఆలక్ష్యశాఖం=విడిగానున్న కొమ్మలుగలదియు, తస్యఅగారం=నీపతికి నివాసమైనదియునగు, విటపినం=వృక్షమును, అధో=క్రిందుగ, వీక్షమాణా=చూచుచున్నదై, స్వాధరస్య=తనపెదవికి, స్మిత...రమా=స్మితమందహాసముయొక్క, శ్రీ=శోభచేత, సంస్పృష్ట=స్పృశింపఁబడి, ఉద్యత్=ప్రకాశించు, ప్రసవ=పుష్పములవలన, జ=పుట్టిన, రమా=సంపత్తుగలదై, ఆజగామ=పొందెను.

తా—అనురూప నీభర్త నియతుఁడైయున్నవాఁడని తెలిసియు గర్వముచే వాని సమీపమునకువెళ్ళి, కొంచెము కొమ్మలుగలది గనుకనే ఆట్టేనీడలేని (అతఁడుకూరుచున్న) చెట్టుక్రింద,దలవంచుకునిచెట్టునకుఁ బూలశోభవలెనే మందహాసము పెదవినిండగా నుండెను. అనగాఁ జిరునవ్వులో వృక్షముక్రింద నిలుచుండెను.

శ్లో॥ దృష్ట్వావిష్వక్కృతకితవతావ్రీడితా గూఢహాసా
నమ్రాఘుల్ఘుల్లలితరశనస్స్పృష్టతత్పాదపద్మా
తద్దత్తాశీరభిముఖమధస్సంస్థితా తత్పురస్తా
దూచే వాచం సరసకదళీసత్ఫలస్పర్థిసారాం॥

చ॥ అటునిటుజూచియుం గపటమైనటియించుట చేత సిగ్గునన్
దటుకున లోననవ్వి మొలత్రాటను గజ్జెలుమ్రోయవానిముం
గిటనతశీర్షయై వనిత కేలు మొగిడ్చియు వానిదీవనన్
చటులతనందియిట్లనియె సత్కదళీఫలసారవాక్యలన్॥ ౬౮

అర్థము—విష్వక్ = అంతట, దృష్ట్వా = చూచి, కృతకితవతా వ్రీడితా = చేయఁబడిన తనకపటంపుతనముచే సిగ్గుపడినదై. (అందులకే) గూఢహాసా = నిగూఢముగనున్న నవ్వుగలదై, ఘుల్ ఘులితరశనం = ఘులఘులయనుచున్న మొలనూలుగలుగునట్లుగా, నమ్రా = వంగినదై, స్పృష్టతత్పాదపద్మా = తాకినవానియడుగుదామరలుగలదై, తద్దత్తాశీః = వానిచేనీఁబడిన దీవనగలదై, అభిముఖం = ఎదురుగా, అధః = క్రిందుగా, సంస్థితా = నిలుచున్నదై, తత్పురస్తాత్ = వానియెదుట, సరస...సారాం = సరస = బాగుగఁబండిన, కదళీసత్ఫల — అరటిపండును, స్పర్థి = ఎక్కిరించు, సారాం = రుచిగల, వాచం = వాక్కును ఊచే = పలికెను.

తా—అంతటను జూచి తాను కపట కాపున సిగ్గుపడినదై, నవ్వునణచుకొని మొలనూలు ఘల్లుఘల్లుమనునట్లుగా విలాసముతో వానిపాదములఁ బట్టుకొనెను. అతఁడాశీర్వదించెను. అంతనడకువతో 'పరిణతిసరసం కదళీఫలమ్మను' నీయమున నరటిపండువలె మధురమైన మాటలనిట్లనియె.

శ్లో॥ మాకుప్యేస్త్వం మయిసదయ హ్యాత్తమత్ప్రీతివాక్యం
వ్యాహర్తుం మే స్మసిచపలతా నంచితాహంబ్రవీమి
ఛాయాపూర్ణచ్ఛదపరివృతేషూన్నతేషు ద్రుమేషు
ప్రాప్తేష్వేతత్సు త్యజసికిమితి గ్లానిభావాన్నతేకిం॥

ఉ॥ కోపముఁ గాంచనెంచకుము కూరిమితోఁ దయాంనహృందవై
నాపలుకాలకించి వచనమ్ము దుమెప్పెదు రీతి నేనునుం
జాపలచిత్తనై యడుగఁజాలితి, నేలొకో యిట్లు నీవు ఛా
యాపరిపూర్ణవృక్షసుఖమారడిపుచ్చుచు నెండ నుండుటల్॥ ౬౫

అర్థము—మయి=నావిషయమై, త్వం=నీవు, మాకుప్యేః=కోపింపకుమా, ప్రేమతః=స్నేహమువలన, సదయహృత్=దయతోఁగూడిన మనస్సుగలవాఁడవై, మే=నాకు, ప్రీతివాక్యం=ఇష్టమైనమాటను, వ్యాహర్తుం=చెప్పుటకొఱకు, అర్హసి=తగుదువు. అహం=నేను, చపలతావంచితా=చలచిత్తముచే మోసపోయి, బ్రవీమి=చెప్పుచున్నాను. ఛాయా-తేషు=ఛాయా=నీడచే, పూర్ణ=నిండిన, ఛద=ఆకులచే, పరిత్స్రతేషు=ఆవరింపఁబడిన, ఉన్నతేషు=ఎత్తైన, దుమేషు=చెట్లు ప్రాన్తే=దగ్గిర, సత్సు=ఉండగా, కిమితి=ఏమని, త్యజసి=విడిచితివి, తే=నీకు గ్లానిభావః=ఆయాసము, నకిం=లేదా.

తా—నామీఁదకోపము చేయకు. దయాంతఃకరణముతో నాకుజవాబుచెప్పుము. నేను చపలచిత్తురాలనై యడుగుచున్నాను. ఏమనగా, ఇక్కడదగ్గిర నే చాల యాకులుగలిగి నీడనిచ్చు చెట్లుండఁగా వానిని విడిచితివి. నీకు నెండవలని శ్రమము లేదాయేమి ?

శ్లో॥ ఆకారేణామరప 'సుతో రాజరాజాత్మజః కిం
నో చేద్వీతాంకకస్తూరిః భృత్యాంగపుష్పాంబకః కిం
త్వాంపశ్యం త్ర్యైతిభవతిధీర్మే మహాత్మన్వివస్వ
ద్ద్యోతేనాలంగ్లపితఇవమే భాసికింతిష్ఠసీహ॥

తే॥ గీ॥ నీదునందంబుఁ జూచిన నిష్కళంక
శశియొ, నలకూబరుఁడొ, యింద్రజాతుఁడో, శ
రీరవన్మదనుఁడొ యన్నరీతిఁదోఁచు
నెండబడలిలివిచ్చుట నేలయుంటి॥ ౬౬

అర్థము—మహాత్మన్=ఓమహాత్ముఁడా, త్వాం=నిన్ను, పశ్యంత్యాః=చూచునట్టి, మే=నాకు, ఇతి=ముందు జెప్పఁబోవు, ధీః=బుద్ధి, భవతి=కలుగుచున్నది. ఏదన—ఆకారేణ=సౌందర్యముచేత, అమరవరసుతఃకిం = జయంతుఁడా? రాజరాజాత్మజఃకిం = నలకూబరుఁడా ? నోచేత్ = అట్లుకాదేని; వీతాంకక = కళంకములేని, హరిణభృత్ కిం = చంద్రుఁడా? సాంగ = శరీరముతోఁగూడిన, పుష్పాంబకఃకిం = మన్మథుఁడా? వివస్వద్భ్యాతేన = ఎండచేత, అలం = బాగుగ, గ్లపితఇవ = వాడినవాఁడువలె, మే = నాకు, భాసి = కనఁబడుచున్నావు. ఇహ = ఇక్కడ కిం తిష్ఠసి = ఎందునకున్నావు ?

తా—నిన్ను జూచిన మాత్రనే చక్కఁదనంబున జయంతుఁడో, నలకూబరుఁడో లేక కళంకములేని చందమామయో సశరీరుఁడైన మన్మథుఁడో యనెడుబుద్ధిగలిగెడును. బాగుగ నెండగొట్టినవాఁడువలె నుంటివి. ఇక్కడ నెందుకుంటివి ?

శ్లో॥ శ్రీఖండాహిక్షతబలతయామందసంస్పందమానై
ర్వాతాంకూరైర్విచలితదళాగ్రేషుకుంజోదరేషు
నీరంధ్రోద్యత్ప్రసవకశిపువ్యాస్తృతేషూపకంఠే
కింవాధత్సేసువిరళదళేసన్నివేశంద్రుమాంతే॥

చ॥ చందనసర్పనిర్దళితసారబలుండయిమెల్లవీచునీ
మందపుగాడ్పుచేఁగదలుమ్రాకులయాకులతోడదట్టమై
చిందెడుపూవుమొత్తములసెజ్జలఁగూడునికుంజముండఁగా
నెందుకుపత్రహీనమగువృక్షముక్రిందవసింపఁగావలెన్॥ ౬౨

అర్థము—శ్రీఖండ = మంచిగంధము చెట్లయందలి, అహి = పాములచేత, క్షత = పోఁగొట్టఁబడిన, బలతయా = బలముకలవగుటచే, మంద = నిమ్మళముగా, స్పందమానైః = వీచుచున్న, వాతాంకూరైః = గాలిమొలకలచే, విచలిత = కదల్పబడిన, దళాగ్రేషు = ఆకులచివరలుగలవియు, నీరంధ్ర = దట్టముగ, ఉద్యత్ = బయలుదేరిన, ప్రసవ = పూలమొక్కల, కశిపు = సెజ్జలచేత, వ్యాస్తృతేషు = ఆవరింపఁబడిన, కుంజోదరేషు = పొదరిండ్లు, ఉపకంఠే = సమీపమందు ఉండగా,

సువిరళదళే = పలుచనియాకులుగల, ద్రుమాంతే = చెట్టుదగ్గిర, సన్నివేశం = ఉనికిని, కింధత్సే = ఎందుకుఁజేయుచున్నావు ?

తా—దక్షిణదిక్కునందుఁ జందన వృక్షములయందు సర్పములుండు. అవి వాయుభక్షకములు గాన మందములైనవో యనునటులు, మందమారుతము వీచుచుండఁగా బాగదట్టముగ నాకులచేవ్యాప్తమునై పూలురాలి సెజ్జలుమెత్తగానున్న పొదరిండ్లు దగ్గిరనుండగా నందుండక యాకులులేని చెట్టుక్రింద నేమనియున్నావు ?

శ్లో॥ శ్రాంత్యోత్థాతుంయదినవిపుణస్సంప్రతిత్వంవిధేయాం
మత్వాపాణింమమకరుణయాసంగృహాణాశునేష్యే
వల్లీగేహంమృదుసురభిలంశీతవాతప్రభూతం
భాస్వద్భానుప్రతతమవనీజాతమాసేవసేకిం॥

తే॥ గీ॥ శాంతిసెప్పుడు లేవఁగాఁజాలవేని
యావిధేయనిపాణిగ్రహింపు చల్ల
గాలిపరిమళమగు లతాగారమునకుఁ
జేర్తునెండనించెడువృక్ష సేవ మేల॥ ౩౭

అర్థము—సంప్రతి = ఇపుడు, శ్రాంత్యా = ఆయాసముచేత, ఉత్థాతుం = లేచుటకు, ననిపుణోయది = చేతకానివాఁడవైతే, త్వం = నీవు, విధేయాం = నన్ను విధేయురాలినిగ, మత్వా = తలఁచి, కరుణయా = దయచేత, మమ = నాయొక్క, పాణిం = చేతిని, సంగృహాణ = పట్టుకొమ్ము, ఆశు = చప్పున మృదు సురభిలం = మెత్తనిదై పరిమళించునదియు, శీతవాతప్రభూతం = చల్లనిగాలి యధికముగలదియునైన, వల్లీగేహం = లతాగృహమును, నేష్యే = చేర్చెదను. భాస్వద్భానుప్రతతం = సూర్యకిరణములచే వ్యాప్తమైన, అవనీజాతం = చెట్టును, కిమాసేవసే = ఎందులకాశ్రయించెదవు ?

తా—ఇపుడు నీకుఁగదలుటకు ఓపికలేకపోయిన యెడల నన్నువిధేయురాలనుగనెంచి నాచేయిపట్టుకొనుము. చల్లనిగాలి పరిమళముగల యాలతాగృహమును వెంటనే చేర్చెదను. అంతేగాని, నీడలేక యెండతోనున్న యీచెట్టునేలయాశ్రయించెదవు ? అనఁగా నెండలో నీచెట్టుక్రింద నేలకూర్చుండెదవు ?

శ్లో॥ సేవార్థానామభిమతకరీత్యూచిరేధర్మవృద్ధా
స్తత్త్వంకోవాభవతుమహితప్రాభవో భవ్యమూర్తిః
తన్మత్సేవాంస్వబలవిహితాం సాధుసంగృహ్యకామం
ప్రాప్తశ్రీకాంరచయితుమలంప్రార్థయేఽనుగ్రహేణ॥

తే॥ గీ॥ అర్హజనసేవ యిష్టదమనుచు పెద్ద
లందురందుచే నీవెవ్వఁడైనఁగాని
శక్తుఁడవు భవ్యమూర్తివి శక్తికొలఁది
సేవసేసెదననుధన్యుఁ జేయుదయను॥ ౧౯॥

అర్థము—అర్హాణాం= పూజ్యులైనవారియొక్క, సేవా = కొలువు, అభిమత కరీ = ఇష్టముచేయునది, ఇతి = అని, ధర్మవృద్ధాః = పెద్దలు, ఊచిరే= చెప్పిరి, తత్ = అందుకని, త్వం = నీవు, కోవా = ఎవఁడవైన, భవతు = అగుఁగాక, మహిత =ఒప్పుచున్న, ప్రాభవః = సామర్థ్యముగలవాఁడవును, భవ్యమూర్తిః = మంగళవిగ్రహుఁడవును, తత్ = గనుక, స్వబలవిహితాం = నాశక్తిచేఁ జేయఁబడిన, మత్సేవాం = నాకొలువును, సాధు = లెస్సగ, సంగృహ్య = గ్రహించి, కామం = మిక్కిలీ, ప్రాప్తశ్రీకాం= పొందబడిన శోభగలదానిగ, అనుగ్రహేణ =దయచేత, రచయితుం = చేయుటకొఱకు, అలం = మిక్కిలీ, ప్రార్థయే = వేడుకొందు.

తా—పూజ్యులసేవ మేలుచేయునదని పెద్దలు చెప్పుదురు. అందుకని నీవెవఁడవైనసరే, మంచిసామర్థ్యముగలవాఁడవు. మంగళమూర్తివి గనుక పూజ్యుఁడవు. గనుక నాశక్తికొలది నేఁజేయుసేవనంగీకరించి యనుగ్రహముచేతనన్ను కృతార్థురాలినిగఁ జేయవేడుచున్నాను.

శ్లో॥ ప్రాప్తేకుంజాంతరమయిపరం పాదసంవాహనాది
వ్యాపారేణవ్యపగతపరిశ్రాన్తిమూలం విధాతుం
తస్మాదస్మత్కరముపగృహాణాశునీత్వానికుంజం
విశ్రాన్తంత్వాం ప్రణయిహృదయం సంవిధాస్యేభవంతం॥

తే॥ గీ॥ పొదనుజేరిననొత్తెద పదయుగంబు
శ్రాంతిదీర్చెద కేల్పట్టిరమ్ముప్రూవు
టీరమునఁజేర్చి సుఖపెట్టి యోలమితోడ
నిన్నుఁ బ్రియాత్ముఁగాఁజేయ నేర్తునేను॥ ౨౦॥

అర్థము—అయి = ఓయి, నీవు, కుంజాంతరం = పొదరింటిని, ప్రాప్తే = పొందినవాఁడవగుచుండఁగ, పాదసంవాహనాదివ్యాపారేణ = పాదములొత్తుట మొదలుగాఁగల కొలువుచే, వ్యపగత = పోయిన, పరిశ్రాంతి మూలం = ఆయాసకారణముగలవానిగ, విధాతుం = చేయుటకు, పరం = మిక్కిలి కోరుచున్నాను. తస్మాత్ = అందుకని, అస్మత్కరం = మాచేతిని, ఉపగృహాణ = పట్టుకొమ్ము, ఆశు = శీఘ్రముగా, నికుంజం = పొదను, నీత్వా = చేర్చి, త్వాం = నిన్ను, విశ్రాంతం = శ్రమపోయినవానిగాఁజేసి, భవంతం = నిన్ను, ప్రణయిహృదయం = స్నేహముగలమనస్సుగలవానిగా, సంవిధాస్యే = చేయఁగలను.

తా—ఓయియక్షుఁడా నీవు పొదలోనికి వచ్చితివా. నీపాదములొత్తి యుపచారములుచేసి నీకాయాసము పోఁగొట్టెదను. గనుక నాచెయిపట్టుకుని లేచిరమ్ము. పొదరింటినిఁజేర్చి నిన్ను సుఖపెట్టి స్నేహమతిశయించునట్లు చేసెదను.

శ్లో॥ ఏవం వక్త్ర్యామమరవిభునా ప్రేషితాయాం యువత్యాం
తత్తచ్చిహ్నైస్స్వవశమనిశం నేతుకామేతి మత్వా
శాపప్రాప్తవ్యధితహృదయ స్సంస్మరం స్త్వామజస్రం
ప్రత్యూచే తాం యతనరచిత స్మేరకాంతో వక్త్రః॥

చ॥ సురపతిపంపునన్ యువతి సొప్పడఁ జెప్పినయక్షుఁడావె వై
ఖరులనుబట్టితన్ను వశగామినిఁ జేయఁగవచ్చినట్లు లో
నెఱిఁగియు శాపతప్తహృదయోచ్చ్యుఁడు నిన్నుదలంచి లేని సం
బరము ముఖంబునంగదురఁ బ్రత్యుత్తరమిచ్చె నీగతిన్॥ ౭౧॥

అర్థము—అమరవిభునా = ఇంద్రునిచేత, ప్రేషితాయాం = పంపబడిన, యువత్యాం = స్త్రీ, (అనురూప) ఏవం = ఈప్రకారము, వక్త్ర్యాం = చెప్పినదగుచుండఁగ, అనిశం - మిక్కిలి, స్వవశం = తనయధీనమును, నేతుకామేతి = చేయనిచ్ఛగలదని తత్తచ్చిహ్నైః-ఆయాగుర్తులచే, మత్వా = తెలుసుకుని శాపప్రాప్తవ్యధితహృదయః = కుబేరశాపముచేతసంభవిల్లిన వ్యథగలమనస్సుగల యామయక్షుఁడు, త్వాం = నిన్ను, అజస్రం = మిక్కిలి, సంస్మరన్ = తలంచుచున్నవారై, యతన = ప్రయత్నముచేత, రచిత = చేయఁబడిన, స్మేరతా = చిరునగవుచేత, కాంత = సుందరమగు, వక్త్రః = ముఖముగలవాఁడై, తాం = సూరూపను, ప్రత్యూచే = ప్రత్యుత్తరమిచ్చెను.

తా—ఇంద్రుఁడుపంపిన సురూపయాలాగుననఁగ నాయక్షుఁడు, తననుస్వాధీనము చేసికోవలెనని తలఁచినదని యాయాచేష్టలచేఁ దెలిసికొని శాపపీడితహృదయుఁడై నిన్నుఁదలఁచి తలఁచి తెచ్చిపెట్టికొనిన నవ్వుచేనొప్పిన ముఖముగలవాఁడై దానికిఁ ప్రత్యుత్తరమిచ్చెను.

శ్లో॥ ధన్యాసిత్వంపరహితకృతిప్రీత్యాంభవ్యరూపే
దృష్టాఏవప్రకృతిమధురాస్సాధుకుంజాస్సుగుంజాః
స్వస్థేచిత్తేగుణముపనయంత్యుజ్జ్వలంప్రజ్వలంతం
నోచేద్వ్యర్థానిహిహతరయంరమ్యవస్తూనిలోకే॥

చ॥ ఒరులకుమేలుసేయు గుణముండుటచేతఁ గృతార్థురాలవై
పరగితినీవు, నేనుస్వభావమనోజ్ఞము లైనపుష్పమం
దిరములఁ గాంచియుంటిని, సుఖింగనురమ్యపదార్థముల్ మన
స్స్థిరతవహించియున్నపుడు, చేటగు నేనప్పు డవ్విసుందరీ. ౭౨॥

అర్థము—భవ్యరూపే=చక్రనిదానా, పరహితకృతిప్రీత్యా=ఇతరులకు మేలుచేయునిచ్చచేత, త్వం=నీవు, కృతకృత్యురాలవు, ప్రకృతిమధురాః=స్వభావసుందరములైనవియు, సుగుంజాః= మంచికృష్ణలయనెడితీగలుకలవియునైన, కుంజాః=పొదలు, సాధు=బాగుగ, దృష్టాఏవ=చూడఁబడినవియే, లోకే=లోకమందు, రమ్యవస్తూని=చక్కనిద్రవ్యములు, చిత్తే=మనస్సు, స్వస్థే=సుఖముగనుండినచో, ఉజ్జ్వలం=శృంగారమునుగూర్చి, ఉజ్జ్వలంతం=వెలుగుచున్న, గుణం= ప్రాశస్త్యమును, ఉపనయంతి=పొందించుచున్నవి, నోచేత్=అటుకాదేని, హతరయం=పోయిన స్వగుణవేగము గలుగునట్లుగ, వ్యర్థానిహి=నిష్ఫలములుగదా?

తా—ఇతరుల కుపకారముచేయవలెనని బుద్ధిగలుగుటచే నీవు కృతార్థురాలవే యోచక్రనిదానా! నేను స్వభావసుందరములైన చక్కనితీగెలచే వ్యాప్తములైన పొదగిండ్లను బాగచూచినవాడనే లోకమందురమ్యపదార్థములు మనస్సుసుఖముగానున్న వానికి శృంగారప్రకాశమునుచేయును గాని సుఖస్థితిలేనివానికిఁ జేయలేక వ్యర్థములగును.

శ్లో॥ స్వచ్ఛందోన్మేషపటువిదితశ్లేష్మయా సాధుచేదం
వ్యాప్తేగంధేసురభిః సుమంగోచరం నాపిలోకే
నోజానీతేవసతియః కో స్త్రీతకో వారసజ్జ
స్స్వేహాంప్రియోజనవిరహితస్సంహితాత్మానితాంతం॥

చ॥ ఎఱిగితి నీమతంబుఁ దగనిప్పటి చేష్టలచేతదిక్కులం
బరిమళమల్లకొన్నఁ గుసుమంబు నెఱుంగఁగ లేరె? దగ్గరం
బరగెడువేళ నేరయినఁ బ్రాజ్ఞులెఱుంగుదు రట్టిడయ్య నే
సరసిజనేత్రఁ బాయుటను స్రస్తమనస్కుఁడనైతిఁ దయ్యెడన్॥ ౭౩

అర్థము—చేష్టయా=వ్యాపారముచేత, త్వచ్ఛందః=నీయభిప్రాయము, మే=నాకు, సపది=ఇపుడు, విదితః=తెలియఁబడినది. ఇదంచ=ఈపనియు, సాధు=మంచిదే. లోకే=జగమందు, గంధే=పరిమళము, వ్యాప్తే= వ్యాపించినదగుచుండఁగ కుసుమం=పువ్వు, గోచరం=తెలియబడునది, నాపి=కాదా, నికటే=సమీపమందు వసతి (ఒకడు) నివసించియుండగ, కోవారసజ్ఞః=ఏతెలివిగలవాఁడు, నోజానీతే-తెలిసికొనడు? అహం=నేనును, సః=అట్టితెలిసికొనువాడనే; అయితే, ప్రియాజనవిరహాతః =భార్యావియోగమువలన, నితాంతం=మిక్కిలీ, సంహతాత్మా=నష్టమనస్కుఁడను అయితిని.

తా—చేష్టలచేనీయభిప్రాయము తెలిసినదిలే. వాసనకొట్టుచుండఁగఁబుష్పము తెలియకుండునా? దగ్గిరనుండఁగ ఏమాత్రము తెలివిగలవాడైనను తెలిసికొనలేడా? నేనుకూడ నట్టితెలివిగలవాడనే అయితే ఇపుడుభార్యను నెడబాసిన వాఁడనుగనుక బుద్ధిదగ్గిర లేకుండ నున్నాను. అంతే.

శ్లో॥ చేష్టాయాస్తాస్సముపరచితా యత్నతోమత్ప్రియాయా
శ్చేష్టాగంధంస్పృశతినమనాక్ తావకంరూపమేవం
స్వర్గంగాయాఃపయసివిహరద్రాజహంసస్యకుల్యా
సిత్వంయాహిద్రుతతరమితోయాహికుంజాంతరంతత్ ॥

తే॥ గీ॥ యత్నకృతమలౌనీచేష్టలట్టువీను
రూపమునునాప్రియాంగనారూపమునకు
జేరదాకాశగంగావిహారహంస
కాల్వఁదిరుగునే? వేగంబకదలిపొమ్ము॥ ౭౮॥

అర్థము—యాః చేష్టాః=ఏయేవిలాసచేష్టలు, (నీచేత) యత్నతః=మహాప్రయత్నముతో, సముపరచితాః=చేయఁబడినవో, తాః=ఆనీచేష్టలు, మత్ప్రియాయాః=నాప్రియురాలియొక్క, చేష్టాగంధం=విలాసలేశము నైన, నస్పృశంతి=తాకవు, ఏవం=ఈప్రకారముగానే, తావకం=నీదైన, రూపం=సౌందర్యమున్ను, నాప్రియురాలిరూపము ను-మనాక్=కొంచమైన, నస్పృశతి=అంటదు, స్వర్గంగాయాః=గంగానదియొక్క, పయసి=ఉదకమందు, విహరద్రాజహంసస్య=సంచరించురాయంచకు, కుల్యా=చిన్నకాలువ, యెట్టులోయటులు-త్వం=నీవు, అసి=అగుదువు, గనుక, ఇతః=ఇక్కడనుండి, ద్రుతతరం=అతిశీఘ్రముగ, యాహి=వెళ్ళు, తత్=ఆనీవుచెప్పిన కుంజాంతరం=పొదరింటిని (గూర్చి) యాహి=నీవేవెళ్ళుము.

తా॥ నీవు మహాప్రయత్నముతోఁ జేసిన శృంగారచేష్టాదులు నాప్రియురాలి విలాసములలో నల్పాంశమైన కొనసరిరావు. నీవిలాసములకంటె నాప్రియురాలి

విలాసములే యెక్కువైనవి. నీచక్కఁదనమును నాప్రియురాలి చక్కఁదనమునకుఁ బోలదు. గంగానదిలో విహరించు రాజహంసకుఁ జిన్న కాలువవంటి దానవు. గనుక వెంటనే యిక్కడనుండి వెళ్ళిపో, ఆపొదరింటికిఁ గావలసియుంటే నీవే వెళ్ళిపో.

శ్లో॥ ఇత్యుక్త్వైవ గ్లపితహృదయా పద్మినీ వేందుపాదై
స్సంస్పృష్టా సా సమవదదితి స్విన్నవక్త్రాంబుజన్మా
నైవం వాచ్యం సరస సరసికాస్స్వస్త్రియోఽప్యన్యకాంతా
మాలంబంతేఽమితసుఖభరప్రేప్సయా కుత్సితాః కిం॥

చ॥ అనవినియాలతాంగి మిహికాంశుకరమ్ములు సోకునీర జం
బునుబలె నోడిశిఁజ్జెమట మూఁగినవక్త్రసరోజపత్రయై
యనియె రసజ్ఞ యీసరణి నందురె పండితు లాత్మపత్నినిం
దనివిసుఖింపనన్యవనితామణిఁ గాంతురు వారు నింద్యులే॥ ౭౩॥

అర్థము — ఇతి = ఈరీతిని, ఉక్త్వైవ = చెప్పఁబడినదగుచునే, ఇందుపాదైః = చంద్రికిరణములచే, సంస్పృష్టా = తాకఁబడిన, పద్మినీఇవ = తామరతీగవలె, గ్లపిత హృదయా = సిగ్గుపొందినమనస్సుగలదై, సా = సురూప, స్విన్నవక్త్రాంబుజాతా = చెమటపట్టినముఖపద్మముగలదగుచు, ఇతి = ఇట్లు, సమవదత్ = చెప్పెను, సరస = ఓయిసరసుడవైనయత్నుఁడా, ఏవం = ఇట్లు, నవాచ్యం = అనఁగూడదు, రసికాః = పండితులు, స్వస్త్రియః = తమకాంతలను, అపి = ఇంకను, అమితసుఖభరప్రేప్సయా = అధికసుఖముపొందనిచ్ఛచేత, అన్యకాంతాం = పరస్త్రీనికూడ, ఆలంబంతే = స్వీకరించుచున్నారు, అట్టివారు కుత్సితాఃకిం = నిందితులాయేమి?

తా — ఇట్లుచెప్పఁగానే యానురూపవెన్నెలతాకిన తామరతీగవలె కాంతిహీనరాలై సిగ్గుపడి ముఖముమీఁద చెమటపుట్టి యిట్లనియె. ఓయి సరసుఁడా, నీవిట్లు అనవచ్చునా! లోకములో సరసులైనవారు తమ భార్యలతో విహరించువారైనను సుఖచమత్కారాదుల పరీక్షకై పరస్త్రీలనుగూడ రమించుచుందురు. అట్టివారందఱు తక్కువవారాయేమి? (అందుకని నన్ను గ్రహింపవచ్చునని భార్యను తలఁచి విడిచిపెట్టకుమా యని తనకులోఁబరచుకొను విధమున చెప్పెను.)

శ్లో॥ సాధ్వీనామేతరకరపరిస్వీకృతిర్నిందనీయా
రాజర్షీణామపి చ విహితస్సాధుదాక్షిణ్యభావః
ఇత్యాదిస్స్వశ్రుతికటుశిరస్సంవదన్తీం సుదంతీ
మంతస్స్థాపోఽప్యగదదితి తాం సంశ్రయన్ధర్మమార్గం॥

చ॥ పరులనుగూడ సాధ్వులకుఁ బాపము దక్షిణనాయకోగ్రణుల్
వరపతులట్టివారు పరనారులఁ గూడుటయొప్పునన్న త
త్పురుషపు భాషలాడెను సుదంతిని గాంచివిచారమొందియుం
సరసవచోనిరూఢిమెయిఁ జానకి నిట్లని పల్కె నాతఁడున్॥ ౭౬

అర్థము—ఇతరకరస్వీకృతిః=పరకరగ్రహణము, సాధ్వీనాం=పతివ్రతలకు ఆ=మిక్కిలీ, నిందనీయా=నిందింపఁదగినది. సాధు=అత్యంతము, దాక్షిణ్యభావః=అనేకత్రతుల్యత్వము, రాజర్షీణామపి=రాజర్షులకును, విహితశ్చ=ఏర్పడినదే. ఇత్యాదేః=ఈమొదలుగాఁగల, స్వశ్రుతికటుగిరః=తనచెవులకుఁ గఠినములైనవాక్కులను, సంవదంతీం=చెప్పుచున్న, సుదంతీం=చక్కనిపలువరుసగల, తాం=సురూపను, అంతస్తాపోపి=లోపలసంతాపముగలవాడైనను, ధర్మమార్గం=న్యాయపద్ధతిని, సంశ్రయన్=అవలంబించుచు, ఇతి=ఇట్లు, అగదత్=పలికెను.

తా॥ ఇల్లాండ్రకు నితరసంగము కూడదు. (గానిమాకేమి) రాజులు మొదలగు వారుదక్షిణనాయకులున్నారుగదా. అనగా "తుల్యోనేకత్రదక్షిణ" యనున్యాయము ననుసరించి. అనేకస్త్రీసంగతి తగునుగదా యనితాత్పర్యము. ఈవిధముగాతనచెవికి కఠినముగానుండు మాటలనుచు మాటాడుచున్నపుడు తనదంతకాంతిచే సుందరియగు సురూపను గూర్చిన్యాయమార్గావలంబనముచే నిట్లనియె.

శ్లో॥ విశ్వామిత్రోఽపినసమభవం వైధసస్పర్ధిభావ
శ్శక్తేఃపుత్రోఽపినసమభవం ధర్మశాస్త్రప్రణేతా
నాహంభూభృజ్జనిసహచరో దారుకారణ్యచారీ
నాహంసాధువ్రతనియమినా మంతరేయఃకీటః॥

ఉ॥ ఏను వసిష్ఠుతోఁ గలహించిన గాధిసుతుండఁ గాను ధ
ర్మానుగతానుశాస్త్రముల సారసి వ్రాయుపరాశరుండ నుం
గాఁ బెడదారుకావనము నందిరుగాడుశివుండ గాను స
ద్ధ్యానపవిత్రులౌ మునుల యందొకరుండను గాను యత్నుడన్॥ ౭౭

అర్థము— వైధసస్పర్ధిభావః=వసిష్ఠునితోఁ గలహించిన, విశ్వామిత్రోపి=విశ్వామిత్రుఁడనెడు ఋషినైన, నసమభవం=కానైతి ధర్మశాస్త్రప్రణేతా=ధర్మశాస్త్రకర్తయగు, శక్తేఃపుత్రోపి=పరాశరుడనైన, నసమభవం=కానైతి, దారుకారణ్యచారీ= దారుకారణ్యమందు మునిస్త్రీలతోఁ సంచరించిన, భూభృజ్జనిసహచరః=శివుఁడనైన, అహం=నేను, న=కాను, అహం=నేను, సాధువ్రతనియమి

నాం=మంచివ్రతములుచేయు మునులయొక్క, అంతరే=మధ్యను, (ఒకానొకడను) న=కాను. ఇక నేమనిన, యక్షకీటః=అల్పుఁడైన యక్షుఁడను.

తా—వసిష్ఠునంతవానితోఁ బోరిన విశ్వామిత్రుఁడగాను. ధర్మశాస్త్రకర్త యగు పరాశరుడగాను. దారుకారణ్యమున మునిస్త్రీలతోఁగూడిన శివుడనుగాను. ఇంక తపోధనులగు మునులలో నొకడను గాను. చాలతక్కువవాఁడయిన యక్షుడను. (నీవుచెప్పిన దాక్షిణ్యాదులు వారివారికిఁగాని పరస్పరానురాగయుక్తులగు మాదంపతుల విషయమట్లుగాదని తాత్పర్యము.)

శ్లో॥ నేత్రే బాష్పప్రతతిపతితే నీరజాతోపమానే
నాసాక్లిన్నా మలినజలతశ్చంపకేనా త్వధన్యా
మాంసాత్మ్యౌరోభవయుగమపిస్వర్ణకుంభోపమానం
మూఢానామేవమితికిమితిజ్ఞాతతత్వాత్మకానాం॥

ఉ॥ నీరునుగార్చుకన్నులను నీరజసామ్యములంచు శ్లేష్మ సంచారకమైననాసికను జంపకమంచును గంపసంపిండ సంపూరకమైనచన్నుగవ ప్రత్తడికుండలంచు మూర్ఖులా వారలుసెప్పుచుందురు పండితులెన్నఁడుఁ జెప్పరాగ శేన్॥ ౭౮

అర్థము—బాష్పప్రతతిపతితే=కన్నీటివెల్లువచే వ్యాప్తమైన, నేత్రే=నయనములు, నీరజాతోపమానే=పద్మసదృశములు మలినజలతః=పడిసెమువలన, క్లిన్నా-తడిసిన, నాసా=ముక్కు, చంపకేన=సంపంగిపువ్వుతో, అ త్వధన్యా=సరియైనది, మాంసాత్మ్యౌరోభవయుగమపి=మాంసవికారమైన స్తనద్వయముకూడ, స్వర్ణకుంభోపమానం=కనకకలశసమానము, ఏవమితి=ఈలాగనెడుబుద్ధి, మూఢానాం=తెలివితక్కువవారికే, జ్ఞాతతత్వాత్మకానాం=వాస్తవమయిన జ్ఞానముకలవారికి, కిమితి = ఇదియేమి?

తా—లోకమందు తెలివితక్కువవారు కన్నీళ్లుకార్చు నేత్రములను పద్మసమములని, పడిసెముచే మలినమయినముక్కును సంపంగికీడని మాంసపుముద్దలయిన స్తనముల బంగారుకుండలని యనుకొంచు వర్ణింతురుగాని యధార్థవేత్తలటులు పిచ్చిభ్రమపడుదురా?

శ్లో॥ ఏతాదృక్త్వాత్స్వవదిత వహ్నప్నిశ్చయస్స్వప్రియాయా
విశ్లేషేణప్రకృతిరహితో లక్ష్యసేకింనిమిత్తం
నైవంవాచ్యం శృతిషువిహితాస్స్వప్రియా నిత్యసక్తిః
శిష్టావాచాబహులతమయాగచ్ఛయాదృచ్ఛికేహం॥

తే॥ గీ॥ జ్ఞానశూన్యుని యట్లనీసతినిఁ గూర్చి
యార్తిఁగన నేలయంచు నన్నడుగరాదు
నిగమవిహితంబ యాత్మపత్నీరతంబు
పలుకు లేటికిఁ బొమ్మింక వలయుకడకు॥ ౭౯

అర్థము—సపది=ఇపుడు, తవ = నీయొక్క, హృన్నిశ్చయః = మనోనిశ్చయము, ఏతాదృక్ = ఇట్టిది, స్యాత్ = అయ్యెనా, స్వప్రియాయాః = నీభార్యయొక్క, విశ్లేషేణ = వియోగముచేత, ప్రకృతిరహితః = జ్ఞానశూన్యుఁడవు(అయి) కింన్నిమిత్తం = ఎందుకని, లక్ష్యసే = కనఁబడుచున్నావు, అని ఏవం = ఇట్లు, నవాచ్యం = అనఁగూడదు. శ్రుతిషు = వేదములయందు, స్వప్రియా నిత్యసక్తః = తనభార్యయందుననురాగము, విహితా = ఏర్పడినది. బహులతమయా = అధికమగు, వాచా = వాగ్వాదముతో, కింవా = ఏమిప్రయోజనము, యాదృచ్ఛికేహం = ఇష్టమువచ్చినట్లు, గచ్ఛ = వెళ్లుమా.

తా—అంతతత్వవే తవయినచోనిట్లు ప్రియురాలి వియోగముచేత మతిలేనివాఁడవెట్లయితివని నన్నాక్షేపింపకుము. శాస్త్రమందుననురాగము తనభార్యయందే యుండవలయునని యున్నది. ఊరక అధిక సంభాషణముతో నేమిప్రయోజనము నీకుతోఁచినట్లు వెళ్ళిపొమ్ము.

శ్లో॥ ఏవంవక్తర్యనుదితరసే ధీరతాక్రాంతచిత్తే
భృంగీవాంచత్కనకకుసుమామోదతః క్లిశ్యమానా
లజ్జాక్రాంతాతదుదితవచశ్శ్రావణాత్సాన్యగాదీ
త్కామోచ్ఛేదకిం కువలయదృశాంపంచతావంచకస్యాత్॥

చ॥ అతఁడొకయింత మోహమును నొందక ధైర్యముగాంచిపల్క నా
చతురయుజంపకప్రసవ సౌరభముంగను ముంగియట్లు క్లి
న్నతగని వానిపల్కులు వినంగడుసిగ్గిలిపల్కు కామినీ
ప్రతతికి కామభంగురము ప్రాణముపీడుటకంటెనెక్కుడో॥ ౮౦॥

అర్థము—ధీరతాక్రాంతచిత్తే= ధైర్యముతోఁగూడిన మనస్సుగలవాఁడు గనుకనే, అనుదితరసే= తనయందుఁబుట్టని ప్రేమగలవాడై, ఏవం=ఈప్రకారముగా వక్తరి=చెప్పినవాఁడగుచుండఁగ, అంచత్కనకకుసుమామోదతః=వికసించిన సంపెంగపువ్వు వాసనవలన, భృంగీవ=ఆడుతుమ్మెదవలె, క్లిశ్యమానా = బాధనొందినదై, తదుదితవచశ్శ్రావణాత్ = వానిమాటలవిన్నందున, లజ్జాక్రాంతా = సిగ్గుచేపాడినదై, సా = సురూప, న్యగాదీత్ = తిరిగిపలికెను. కువలయదృశాం = స్త్రీలకు,

కామోచ్ఛేదః = కామముయొక్క హాని, పంచతావంచకః = చావును దిరస్కరించు నదికూడ, స్యాత్ = అవును

తా—ధీరుఁడై బానియందనురాగము లేనివాఁడై యిట్లు చెప్పఁగా నానురూపవికసించిన సంపంగిపూవాసనవలన నాడుతుమ్మెదవలె బాధపడినదై వాడిపోయియుంతియుకాక వానిమాటల విన్నందున సిగ్గుపడినదైయును నింకచూతమను న్యాయమున నేమోయనుచున్నది. ఏలయనగా స్త్రీలకు దమకామవిషయమైన పరాభవముచావుకంటె నెక్కువ యగునుగదా.

శ్లో॥ నాహంకన్యాసురగురువధూర్నాప్యహల్యావతారా
నానావేదప్రథితసవనోద్భూతధర్మైకలభ్యా
స్వీకర్తుర్నోగురుతరకలంకార్జనే కాభిలాషా
రంభాదిభ్యోఽప్యధినుతగుణావజ్రిణానిర్జరీణాం॥

ఉ॥ కన్నియఁగాను కాను గురుకాంతనుగౌతమపత్నిఁగాను నే
నెన్నఁగతారనుగానునిగమైకహితంబగుధర్మయజ్ఞసం
పన్నతఁగాంచుపూరుషులు పజ్జను జేరఁగనబ్బుదానఁ బా
పోన్నతిఁగోరవజ్రిదివిజోత్తమఁగానను నాత్మనెంచెదున్॥ ౮౧

అర్థము—అహం = నేను, కన్యా = సత్యవతిని, న = కాను, సురగురువధూః = బృహస్పతిభార్యతారను, న = కాను, అహల్యాపి = అహల్యను, న = కాను, తారా = తారను, న = కాను, ఇకనేమన్న, నానా = అనేకములగు, వేద = శాస్త్రములయందు, ప్రథిత = ప్రసిద్ధమైన, సవన = యజ్ఞములనుండి, ఉద్భూత = ఏర్పడిన, ధర్మ = పుణ్యముచేత, ఏక = ముఖ్యముగ, లభ్యా = పొందఁదగినదాననే, స్వీకర్తుః = నన్నుఁజేపట్టినవానికి, గురుతర = అధికమైన కలంక = పాపముయొక్క, ఆర్జన = సంపాదనయందు, అభిలాషా = కోరికగలదానను, నో = కాను, నిర్జరీణాం = దేవతాస్త్రీలలో, రంభాదిభ్యోపి = రంభమొదలైనవారికంటెను, వజ్రిణా = ఇంద్రునిచేత, అధినుతగుణా—మిక్కిలి, కొనియాడఁబడినగుణములఁగలదానను

తా—పరాశరసంగతయగు సత్యవతియను గన్యనుకాను చంద్రస్వీకృతయగు గురుభార్యనుగాను ఇంద్రగృహీతయగు గౌతమభార్య యహల్యనుగాను వాలిగృహీతతారనుగాను వారివలె ప్రత్యవాయముకల్పించుదానగాను శాస్త్రోక్తవిధిగా యజ్ఞములఁజేసిన పుణ్యమున లభింపఁదగినదాన. అందువలన నన్ను గ్రహించినవానికిఁ బాపముసంపాదించుదానకాను అట్టి దేవతాస్త్రీలలో నల్పురాలనుగాను రంభమొదలైన వారందఱిలోను దేవేంద్రుండు నన్నె యెక్కువగామన్నించును.

శ్లో॥ పుణ్యాంలింగాద్బాతవసముయుతస్త్వావకాలోకలోలా
స్వర్గోద్వేగాపదమిదమహంమయ్యసిక్లీబబుద్ధిః

లోకేయోషిద్వరణహాననంకిం నజానాసిపాపం
విశ్వామిత్రప్రభృతిమునయో మేనకాద్యాభికానో॥

ఉ॥ కాలముచేతఁ బుణ్యమునఁగాఁ దెలభించితి నీకునిన్ను నే
వేళనుజూచినానొస్మరవేదనఁ గల్గుటనిట్లువల్క నా
నేలొకొక్లీబబుద్ధివహియించితివీవు వరించుకాంత ని
ర్మూలము సేతువే! మునుపుపొందడె మేనకఁ గౌశికుండొగిన్॥ ౯౨

అర్థము—అహం = నేను. సమయతః = కాలవశమున, పుణ్యాత్ = పుణ్యమువలన, తవ = నీకు, లబ్ధా = దొరికినదానను. తావక = నీదైన, ఆలోక = చూచుటచే, లోలా = చంచలనై, స్మరోద్వేగా = మన్మథోద్రిక్తురాలను అయి, ఇదం ఇట్లు, అవదం = అంటిని. అయితే. నీవు మయి = నాయందు, క్లీబబుద్ధిః నపుంసకమతివి, అసి = అయితివి. లోకే = జగత్తున, యోషిద్వరణహాననం = స్త్రీకోరికన ణగఁ ద్రొక్కుట, పాపం = పాతకమని, నజానాసి = ఎఱుఁగవా! విశ్వామిత్రప్రభృతిమునయః = విశ్వామిత్రుఁడు మొదలుగాఁగల ఋషులు, మేనకాద్యాభికాః మేనక మొదలైన వారలను కామించినవారు, నో = కారా?

తా—కాలవశమునను నీపుణ్యమున దొరకి నిన్నుజూచి చపలనైకామోద్రేకనయితిని. నీవుమాత్రము నన్ను కామింపక నపుంసక సమానుఁడ వయితివి లోకములో స్త్రీకామమును దీర్పకున్న దోషమేకదా ? అట్టిదోషనివారణమునకే విశ్వామిత్రాదులు మేనకాదులను గామించిన వారుకారా.

శ్లో॥ త్వంకిం తేభ్యోఽప్యధికనియమీ సాధువేత్తాసికచ్చి
చ్ఛిష్టాచారః పరిచయపదం సర్వసాధుప్రజానాం
కామార్తాయాహృదయదళనం పాపమిత్యేవనోకిం
జ్ఞాతంధీమన్కలుషకలితః కింకరోషీహతస్మాత్॥

ఉ॥ వారలకంటెనీవు బలవద్వ్రతశాలివొ? వేత్తవో! తప
శ్శ్రీరులకేనివృద్ధస్మృతి సాదరణీయము మోహితాత్మలం
దూరుటపాపమంచు మదిఁదోఁచెనొ లేదొ ననుంద్యజించుటన్
ఘోరపుఁబాపముంగను మఁ గుందక చేసెడి దేమిధీమతీ॥ ౯౩

అర్థము—త్వం = నీవు, తేభ్యోఽపి = వారికంటెనున్ను, అధికనియమీ = ఎక్కువవ్రతములుగలవాఁడవును, సాధు = బాగ, వేత్తా = తెలిసినవాఁడవును, అసికచ్చిత్ = అగుదువాయేమి? సర్వసాధుప్రజానాం = అందఱుసత్పురుషులకు, శిష్టాచారః = పెద్దలయాచారము, పరిచయపదం = చేయఁదగినది, ధీమన్ = బుద్ధిమంతుఁడా, కామార్తాయాః = మన్మథపీడితురాలియొక్క, హృదయదళనం = మనస్సుబాధించుట,

పాపమిత్యేవ=పాతకమేయని, నజ్ఞాతంకిం=తెలియఁబడలేదా? తస్మాత్=నన్ను నిరాకరించినందున, కలుషకలితః=పాపయుక్తుఁడవై, ఇహ=ఇప్పుడు, కింకరోషి=ఏమిచేయుదువు?

తా—వారికంటె నీవు నియమముగలవాఁడవును బాగతెలిసినవాఁడవునా? పెద్దలయాచారము సత్పురుషులందఱికి నాచరింపతగినదే, ఈసంగతులన్ని తెలిసినవాఁడా, నేను కామాతురాలనయినిన్ను కామించినపుడు నామనస్సును బాధించుట నీకు పాతకమని తెలియదా? ఇట్టి పాతకముతోఁ గూడినవాఁడవై ఇపుడేమిచేయుదువు? ఈపాపమెట్టుతొలఁగుదువని తాత్పర్యము.

శ్లో॥ లీలాసృష్టోజ్జ్వలసుమధనూన్ముక్తనారాచ లక్ష్మీ
లక్ష్మప్రోద్యన్మధురలలితాం తామువాచాథధీరః
ప్రత్యూహానాంప్రమదసమయేఽప్యంతరం నిర్వికారం
యేషాంనస్యాద్భువికిమివతే ధీరగణ్యానితాంతం॥

చ॥ మదనవిలాససృష్టమగు మన్మథచాపవిముక్తబాణ సం
పదలకుఁ జిహ్నమైతనరు భావముగాంచిన యాలతాంగికై
హృదయము గోలుపోకయపుడిట్లను స్త్రీకృతమోహదష్టుఁడౌ
నదమునధీరతా గుణమునందని వాఁడొక ధీరగణ్యుఁడే॥ ౧౪

అర్థము—లీలా...లలితాం=లీలా=విలాసముచే, సృష్ట=నిర్మితమై, ఉజ్వల=వెలుగుచున్న, సుమధను=పూలవింటినుండి, ఉన్ముక్త=విడువఁబడిన, నారాచ=బాణములయొక్క-లక్ష్మీ=సంపదకు, లక్ష్మ=చిహ్నమై, ప్రోద్యత్=ప్రకాశించు,మధురలలితాం=శృంగారచేష్టలుగల, తాం=సురూపనుగూర్చి, ధీరః = మెత్తపడనివాడైనయక్షుఁడు, అథ=అంతట, ఉవాచ=పలికెను. ప్రత్యూహానాం=వికారహేతువులయొక్క-, ప్రమదసమయేపి= విజృంభణకాలమందును, యేషాం=ఎవరియొక్క-అంతరం=మనస్సు, నిర్వికారం=వికారములేనిది నస్యాత్=కాదో, తే=వారు, భువి=భూమియందు, నితాంతం=మిక్కిలీ, ధీరగణ్యాః=ధీరులనిలెక్కింపఁ దగినవారు, కిమివ=ఏట్లుగానౌదురు.

తా॥—ఇట్టిమాటలాడుచున్న సురూపశృంగారచేష్టలు మన్మథుఁడు విలాసముగపూలవింటినుండి విడిచిన బాణములవలె నున్నప్పటికి వానికిలోఁబడని ధీరుడైన యక్షుఁడు తిరిగియిట్లనియె. (ఆధీరత్వమునకు నర్థాంతరన్యాసము) వికారకారణము లెక్కువయిన కొలది యేవారియొక్క- మనస్సు వికారము పొందునోవారుధీరులగుదురా లోకమందని తాత్పర్యము.

శ్లో॥ అగ్నిష్టోమాదిక్రతుకిరణదప్రవ్యవిక్రేయకాలా
స్స్ఫూర్తీనాంవాబహుజనసముచ్ఛిష్టదంతచ్ఛదానాం

ఘోరేయుద్ధేతృణవదభినిర్ముక్తగాత్రోజ్జ్వలానాం
పాణిత్యాగాద్గ్లపితవపుషాంసంగమేనాలమేవ॥

ఉ॥ క్రతుకృతపుణ్యవిత్తమునఁ గాంచఁగఁదగ్గతనూవిలాసముల్
హితశతమానమోవులును నేపగుయుద్ధమునందుజచ్చి స్వ
స్థితఁగసవారిచేఁబడలి పారమువాసిన కాయముల్ నిజ
స్థితులివిమీ కుమీయెడలఁ జెందెడుసౌఖ్యము లాభకారియే॥ ౧౫౪

అర్థము-అగ్ని... రీనాం అగ్నిష్టోమాదిక్రతి=అగ్నిష్టోమము మొదలైనకర్మలను, కరణ=చేయుట చేతను, ద్రవ్య=ధనముచేత, విక్రేయ=కొనఁదగిన, కాయస్ఫూర్తీనాం=శరీరశోభగలట్టియు, బహుజన=అనేకులచేత, సముచ్ఛిష్ట=స్వీకరించివిడువఁబడిన, దంతచ్ఛదానాం=పెదవులుగలట్టియు, ఘోరే=భయంకరమైన, యుద్ధే=పోరునందు, తృణవత్=గడ్డిపరకవలె, అభినిర్ముక్త=విడువబడిన, గాత్ర=శరీరములచేత, ఉజ్జ్వలానాం=ప్రకాశించు భటులయొక్క, పాణిత్యాగాత్=కరగ్రహణమువలన, గ్లపితవపుషాం=వాడిన శరీరములుగలట్టియు, వః=మీయొక్క, సంగమేన=సంభోగముతో, నాలమేవ=ప్రయోజనమే లేదుసుమా.

తా—యాగాదులవలనైన పుణ్యధనమున కమ్ముకొనిన శరీరశోభగలవారును (వేశ్యలనుట) అట్టి కర్మతులనేకులచేత ననుభవింపఁబడినవారును (యుద్ధమందుఁ జచ్చినవారికి దేవతా స్త్రీసంభోగమను న్యాయమున) భయంకరయుద్ధములయందుఁ జచ్చినవారందఱచేత లాగఁబడినవారును ఇట్టివారు మీరు. మీసంభోగము అసహ్యకరమైనిష్ప్రయోజనముసుమా.

శ్లో॥ లోకేనానాజనకృతపరిష్వంగసందూషితానాం
సంగంసంతఃఖలుసమగదం స్త్రీరసాభాసమూలం
తస్మాత్త్వంమేనరుచివిషయష్షండమేవాథమత్వా
మామిష్టేనవ్రజవిజయినీసాధునాస్వాయనేవ॥

పలువురాలింగనముచేసివదలినట్టియతివతో బొందునీగసంబంధుబుధులు
పంతుగానన్నెంచి యేఁజయముగాంచియిచ్చవచ్చుచోటికిమేగుమికను॥

అర్థము—లోకే=జగతున, సంతః=సత్పురుషులు, నానాజన=అనేకపురుషులచేత, కృత=చేయఁబడిన, పరిష్వంగ=ఆలింగనముచేత, సందూషితానాం=నిందింపఁబడిన స్త్రీలయొక్క, తం=ఆనీచమైన, సంగం=సంబంధమును, రసాభాసమూలం=నీరసకారణమని, సమగదన్ ఖలు=చెప్పిరిగదా? తస్మాత్=అందువలన త్వం=నీవు, మే=నాకు, రుచివిషయః=అభిలాషస్థానము, న=కావు. అథ=ఇకను మాం=నన్ను, షండమేవ=నపుంసకునిగానే, మత్వా=తలఁచి, విజయినీ=గెల్పు

గలదానవై, సాధునా=యోగ్యమైన, ఇష్టేన=నీయిచ్చవచ్చిన, స్వాయనేన=స్వకీయమార్గముచేత, వ్రజ=వెళ్లుమా.

తా—బహుపురుషులచే నాలింగితలైన స్త్రీల సంగమము [యోషితాబహుసక్తశ్చ యనున్యాయమున] ఆనందాదిశూన్యమని పెద్దలు జెప్పుచున్నారుగదా? నన్ను నపుంసకునిగాఁ దలచితివైన నీవేగెల్చినదానవై నీయిష్టప్రకారము నీకుతోఁచినమార్గమున వెళ్లుమా [నపుంసకుఁడనియైనను నన్నువదలివెళ్ళితేచాలును. అంతేకాని నేను నీసంగతినొల్లనని తాత్పర్యము.]

శ్లో॥ స్వీయాఃసాధ్వీసుమహితగుణాచే ద్రతారంభకాలే
మందాక్షాంచత్ప్రకృతిసుభగా కామపూర్ణాంతరంగా
కాంచిస్వర్ణాపగతవినయా కామహేలావిలాసా
కామంప్రీతింనయతిరమణం సాప్రియానాన్యనాపి॥

చ॥ సతియయిస్వీయకాంతయయి, సారగుణోత్తరయైరతాది సం
చితమగుసిగ్గునూనుచును జెన్నగుకోర్కెఁగలట్టిదెప్పి యో
ద్గతమదనానురక్తయయి కాంచినిఁదాకిన నొప్పునట్టియా
యతివయొభర్తృనా నసము నందెడుగాక మరొక్కతెట్లగున్॥ ౯౭

అర్థము—స్వీయా=తనదియు, సాధ్వీ=సతియు, సుమహితగుణా=ఒప్పినగుణములుగలదియు, రతారంభకాలే=సంభోగారంభకాలమందు, మందాక్షాంచత్ప్రకృతిసుభగా=సిగ్గుచేనొప్పిన స్వభావముచేనొప్పినదియు, కామపూర్ణాంతరంగా=కోరికతోనిండినమనస్సుగలదియు, కాంచీస్వర్ణాపగతవినయా=పోకముడితాకుననశించినయడకువగలదియు, కామహేలావిలాసా=మన్మథవిభ్రమములుగలదియు, నగుస్త్రీ, రమణం=భర్తను, కామం=మిక్కిలి, ప్రీతిం=సంతోషమును, నయతిచేత్=పొందించినట్టాయనా, సా=అట్టిస్త్రీ, ప్రియా=ప్రియురాలనిపించుకొనును, కాప్యన్యా=ఇతరయువతియును, న=కాదు.

తా—"వికత్రైవానురాగశ్చేల్లజ్జా పరంభూణం మంగనానా" మిత్యాదిన్యాయములననుసరించి స్వకామగుణాదులచేనొప్పి యితరకాలములయందు సిగ్గుచేనొప్పినను రతప్రవేశసూచక నీవీస్వర్శాదులయందు ప్రాగల్భ్యాదులనొప్పి మన్మథవిలాసములుగలదై భర్తను తోషింపఁజేయునదే ప్రియురాలు, తదితరకాదు.

శ్లో॥ యేకామేషుప్రహితమనసో ఽప్యర్థధర్మాభిరక్షా
భీరుస్వాంతాస్సుకృతగళనే నిర్విచారాః పుమాంసః
నేవంతాంతామితరవనితాసంగమోద్భూతపాపం
పశ్యన్త్యేష్టాగ్రతమనియమాన్నాశయంత్యూఢధైర్యాః

తే॥ ధర్మవర్తనులంగజాస్త్రములకోడి।పుణ్యనాశంబునకుజింతఁబొందిరేని

ఘన్యకాంతాసమాగమం బైన పిదప
దపముగావింతు రితర్పాపదళనమరయ॥ ౧౧॥

అర్థము — అర్హ = తగిన, ధర్మ = విధియొక్క, అభిరక్షా = రక్షణవలన, భీరు = జడిసిన, స్వాంతా అపి = మనస్సుగలవారైనను, పుమాంసః = పురుషులు, యే = ఎవరు, కామేషుప్రహతమనసః = కామబాణములచే గొట్టబడినమనస్సుగలవారై, సుకృతగళనే = పుణ్యనాశమందు, నిర్విచారాః = విచారములేని వారగుదురో యట్టివారు, తాం ఆపరస్త్రీని, సేవంతాం = సేవింతురుగాక. పశ్చాత్ = పరస్త్రీసంగమానంతరము, ఇతరవనితా సంగమోద్భూతపాపం = పరస్త్రీసంభోగమున నైన పాపమును, క్షపోగ్రితమనియమాత్ = చేయఁబడిన పెద్దతపస్సువలన, ఊఢధైర్యాః = వహింపబడిన ధైర్యముగలవారై, నాశయంతు = పోగొట్టుదురుగాక.

తా॥ ధర్మలోపమవునేమోయని జడిసిన వారైనను పుణ్యము నశించుననియ నుకొనక మన్మథబాణ పీడితులైయట్టి పరస్త్రీసంగమమును కొందఱు పురుషులుచేయుదురు. తరువాత ధైర్యముతో తపస్సునధికముగాఁజేసి యాపాపమును బోగొట్టుదురు.

శ్లో॥ నాహందక్షో ప్యుభయమపితత్సంవిధాతుం స్వకామా
త్పాదంశాదేసుమసృణతమేన్యస్యసంపాద్యనీరం
తస్యప్రక్షాళనకరణతస్సంనివృత్తి స్తతశ్చే
న్యుక్తంమన్యేసుముఖిపురుషా మాంకథంవావదేయుః॥

తే॥ గీ। వెలఁదియా రెంటిఁగూడఁ గావింపఁజాల
త్రొక్కుబురదనుజలముచేఁ దోలుచుకంటె
ద్రొక్కకుండుటయే మేలు తోయజాక్షి
యెవ్వరేమన్న నేనొప్ప నిట్టిపనికి॥ ౧౯॥

అర్థము — సుముఖి = మంచిదానా, అహం = నేను, తత్ = ఆ, ఉభయమపి = పరస్త్రీ సంగపాపము-తన్నాశమునసెడి రెంటినికూడ-సంవిధాతుం = చేయుటకొఱకు, దక్షః = సమర్థుడను, నహి = కానుసుమా, స్వకామాత్ = తనయిష్టప్రకారము, సుమసృణతమే = మిక్కిలిదట్టమయిన, శాదే = బురదయందు, పాదం = అడుగును, న్యస్య = ఉంచి, నీరం = ఉదకమును, సంపాద్య = తెచ్చి, తస్య = ఆబురదయొక్క, ప్రక్షాళనకరణతః = కడుగుటకంటె, తతః = ఆబురద త్రొక్కుటవలన, సంనివృత్తిః = మరలుటయే, చేత్ = అయినట్లయిన, యుక్తం = దగినదిగా, మన్యే = తలంచెదను. పురుషాః = లోకులు, మాం = నన్ను, కథం వదేయుర్వా = ఎట్లుఅనుకొనినను సరే.

తా — ఓసీ నేను పరస్త్రీసంభోగజన్యపాపము, దానిని పోగొట్టునట్టి తపోధ్యానప్రాయశ్చిత్తాదికమును నీరెండుపనులనుగూడ జేయలేను. పెద్దబురదలో నె

జేగియు పాదమునుబెట్టి తర్వాత నీరుదెచ్చి కడిగికొనుటకంటె బురద త్రొక్కకుం డుటయే మేలని తలంచెద. నన్నెవ్వరేమనుకొనినను సరే.

శ్లో॥ ఇత్యుక్తాయాంవిఫలతదుపశ్లేషణౌత్సుక్యబుద్ధ్యా
నిర్యాతాయాంనిజనిలయనంతంస్మరంత్యాంహితస్యాం
సర్వేఽభూమస్స్మృతమహితతద్ధైర్యభారావయంత
ద్వృత్తాభిజ్ఞాస్త్వదసుదయితోఽసిర్జితానంగఏవ॥

తే॥ గీ॥ ఇటులిరస్కృతయయ్యునయ్యింతివానిఁ। గూర్చు తలఁపున నింటికే
గుటయు మేము। వానిధైర్యమ్ముకొనియాడివచ్చినాము। నిర్జితా
నంగుఁడయ్యెను నీదుమగఁడు॥ ౯౦

అర్థము—ఇతి=ఇట్లు, ఉక్తాయాం=చెప్పఁబడినదై, విఫల=వ్యర్థమైన, తదుపశ్లేషణ=వానిగవయుటయందలి, ఔత్సుక్యబుద్ధ్యా=ఆసక్తిగలదై, తం=ఆయ త్నుని, స్మరంత్యాం=తలంచుచున్నదై, తస్యాం=అనురూపు, నిజనిలయనం= తన యింటికి, నిర్యాతాయాం= వెళ్లినదగుచుండఁగ, సర్వే= అందఱము, వయం = మే ము (మేఘాదులు) తద్వృత్తాభిజ్ఞాః = అతనివృత్తాంతము నెఱిగినవారమై, స్మృతమహిత తద్ధైర్యభారాః= స్మరింపఁబడినవాని మంచి ధైర్యముగలవారము, అభూమ= అయితి మి, దీనిబట్టి, త్వదసుదయితః= నీపాణప్రియుఁడు, నిర్జితానంగ ఏవ= గెలువఁబడి నకాముఁడుగలవాఁడేసుమా.

తా—ఈప్రకారము సురూపవానిచే జెప్పఁబడినదైవాని పొందు రాదని యా సక్తినివిడిచినదై వానినే తలఁచుచుఁ దనయింటికి వెళ్లినతర్వాత వాని వృత్తాంతమెఱి గిన మేమందఱము వానియొక్కవధైర్యమును ప్రశంసించినవారమైతిమి. దీనిబట్టి నీభర్తపరాంగనా విముఖుఁడై మన్మథుని గెల్చినవాఁడునుమా యని మేఘుఁడు యక్షు భార్యతో చెప్పెనని తాత్పర్యము.

శ్లో॥ నైదాఘార్కజ్వలనవశత స్తద్వియోగేనసోఽయం
కార్శ్యంయాతశ్శ్రమసముదితం దుర్నివారంనదోవ
చిహ్నైస్సైరయముపగతో వంచితస్స్వప్రియాయా
విశ్లేషేణేత్యఖిలమున యశ్చ్యకుశేవరవితర్కం॥

తే॥ గీ॥ అతఁడునీవియోగముచేత నధికముగను। నలిగివేసఁగి యెండచే
నదములింకు। నట్టులునొఁడటంచు మేమందరమును। దలచి
తిమి వానిచేష్టల వలననబల॥ ౯౧

అర్థము—సోఽయం=నీభర్త, తద్వియోగేన=నీయడబాపుచే,నదః= పురుషప్రి

వాహము, నైదాఘార్క-జ్వలనవశతః ఇవ = వేసవికాలపుటెండకుటకునధీనమగుటవలన వలెనే, కర్మఉసమువితం = వరుసనెక్కుడైనట్టిది గనుకనే, దుర్నివారం = అణపరాని, కార్శ్యం = చిక్కుటను, యాతః = పొందినవాఁడు, తైస్తైః = ఆయా, చిహ్నైః = గుర్తులచే, అయం = ఇతఁడు, స్వప్రియాయాః = భార్యయొక్క, విశ్లేషేణ = వియోగముచేత, వంచితః = బాధితుఁడుఅని, ఉపగతః = తెలియఁబడినవాఁడు. ఇతి ఈలాగున, అఖిలమునయః = మునులందఱు, ఏవంవితర్కం = ఇట్టియూహను, చక్రుః = చేసిరి.

తా॥ వేసవికాలమందు వేడిమిచే నింకిపోయిన నదమువలె నితఁడు ప్రియురాలివియోగముచేత చిక్కినాఁడుసుమా. అక్కడనున్న మునులందఱు ఇతఁడుప్రియావియోగముగలవాఁడనిఁ యాయాగుర్తులచే నెఱింగి యిట్టివాఁడనుమాయని యనుకొనిరి.

శ్లో॥ తూష్ణీంభూతేవచనమిదముచ్చార్యతస్మిన్పయోదే
పీత్వాగాథాంప్రియవిషయిణీం శ్రోత్రయుగ్మేనసాధ్వీ
ధారాంసౌధీంతదుపజనితానంద సంజీవితాత్మా
ప్రాప్తైవాసీదనితరవిధాసంతతంసౌమనస్యం॥

తే॥ గీ॥ మేఘుఁడిటుభర్తృసంగతుల్ మేలుగఁదెలిపి। జెప్పనానంద సుధగ్రోలి చెలువఁబతికె। మగనివిధులందు నుంతయే మఱనిప్రీతి।
నెమ్మనమ్మునఁ బడసె నాకొమ్మయపుడు॥ ౯౩॥

అర్థము—తస్మిన్ = ఆ, పయోదే = మేఘుడు, ఇదం = ఈపైఁజెప్పిన, వచనం = ప్రియవృత్తాంతరూపమైన మాటను, ఉచ్చార్య = చెప్పి, తూష్ణీంభూతే = ఊరకున్నవాఁడుకాఁగా, అథ = అప్పుడు, సా = ఆయక్షభార్య, శ్రోత్రయుగ్మేన = చెవులజంటచేత, ప్రియవిషయిణీం = భర్తనుద్దేశించిన, గాథాం = కథయను, సౌధీం = అమృతవికారమైన, ధారాం = ఎడతెగనిపాటును, పీత్వా = త్రాగి, (వినియనుట) తదుపజనిత = వినుటవలనబుట్టిన, ఆనంద = సంతోషముచేత, సంజీవిత = బ్రతికింపఁబడిన, ఆత్మా = మనస్సుగలదై, అనితర = భర్తయొక్క, విధా = వ్యాపారమందు, సంతతం = ఎడతెగని, సౌమనస్యం = ప్రీతిని, ప్రాప్తైవ = పొందినదియే, ఆసీత్ = ఆయెను.

తా॥ మేఘుఁడు ప్రియవృత్తాంతమునిటు చెప్పిచాలింపఁగాభర్తృవృత్తాంతమనెడి యమృతధారాపానము చేసియానందమునబ్రదికినదై యతని వృత్తాంత శ్రవణము వలన నధిక ప్రీతిని బొందినదాయెను.

ఇతి శ్రీత్యాది.

శ్రీమంతుఁడై పూజ్యుకవియగు కోరాడ రామచంద్ర కృతమైన ఘనవృత్తంబనుమహాప్రబంధంబున మొదటిసర్గమిది. "వర్ణ్యంతేనగరార్ణవాచల"



శ్రీగణేశాయనమః.

# ఘనవృత్తే.

## ద్వితీయస్సర్గః.

---

శ్లో॥ కాంతోదంతశ్రవణజనితానందసమ్మోహితాయాం
తస్యాం ప్రేయస్యుదితవచనాధానదక్షం పయోదం।
పత్యుర్గత్యాఉపరిచరితంసాధుసఖ్యావదేయుః
శ్రోతవ్యంతేనసముచితమితిప్రాహతస్యావయస్యా ॥

చ॥ తనప్రియువార్తలన్నిని ముదంబున మోహపయోధిమున్గ య
క్షునిసతియామెకుంబ్రియముఁ గూర్చెడివార్తను జెప్పు మేఘునిన్
గని చెలికత్తెయక్షసతి కాంతునికాంక్షినదానివృత్తముల్
వినఁదగునీకటంచువినిపించెను, వీనులవిందుసేయుచున్ ॥ ౧

అర్థము—తస్యాం=ఆయక్షకాంత, కాంతో......తాయాం, కాంత=ప్రియునియొక్క, ఉదంత=వృత్తాంతముయొక్క, శ్రవణ=వినుటచేతను, జనిత=పుట్టిన, ఆనంద=సంతోషముచేత, సమ్మోహితాయాం=మూర్ఛనొందినదగుచుండఁగా, తస్యాః=ఆయక్షకాంతయొక్క, వయస్యా=చెలికత్తె, ప్రేయస్యు......దక్షం, ప్రేయసి=తనస్నేహితురాలివిషయమై, ఉచిత=తగిన, వచనాధాన=మాటలను (వార్తను) చెప్పుటయందు, దక్షం=సమర్థుఁడైన, పయోదం=మేఘునిగూర్చి, పత్యుర్గత్యాః=భర్తయైనయాయక్షునియొక్క వెళ్ళుట మొదలు, సఖ్యాః=తనసఖియైనయాయక్షాంగనయొక్క, ఉపరిచరితం=తరువాతివృత్తాంతమును, సాధు=బాగుగా, వదే

యం=చెప్పినను, తే=నీకు, సముచితం=తగునట్లుగా=బాగుగా, శ్రోతవ్యం=వి నదగినది, ఇతి=ఈలాగునని, ప్రాహ=చెప్పెను.

తాత్పర్యము — ఈప్రకారము మేఘునిచేఁ జెప్పఁబడిన సుగ్రీవాదర్శనాది వృత్తాంతమును వినుటచే నాయక్షకాంత తనభర్తయొక్క (ఏకపత్నీవ్రతాదికమును గ్రహించి) మనోనిగ్రహమున కానందమునొంది, భర్తృస్మృతిగల్గుటచే మూర్ఛిల్లెను. మిగుల ప్రేమాస్పదులగు వారికెడబాసియుండి వారివృత్తాంతము వినునప్పుడు గలి గినసంతోషాతిశయముచే మూర్ఛనొందుటయను విషయముపురాణప్రసిద్ధము " ఇతి సావిలాపోచ్చైర్ఘనాసంస్మృతింగతా నవివేదనిజంకించిత్ పరకీయం విమోహితా " ఇట్లుశ్రీరాముని వార్తవినినప్పుడు జానకిస్థితిఁజెల్పుచున్నది (పద్మపురాణం పాతాళఖండం) ఇట్లామెమూర్ఛిల్లగా నాచెలికత్తె శీతోపచారాదులు సల్పుచు యత్నముచే దఁబాసినదానియామె వృత్తాంతమును మేఘునితోఁ జెప్పఁబోవఁగినదై శ్రద్ధాళువవు గమ్మనికోరెను. " ఉచితవచనాధానదక్షం " అనుటవలన పూర్వభాగమున "అన్య వనితాసంగమహాపాంచ శంక " ఇత్యాదియక్షాంగన వాక్యములయందలి యభిప్రా యమును గ్రహించినవాడై, దానికుత్తరంబుగ 46 శ్లోకమున " ప్రాగ్నేకాసిత్... అరాత్రివివేమాత్ " ఇత్యాదికమువలన సంశయమును నివర్తింపసమర్థంబగునట్లు చెప్పుటవలన వీనినైపుణ్యము వెల్లడియగుచున్నది. " పయోద " శబ్దప్రయోగము వలన నుపకారానపేక్షితుడై సర్వజనంబులకు జీవనంబొసంగినట్లు, వియోగార్తయ గుయక్షకాంతను ప్రియవార్తామృతవర్షమున సేదదేర్చెననుట. " సముచితంశ్రోత వ్యం " ఈశబ్దములవలన నాయక్షకాంతయొక్క పాతివ్రత్యనైష్ఠికత మనోనిగ్రహాది విషయంబులతో వెల్లివిరియు నీవృత్తాంతము సరసాగ్రగణ్యుడవగు నీవువినవలయు ననియు నర్థానివలన నీమెమహిమయు నీకువిశదముకాగలదనియు చెప్పినట్లున్నది. " సమ్మోహితాయాం " తనభర్తజీవించియుండుటనే సంశయంబుగనెంచి దేవీ ప్రత్యక్షానంతరము మరలనాసగలదయ్యెను, అన్యవనితాసక్తుఁడైయుండి తనవలనఁ గలిగిన వియోగతాపమునపనయించునవెడి తలఁపుగలదైయుండ, మేఘుడిట్లాయ క్షుని నియమపరిభావాదికమును వర్ణింపమూర్ఛజెందెను.

శ్లో॥ స్వీయాజ్ఞాతిక్రమణజనిత క్రోధసంక్షుబ్ధబుద్ధా
శాపంయచ్ఛత్యలమిలబిలానందనేమందసత్వా

కాంతాయోగాకలనవశత స్స్వాపదం సంవిచింత్య
స్వప్రస్థానం పరమకథయన్యత్ర కుత్ర ప్రయాతః॥

చ॥ తనయాజ్ఞన్నెరవేర్పలేదనుచు గ్రోధంబూని యక్షేశుఁ డా
తనికిన్ శాప మొసంగ దుర్బలతఁ గాంతన్ బాయఁ గాఁ గన్లు పెన్
వనటన్ యోజనఁ జేసియాతఁడు మదిన్ బ్రస్థానమున్ స్వల్పే యె
వ్వనికిన్ జెప్పక యెప్పుడో యెచటికో ప్రారబ్ధ మూహించుచున్॥౨

అర్థము—ఇలబిలానందనే=కుబేరుడు, స్వీయా...ః , స్వీయా=తనయొక్క, ఆజ్ఞా=ఆజ్ఞయొక్క, అతిక్రమణ=అతిక్రమించుటవలన=తనమాట వినకుండుటవలన, జనిత=పుట్టిన, క్రోధ=కోపముచేత, సంక్షుబ్ధ=కలతఁజెందిన, బుద్ధౌ=మనస్సుకలవాడగుచు, శాపంయచ్ఛతిసతి=శపించినవాడగుచుండగా, అలం=మిక్కిలి మందసత్వః=(బలహీనుఁడై) పోయినమహిమకలవాఁడై, సః=ఆయక్షుఁడు, కాంతా యోగాకలనవశతః. కాంతా=తనప్రియురాలియొక్క—అయోగ=విరహముయొక్క ఆకలన=ప్రాప్తియొక్క, వశతః=ఆధీనమువలన, స్వ+ఆపదం=తనయొక్క ఆపత్తును, సంవిచింత్య=ఆలోచించి, స్వప్రస్థానం=తనపయనమునుగూర్చి, అకథయన్ పరం=చెప్పకుండగనే, యత్రకుత్ర=ఎక్కడికో, ప్రయాతః=వెళ్ళెను.

తాత్పర్యము—కుబేరుడు తనపరిచరుఁడగు యక్షుని పరిచర్యాలోపమునకు వాని భార్యయే కారణమగుటవలన తద్వియోగమునే శాపంబుగనొసఁగెను. అంతనా యక్షుఁడు పోయిన శక్తిగలవాఁడై తాఁబోవు ప్రసంగతి తనవనితకెఱింగింపకయే తానెచ్చటికో వెళ్ళెనని యాచెలికత్తె చెప్పుచున్నది.

“ఆజ్ఞాతిక్రమణ” ఒకప్పుడు, కుబేరుని దేవతాపూజకై పుష్పముల సమకూర్చు నీయక్షుఁడు, తనభార్యతో సల్లాపంబుసల్పుచుండి తనకార్యమొనగూర్పకుంటచేఁ గినిసి యొకవత్సరంబు ప్రియురాలినెడబాసియుండునట్లుశపియించె “మందసత్వః” శాపవశమున కామగమనాది మహిమలు నశించినవనుట. ఇది పూర్వమేఘమున కాళిదాసునిచేఁ జెప్పఁబడిన “అస్తంగమితమహిమా అను దానిజ్ఞాపకము చేయుచున్నది” “కాంతాయోగా...స్వాపదం ఇందువలన దేవతాజాతులగువారికి మోహంబె

నెంచియుంటచే కుబేరుని యందలి సాత్వికాదిగుణములు ప్రకటితములగుచున్నది. మహాత్ములు వ్యవహారవిషయముల కాఠిన్యమునిమిత్తమాత్రముగ వహించినను తక్షణమే ప్రసన్నహృదయులగుదురని తెలియుచున్నది

శ్లో॥ త్వయ్యాస్తే మేప్రియసహచరోవత్సలత్వావృతాత్మా
ధీరస్వాంతాంరచయితుమహం ప్రేషితా తేనచత్వాం
ఏతత్కాలోదితవిరహతో యాహిమావిక్లబత్వం
కాలేకావానభవతిసతీవంచితారుష్టదిష్టాత్ ॥

చ॥ ఐలబిలుండునీయెడఁగృ * పాన్వితుఁ డైతలయందునీదువంతను
న్నాళముఁజేయనీమదికి * బూన్పఁగధైర్యమునన్నుఁబంపెనీ
కాలమునన్వియోగజవి * కారము బొందకునెమ్మిజూడఁగా
గాలమురాగదుఃఖముల * గాంచరెసాధ్వులు దైవవంచనన్॥ ౫॥

అర్థము—మే=నాయొక్క, ప్రియసహచరః=భర్త, త్వయి=నీయందు, వత్సలత్వావృతాత్మా=ప్రేమతోఁగూడిన మనస్సుగలవాఁడై, ఆస్తే=ఉంచున్నాఁడు, తేనచ=ఆనాప్రియుఁడైన కుబేరునిచేతనే, త్వాం=నిన్ను, ధీరస్వాంతాం=ధైర్యముగలమనస్సుగలదానిగా, రచయితుం=చేయుటకొరకు, అహం=నేను ప్రేషితా=పంపబడితిని, ఏతత్.....హతః, ఏతత్కాల=ఈకాలమందు, ఉదిత=పుట్టిన, విరహతః=వియోగమువలన, విక్లబత్వం=కాలుష్యమును, మాయాహి=పొందకుము, కాలె=సమయమువచ్చినప్పుడు, కావాసతీ=ఏపతివ్రత, రుష్టదిష్టాత్=ప్రతికూలదైవమువలన, వంచితా=వంచింపబడినది. నభవతి=కాదు.

తా—నాప్రియుఁడగు కుబేరుఁడు నీయందనుగ్రహము కలవాఁడైయుండుటవలన నీకు ధైర్యము చెప్పుటకు నన్నుపంపియున్నాఁడు. ఈసమయమున కలిగినవియోగమునుగూర్చి విచారపడకుము. కాలమునుబట్టి ఎట్టిపతివ్రతలైనను ప్రతికూలదైవముచే వంచితలై దుఃఖమునొందుదురు. ‘‘ధీరస్వాంతాం’’ ప్రియవియోగమువలనదుర్బలమైనను మసదృశమ్మగు మనమునశుభర్తృపునరాగమాది వాక్యంబుల నాశగల్గించి దేవ్యుపాసనావ్యాపృత మనస్కను జేయుటచే ధైర్యమునుకలుగఁజేసెను. లోకము

ననార్తులగువారు ధీరులైననాయికట్టు వారెమినతరి, పరులచేనాశ్వాసింపఁబడి నగాని ధైర్యమువహింపజాలరు. పరులసానుభూతియు దుఃఖమును కొంతతగ్గించు తమకంటె యున్నతపదవినున్నవారలే కష్టపరంపరలను యిడుములఁబొల్పడుట జూచిన తమయిక్కట్టులంత దుస్సహములుగావు.

శ్లో॥ ప్రాగిన్ద్రాణీ ప్రియసహచరే పద్మనాభే విలీనే
దుఃఖం ప్రాపచ్చిరవిరహజం క్లేశమాపచ్చ లక్ష్మీః
తాదృశ్యోఽన్యా అపి సమభవన్ ప్రాయశోఽస్మద్విధానాం
కా వా గాథా భవతి విహితం కర్మ భోక్తవ్యమేవ।

చ॥ సురపతి పద్మనాళమునఁ జొచ్చిన వేళ వియోగదుఃఖ సా
గరమున మున్గె దేశచియు కాంతుని బాసి రమావధూటియుఁ గ
గరముఁ గ్రుశింప దేనుతియుఁ గాంచ రె దుఃఖము లెంద ఱెందఱో
ధరమన మేమి లెక్క విహితంబగు కర్మము భోజ్యమేకదా॥ ౭॥

అర్థము—ప్రాక్=పూర్వకాలమున, ఇంద్రాణీ=శచీదేవి, ప్రియసహచరే=ప్రాణనాథుఁడగు దేవేంద్రుఁడు, పద్మనాభే=తామరతూఁడునందు, విలీనే=దాగియుండఁగా, చిరవిరహజం=చిరకాలవియోగమువలనఁ గలిగిన, దుఃఖం=బాధను, ప్రాపత్=పొందెను. లక్ష్మీశ్చ=లక్ష్మీదేవియు, క్లేశం=దుఃఖమును, ఆపత్=పొందెను. అన్యా అపి=దమయంతి మొదలగు నితరులును, తాదృశ్యః=అట్టిదుఃఖము ననుభవించినవారు సమభవన్=అయిరి. ప్రాయశః=తఱుచుగా, అస్మద్విధానాం=మనబోఁటులవిషయమై, కా వా గాథా భవతి=చెప్పవలసినదేమి. విహితం కర్మ=విధింపఁబడిన (చేసుకొనిన) పాపపుణ్యాది రూపకమగు కర్మ, భోక్తవ్యమేవ=అనుభవింపతగినదే.

తాత్పర్యము—వృత్రాసురవధానంతరము, బ్రహ్మహత్యవలన నిందుఁడు స్వపదభ్రష్టుఁడై సూక్ష్మశరీరముతో పద్మనాళములోవసించియుండుటవలన శచీదేవికి వియోగముకలిగెననుట. విష్ణుని దశావతారసమయములయందు లక్ష్మి వానివియోగమును సహించెనను కథలిచ్చటననుసంధేయములు. పూర్వకాలమున, శచీ, లక్ష్మిమున్నగువారలే విరహమువలన క్లేశము జెందియుండఁగా మనబోఁటివారి లెక్క యేమి

యనియు, పురాకృతమగు కర్మననుభవింపక తీరదనియుం జెప్పి యాకుబేరపత్నియా శ్వసోచ్చె. ఇచ్చటకావ్యార్థాపత్తియలంకారము.

“ఏహితంకర్మభోక్తవ్యం” మనుటవలన “సుఖస్యదుఃఖస్యనకోపిదాతా పరోదదాతీతికుబుద్ధిరేషా” అనున్యాయంబునదేహికి, సుఖదుఃఖంబులు కర్మనియతంబులనియు, తదనుకూలముగా నితరులు నిమిత్తమాత్రులనియు నందువలన కుబేరుని యందు దోషారోపణనసహించి తత్వార్థమును చెప్పఁదలఁచినదని ఈవక్ష్యమాణంబులగు నీపై వాక్యముల ఫలితార్థమును సూచించుచున్నది.

శ్లో॥ ధాతాప్యుద్యన్నిగమనిచయప్రాక్ప్రణేతాపిభిన్న
శ్శీర్షస్థానేనిటలనయనః ప్రాక్సతీవిప్రయోగం
శ్రీరామోపిక్షితిపరసుతావిప్రయోగంవిషేహే
కేవానస్యుఃపరిభవపదంకర్మణాస్వార్జితేన॥ ౭

చ॥ నలువశిరంబుఁ గోటఁ బడి నాఁడు గడానిగ మాళికొజ్జయై
చెలఁగియుఁ గాంతఁ బాసి శశిశేఖరుఁ డెంతయు వంతనొందెఁ దాఁ
గులసతిపీడ రాఘవుఁడు గుందడె ప్రాక్తన నైజకర్మచే
బలిమి పరాభవంబులకుఁ బాల్పడకుండెడి వారలుందురే॥

అర్థము — ఉద్యన్నిగమనిచయప్రాక్ప్రణేతా, ఉద్యత్=ప్రకాశించుచున్న నిగమనిచయ=వేదసమూహముయొక్క, ప్రాక్ప్రణేతా= ప్రథమోపదేష్టయగు, ధాతాపి=బ్రహ్మయును శీర్షస్థానే=శిరఃప్రదేశమున, భిన్నః=ఖండింపఁబడెను, నిటలనయనః=సాంబమూర్తియు ప్రాక్, పూర్వము, సతీవిప్రయోగం=భార్యావియోగమును, విషేహే=సహించెను, శ్రీరామోపి=శ్రీరాముఁడున్నూ క్షితిపరసుతావిప్రయోగం=సీతాదేవి నెడబాయుటను, విషేహే=సహించెను, స్వార్జితేన= స్వయముగసంపాదించిన కర్మణా=కర్మచేతను, కేవా=ఎవరు, పరిభవపదం=తిరస్కారమునకుస్థానము, నస్యుః=కారు, అందఱునగుదురనుట.

తా — ఈప్రకారమా కుబేరపత్నియక్షకాంతనుగూర్చి పూర్వము లోకములను సృజించుటకైన సామర్థ్యంబుగల బ్రహ్మయు, లోకముల సంహరించుటకు

సమర్థుండగు రుద్రుండును, జగదేకవీరుండగు రాముండును, స్వార్జితకర్మచే పరిభూతులయిరనిచెప్పి ప్రస్తుతమున యక్షకాంతకుఁగలిగిన వియోగమును పూర్వకర్మజనితంబేయనియు కావున పతివాయుట కర్మబద్ధులుగాక తప్పదనియుచెప్పె. ఇచ్చటయర్థాంతరన్యాస యలంకారము. బ్రహ్మయు విష్ణువును కలహించినపు డసత్యంబాడిన బ్రహ్మపంచమశిరంబు రుద్రుండుద్ధ్రుంచెననియు దక్షునియజ్ఞంబున తండ్రి తిరస్కారంబునందేసి సతీదేవి శరీరత్యాగముఁజేయ, తిరిగి హిమవత్పుత్రికయై వివాహమాడువరకు కల్గిన వియోగమును శివుఁడుసహించెననియు, దండకారణ్యవాసి యగు రాముండు సీత రావణాపహృతగా నొకవత్సరంబును, లోకాపవాదకై జానకిని స్వయముగావీడియును తద్వియోగమునుసహించిరనువిపురాణప్రసిద్ధములు.

శ్లో॥ నస్త్రీనానోతదుభయవపురప్యనిర్వాచ్యరూపా
బ్రహ్మాదీనామపిచజననీ లోకరక్షాప్రసంగాత్ ।
నానారూపావిరచితకృతిః పూజితాచక్రిముఖ్యై
ర్నిస్త్రైగుణ్యేమహసికుసుమే సౌరభశ్రీరివాస్తే॥

చ॥ పురుషుఁడుతన్వియున్ననపుంసకమైనను గాకబ్రహ్మకున్
హరిముఖదేవతాతతికి నందనిరూపముఁగల్గివంద్యయై
వఱలు మఁదల్లినాగపలుభంగులరూపముఁదాల్చిపువ్వుపైఁ
బరిమళమట్లునిర్గుణవిభాస్వరతేజమునన్ వెలింగెడిన్॥ ౮॥

అర్థము — స్త్రీ = స్త్రీస్వరూపముగలది, న = కాదు, నా = పురుషాకృతి గలది, న = కాదు, తదుభయవపురపి = స్త్రీపురుషోభయాకృతి గలదియును న = కాదు, బ్రహ్మాదీనామపి = బ్రహ్మమొదలగువారికిన్ని. అనిర్వాచ్యరూపా = వచింప తగని స్వరూపముకలదై, లోకరక్షాప్రసంగాత్ = లోకములను కాపాడుటవలన, జననీ = తల్లియైనట్టియు, నానారూపా = చండిలలితమొదలగునేనేక రూపములుగలదై, విరచితకృతిః = చేయబడినఆయారాక్షసులవధాదిరూపవ్యాపారముకలదగుచు, చక్రిముఖ్యైః = విష్ణుమొదలగువారిచేతను, పూజితాసతీ = పూజింపఁబడినదగుచు, నిస్త్రైగుణ్యే = సత్త్వాదిగుణరహితమైన మహసి = తేజస్సునందు, కుసుమే = పుష్పమునందు, సౌరభశ్రీరివ = పరిమళసంపదవలెనే, ఆస్తే = ఉంచున్నది.

తా—స్త్రీపురుషరూపములుగానట్టియు, నానారూపములఁబొందెనట్టియు, అనేకరక్షణమే ముఖ్యమగు పనిగాఁగలదగుటవలన జగన్మాతయని పేరొందఁ దగినదియు, బ్రహ్మవిష్ణుమొదలగు దేవతలచేఁ బూజింపఁ బడినదియునగు ఆపరదేవత, పుష్పములయందు ఘ్రాణేంద్రియ మాత్రగోచరమగు పరిమళమువలెనే, త్రిగుణరహితమగు తేజస్సునందు వ్యాపించినదై తేజోమయస్వరూపమొకటిగలదని చెప్పెను.

"బ్రహ్మోపేంద్రమహేంద్రాది దేవసంస్తుతవైభవా" యనియు "కరాంగుళి నఖోత్పన్న నారాయణదశాకృతిః" "పంచప్రేతాసనాసీనా పరబ్రహ్మస్వరూపిణీ" ఇత్యాది లలితోపాఖ్యానవాక్యాదులనుబట్టి, విష్ణ్వాదులచే నుతింపఁతగినదై వారివారికి సృష్ట్యాది సామర్థ్యంబుల నొసంగుచు, లీలామాత్రముగ నవతారములఁ గల్పనఁజేయుచు, తాను ననేకరూపములవహించినదైనను గుణరహితంబగు శుద్ధసత్వముననుంశంబుల స్ఫురితంబువలె సర్వవ్యాపినియై "పతివ్రతాభీష్టఫలదా" యనిపతివ్రతయగు నిన్నుఁగాపాడు సామర్థ్యంబుగలదిగావున నామెనుపాసింపుమని చెప్పెనని తాత్పర్యము.

శ్లో॥ సైవా శేషాన్హరిహరముఖాన్ మోదభేదానయంతీ
తత్తత్కాలే నిజపదనలానక్వచిత్తత్ప్రభూణాం
ఇష్టానోృగా నిహపరసుఖప్రాపకంజ్ఞానమాద్యం
యచ్ఛన్తీదీమతివిజయతేశ్రీపరాశక్తిరాద్యా॥

చ॥ హరిహరులాదిసర్వవిబుధాళులఁ గాలముచేత మోద దుః
ఖరసములందుదేల్చుపద కంజములన్ఘనుతిం చుభక్తులన్
సరగునబ్రోచుజ్ఞానమునొసంగిపరంబు నిహమ్ములిచ్చియో
వరమతియాపరాంబికప్రభావతియైవిలసిల్లుగావుతన్॥ ౯॥

అర్థము— హేధీమతలీ=ఓబుద్ధిమంతురాలా! సాఆద్యా=ఆదిపర్వమునకు మొదటికారణమైన, శ్రీపరాశక్తిదేవ=శోభాయుక్తయగు నాపరదేవతయే, అశేషాన్=సమస్తులైన, హరిహరముఖాన్=హరిహరులు మొదలుగాగలవారిని, మోదభేదా=సంతోషమును=దుఃఖమును తత్తత్కాలే=ఆయాఅనుభవకాలమందు, నయన్తీ=

పొందించుచున్నదై, నిజపదనలా=తనపాదపద్మములయందు, ఆసక్త=కలుగుకొన్న చిత్త=మనస్సుగలిగిన, పరిభూణాం=పరిభువులైనభక్తులకు, ఇష్టాన్=కోరికలను, భోగాన్ = ఐశ్వర్యాదిభోగములనున్నూ, ఇహపరసుఖప్రాపకం=ఇహపరసుఖముల నిచ్చెడి, ఈడ్యం = స్తుతింపఁదగిన, జ్ఞానం = బుద్ధివికాసమును, యచ్ఛంతీ = ఇచ్చుచున్నదై, విజయతే = సర్వోత్కర్షచే ప్రకాశించుచున్నది.

తా—హరిహరాదులకైనను సుఖదుఃఖము లొసంగసామర్థ్యముగల నాపరదేవతను నీవుపాసించిన నీవియోగదుఃఖముపశమించుటేగాక, జ్ఞానోదయంబగుటవలన, విషయవిముఖులరాలవై యానందమును పొందగలవని తాత్పర్యము

శ్లో॥ తస్మాదద్యత్వమపినియతాహారచర్యాకదర్యా
సన్మర్యాదాశ్రియభగవతీంపాపతామిస్రచాంద్రీం ।
సాసంతుష్టానిజభజనతస్త్వద్వియోగేనజాతం
తాపంసర్వంహరతితదనుస్వేష్టలక్ష్మీంతనోతి॥

ఉ॥ ఆపరశక్తికోర్కులనయంబునొసంగును గాననిప్పుడీ
యాపదఁబాపఁగానియమ హారవిహారముచేసనింద్యవై ।
పాపతమిస్రచంద్రికశుభంకరిఁగొల్చినమెచ్చినీమన ।
స్తాపముఁదీర్చునిష్టములొసంగునునీదగుభక్తిపెంపునన్॥ ౧౦॥

అర్థము—తస్మాత్=అందువలన, ఆ పరశక్తియైహికాముష్మికసుఖములనిచ్చునదిగావున, త్వమపి=నీవును, నియతాహారచర్యాకదర్యా, నియత=నియమితమగు,ఆహార=ఆహారముయొక్క, చర్య=అనుచరణచేతను, అకదర్యా=నిందింపబడనిదానవై, సన్మర్యాదా = యోగ్యమైననడతగలదానవగుచు, పాప...చాంద్రీం పాపతామిస్ర = పాపమనెడిచీకటికి, చాంద్రీం = చంద్రికయైన, భగవతీం = ఆఈశ్వరిని, ఆశ్రియ =ఆశ్రయింపుమా, సా = ఆభగవతియు,నిజభజనతః = నీదగుసేవవలన, సంతుష్టా = సంతసించినదై, తద్వియోగేన = నీవియోగమువలన, జాతం = పుట్టిన,తాపం = మనోవ్యాకులతను,హరతి = హరింపజేయును,తదను = తరువాతను, స్వేష్టలక్ష్మీం = తమతమకోరికలను సంపత్తునున్నూ, తనోతి = కలుగజేయుచున్నది

తా—కావున సర్వపాపములఁబోఁగొట్టు యాయీశ్వరినితపోనియమముల సత్ప్రవర్తనగల దానవగుచు ధ్యానింపుము. ఆమెయు నీసేవవలన సంతుష్టిజెందినదై నీవిరహతాపమును శమింపఁజేయఁగలదు, ఆమీదనీకోరికలు లభించునని యాకుబే రుని భార్యచెప్పెను.— ‘‘నియతా......అకదర్యా’’ అహారనియమంబు, నఖశ్మ యనాదులును వర్జితంబునల్పువారి,చిత్త మన్యాకాంతంబుగా నుండునట్లొనర్చి, కామమోహాదుల శమింపఁజేయు గావున, నీమెయునట్లుండవలయునని చెప్పుచున్నది.

శ్లో॥ ఇత్యుక్త్వైవశ్రవసికిమపివ్యాహృతంసావితీర్య
ప్రాపాగారంనిజమథసఖీసాధువృత్తిఃకుబేరీ।
తత్కాలాదివ్యపగతమహాశుక్రమాప్రాప్తధైర్యా
లక్ష్మీసేవాకృతిమతిరభూత్త్యక్తలోకప్రచారా॥

చ॥ ధనదునికాంతయీగతిని ధైర్యముఁజెప్పుచనాపెశ్రోత్రమం।
దునసొకమంత్రమెద్దియొకు తూహలమందఁగఁజెప్పిదానికే।
తనమునకేగనీపెమదిఁ దాపమువాయుచునప్పైధీరయై।
మనమునన్యచింతలను, మానిభజించెసదాపరాంబికన్॥ ౧౧॥

అర్థము—అథ=తరువాతను, సఖీసాధువృత్తిః; సఖీ= స్నేహితులయందు, సాధువృత్తిః= యోగ్యమైన వ్యాపారముగల, కుబేరీ=ఆకుబేరుని భార్య, ఇతి= ఈలాగున, ఉక్త్వైవ=చెప్పినదనుచునే, శ్రవసి=శ్రోత్రమందు, కిమపి=ఏదోయొక, వ్యాహృతం=మంత్రరూపమగుమాటను, వితీర్య=చెప్పి, అనగాఉపదేశించి, నిజం=స్వకీయమైన, అగారం=గృహమును,ప్రాప=పొందెను. (ఇకనాయక్షకాంత) తత్కాలా......క్రమా, తత్కాలాది=ఆకాలముమొదలుకొని, వ్యపగత=పోయిన, శుక్రక్రమా=దుఃఖముయొక్కరీతిగలదై, ప్రాప్తధైర్యా= ధైర్యముతెచ్చుకొని, త్యక్తలోకప్రచారా=విడువఁబడిన ప్రాపంచకప్రసంగముకలదై, లక్ష్మీసేవాకృతిమతిః=లక్ష్మినుపాసించుటయందు కృతనిశ్చయురాలైనది, అభూత్=ఆయెను.

తా—ఈప్రకారము చెప్పినదైయాకుబేరపత్నియక్షకాంత శ్రోత్రమందొకమంత్రముపదేశించి తనగృహమునకు నిర్గమించెను. అనంతరమందు (ఆ

నగానాకు జేరాంగన మంత్రోపదేశము చేసినది మొదలు యక్షకాంతయు శోకమువిడిచి, లక్ష్మీసేవాయత్తైక చిత్తయగుట వలనప్రాపంచక విషయములనుండి తొలఁగినదై తత్సేవాసక్తురాలయ్యెను.

శ్లో॥ వ్యాఖ్యాతీవ ప్రకృతిమహితం పద్మినీత్వంచ బుద్ధ్వా
కల్యాకల్యప్రసరణ కలాలోచనోత్ఫుల్లపద్మా
స్నాత్వాసీనా సురుచిరపదేపీఠదేశేదృశాళి
ప్రోతఘ్రాణా కిమపిజపతి స్మాధ్వనివ్యాహరంతీ।

చ। తెలిపెను, పద్మినీత్వమును తేటగమాసతియంచు నెంచఁగా
జలజనిభంబులోకనులు చక్కఁగఁగల్యనువిప్పినుప్పొంగా
దోఁగి పవిత్రనీరములఁ దోఁగిసుఖాసనమందుఁ జేరిచూ
పులువడినాసఁ జేర్చి, జప మొనర్చదినిమ్ముగఁ జేసెనెద్దియో॥ ౧౨॥

అర్థము—ప్రకృతి=స్వభావముచేత, మహితం=ఒప్పుచున్న, పద్మినీత్వం చ=పద్మినీత్వము నైతే(అనగ. పద్మినీజాతి స్త్రీత్వమును, తామరతీగెతనమునున్నా) వ్యాఖ్యాతీవ=ప్రకటించునదివలెనే, కల్యే=ప్రత్యూషమందే=కల్య... పద్మా కల్య=యోగ్యమైన, ప్రసరణ=వికాసమనెడు, కళా=కళలతోఁగూడిన, లోచనోత్ఫుల్లపద్మా=వికసించినపద్మములవంటి నేత్రములుగలదై, బుద్ధ్వా=మేలుకొని, స్నాత్వా=స్నానముఁజేసి, సురుచిరపదే=మంచిచిహ్నములుగల, పీఠదేశే=ఆసనమందు, ఆసీనా=ఉపవిసించినదై, దృశాళిప్రోతఘ్రాణా, దృశా=చూపులమొక్క, ఆళి=వరుసచేత, ప్రోత=కూర్పఁబడిన, ఘ్రాణా=నాసికగలదై, అధ్వని=ధ్వనిలేకుండగా, కిమపి=ఏదోఒకదానిని, వ్యాహరంతీ=ఉచ్చరించుచున్నదై, జపతిస్మ=జపముచేసినదాయెను.

తా—ఆయక్షకాంత తపఃప్రకారం బెట్టిదనిన. తానుపద్మినీజాతి స్త్రీయగుటచే ప్రాతఃకాలమున తామరతీగె యెట్లువికసించునోయట్లెపన కనుదమ్ములనువిప్పితనపద్మినీత్వమును ప్రకటించుచున్నదై, స్నానముఁజేసి శుభప్రదమైనసుఖా

గనముననూర్చుచున్నదై, నాసాగ్రమందు దృష్టినుంచి నిశ్శబ్దముగ జపముచేయ చాడంగినది.

"ప్రాక్కృతమహాత్రంపస్మృతిస్వం" ప్రాతఃకాలంబున పద్మములు వికసించుట ప్రకాశసిద్ధము. అట్లనేసియక్షాంగనయు పద్మసదృశంబులగు నేత్రంబులవిప్పె ననియు, శ్లేషచే, ఆహాపద్మినీజాతిస్త్రీయగుటచే పద్మదిగ్మనిత్వమును ప్రకటింపజే యుచున్నదని తెలియుచున్నది. మఱియు "సురుచిరపదేపితదేశే" అనునది అభీష్టప్రదంబులగు వ్యాఘ్రవ్యాసనంబుల నాసీనయగుటయు, "దృశా...ఘ్రాణా" నాసాగ్రన్యస్తదృష్టియగుటవలన తపోనియమదార్ఢ్యార్థము ముద్రికాధారిణియగుట యును, "అస్మిని" నామమునవలంబించినదై మానసికజపముచేయుచుండుటవలన నియమాన్మనోనియమములను నైష్ఠికతను చాటుచున్నవి.

శ్లో॥ ఫుల్లాంభోజప్రభవరససంభావితంశీతమంభ
స్సంపుష్టోస్రాస్రుతమపిపయఃకల్ప్తేనాదనాయ
స్వాంతర్గంధార్జనమతిమరుత్సంగతప్రాణవర్గా
దేవీధ్యానావహ్యాతమహితాగారకృత్యేయమాసీత్ ॥

చ॥ జలజమరందనక్తమగు చల్లని, నీరముత్రైననింటిలో
పలుగలయావుపాలయిన పానము సేయకగాలిమాత్రమే
హాలఃత్రిగహించిభుక్తిగను మోదముతోడపరాంబికాపదం
బులుమదినిల్పియింటిపని బూనకధ్యానముసేయుచుండెడిన్ ॥ ౧౩॥

అర్థము—ఫుల్లాం......వితం, ఫుల్లాంభోజ=వికసించినతామరపుష్పముల నుండి, ప్రభవ=పుట్టిన, రస=మకరందముతో, సంభావితం=కూడుకొనిన, శీతం చల్లని, అంభః=ఉదకమును, సంపు.....స్రుతం, సంపుష్ట=బాగుగపోషింపబడిన, ఉస్రా=ఆవునుండి, స్రుత=పితుకబడిన, పయఃఅపి=పాలున్నూ, అదనాయ=భు క్తికొఱకు, నకల్ప్తే=ఉపయోగింపబడలేదు, ఇయం=ఈయక్షకాంత, స్వాంత... వర్గా, స్వ=తనయొక్క, అంతర్గంధ=అంతస్సంబంధముయొక్క, ఆర్జన=సంపాద నయందు,మతి=బుద్ధిగల, మరుత్=గాలితో, సంగత=కలుసుకొన్న, ప్రాణవర్గా=

ప్రాణిసమూహముగలదై, అనగా నాయువుభక్షణమాత్రమైయనుట, దేవీధ్యానా......కృత్యా, దేవీధ్యానా=ఆపరాశక్తిధ్యానముచేత, అపహృత=విడిచిపెట్టబడిన, మహితా= ఒప్పుచున్న, అగారకృత్యా=గృహవ్యాపారములుగలదై, ఆసీత్=ఉండెను.

తా—తపంబాచరించుచున్నసీ యక్షకాంతపరదేవతాధ్యాన పరవశయగుటచే పద్మసంవాసితంబులగు శీతలోదకంబులనుగాని, చక్రిని యొక్క వృక్షఫలములనుగాని ఆహారముగా గ్రహింపక పోయెను. మఱియు నాప్రాణవాయువులతో సంబంధము నొందవలెనని కోరికతో వెలుపలిపిల్లవాయువులు, మెల్లగా నీ పెదవులను తోచ్చి బయలు వెడలుచున్నవాయువన్నట్లు నిశ్వాసోచ్ఛ్వాసములనునవుండె. కావున నీకా కువాయువుమాత్రమే జీవనాధారంబనియు, నదియును నైష్ఠికముగ గ్రహింపబడెననియు "స్వాంతర్గంధా" ఇత్యాదివిశేషణముచే తెలియుచున్నది. "నాసికాయకకల్పితే" శరీరసుఖదాయకంబులగు నీవస్త్రముల నిశ్చేష్టముగా విడిచినటువలన నీమె నైష్ఠికతయు తపోమహిమయు స్పష్టమగుచున్నది.

శ్లో॥ ఏవంజాతేకియతిమహితేఽనేహసిక్లేశలబ్ధే
స్వప్నే దేవీవిహితవిలసత్సన్నిధానైవమూచే
తుష్టైవాహంతవనియమతస్త్వత్తతీవ్రవ్రతాస్యా
మత్కారుణ్యాదుపరిమహితేభోక్ష్యసే భవ్యభోగాన్॥

చ॥ జరుగఁగఁ గొంతకాలమిటు స్వప్నమునం గనుపించియాపరా
త్పరయిటువల్కెనీదయిన భక్తికి మెచ్చితిసాధ్వినీవ్రత
త్వరముగవీడుమీ తపము భవ్యసుఖంబులనందెదింకను
త్కరుణకుఁ బాత్రువై భువిముదంబునుబొందనివారలుందురే॥ ౧౮॥

అర్థము—ఏవం=ఈప్రకారముగా, కియతి=కొంత, మహితేఅనేహసి=తపస్సుచేనొప్పుచున్నకాలము, జాతే=జరుగగా, క్లేశలబ్ధే=కష్టసాధ్యమైన, స్వప్నే=స్వప్నమందు, విహిత=చేయఁబడిన, విలసత్=ప్రకాశించుచున్న, సన్నిధానా=సాన్నిధ్యముకలదై, దేవీ=ఆపరదేవత, ఏవం=ఈప్రకారము, ఊచే=పలికెను, మహితే=ఓపూజ్యురాలా, తవ=నీయొక్క, నియమతః=వ్రతమువలన, ఆ

హం=నేను, తుష్టేన=సంతోషించినవాడనై. త్యక్త...వ్రితా: త్యక్త=విడువఁబడిన, తపస్విన్రితా=తీవ్రమైన వ్రతముకలదానవు, స్యాః=అగుమా, ఉపరి=ఇకమీదను, మత్ప్రసాదాత్ = నాదయవలన భవ్యభోగాన్= మంచిసంపత్తులను, భోక్ష్యసే=అనుభవింపఁగలవు.

తా॥ ఇట్లుకొంతకాలము తపస్సుచేసినపిమ్మట ఆపరదేవత స్వప్నమందు ప్రత్యక్షమై, "నీతపమునకు మెచ్చితి" ఇట్టికఠినవ్రతమిక నల్పజనదు. నాయనుగ్రహము వలన నీకుసుఖములు గలుగునని చెప్పెను.

శ్లో॥ భక్తశ్రేణీసరతరళతస్తస్యయక్షేశ్వరస్య
వ్యాహారం మేఽద్యవిఫలయితుం నోచితం సత్యమేతత్
మత్సేవాతస్సముదితరసాప్యస్మి వాం విప్రయోగం
నేచ్ఛామ్యద్య ప్రవిఘటయితుం వర్తతే బీజమన్యత్॥

చ॥ ఎలబిలుఁడు భక్తగణహారచిరత్నము వానివాక్యమే
జాలను ద్రిప్పనీ వొడఁబడంతసచుందితినీదు సేవకో
బాలవియోగదుఃఖమెడఁబాపఁగఁజాలను దేనిబీజమే
పోలఁగఁజెప్పెదన్వినుము పూర్వకృతమ్మదివిస్తరమ్ముగన్॥ ౧౫॥

అర్థము—భక్త.....తః, భక్త=భక్తులయొక్క, శ్రేణీ=సమూహమనెడు సర=హారమునకు, తరళతః=మధ్యమణియైనట్టి, అనగా భక్తాగ్రేసరుడైన, తస్య=ఆ, యక్షోత్తమస్య=కుబేరునియొక్క వ్యాహారం=మాటను, విఫలయితుం=వ్యర్థము చేయుటకొఱకు అద్య=ఇప్పుడు, మే=నాకు, నోచితం=తగినదికాదు, ఏతత్=ఇది సత్యం=సత్యము, మత్సేవాతః=నన్నుసేవించుటవలన, సముదితరసాపి=పుట్టినసంతోషముకలదాననైనను, అస్మి=నేను, వాం=మీయొక్క, విప్రయోగం=వియోగమును, విఘటయితుం=పోఁగొట్టుటకు, నేచ్ఛామి=ఇష్టపడను, అన్యత్=ఇతరమైన, బీజం=కారణము, వర్తతే = ఉన్నది.

తా—భక్తులలో నగ్రగణ్యుడగు నాకుబేరునియొక్క వాక్యముల వ్యర్థముగాఁ గఁజేయుట దుర్లభము. (భక్తవాత్సల్యమువలన మామూర్తులైన కట్టుబడుదురనుట)

నీనియమపూర్వకమగు సేవకు మిగుల సంతసించిన దానవైనప్పటికి, జన్మాంతరకర్మవిశేషమువలని ప్రాప్తించిన మీవియోగము పోగొట్టసాధ్యముకాదు. కావున నీకు పంబుడుగుము. "నాభోగాత్క్షీయతేకర్మ" అనున్యాయంబున, నీశ్వరుడవ్వనాదులవల ననాగామిసంచితములు నశించినను, ఆరబ్ధముయొక్క వేగమాపశక్యముగాదనియు, నొకజన్మమున మనుజుని యనుభవము కానిదైనకటిజన్మయందైన నదిలేనుబట్టియుండుననియు సూచింపబడుచున్నది.

"బీజమన్యత్" పుణ్యపాపరూపములగు కర్మలయొక్క (నాగనటి)

శ్లో॥ ప్రాక్కోప్యాత్మదుహితృవరయోర్గర్వకోద్యదిరంసాం
జ్ఞాత్వాప్యేకో మతివిరహితో లగ్నకో భూన్నదైవాత్
సోస్మిన్జన్మన్యథ తవపతిర్యాప్త బాధో వియోగా
త్కింనోకర్మస్వఫలముచితంసంతనోతీహజంతోః ॥

చ॥ మనుపటి మీనసీమగఁడు మోహితుఁడై వలరాజు కాకలన్
గనలిసకూతునల్లురనుగాంచియు వారలఁగూర్పకుండె గా
వునతడీభవంబునను బొందెవియోగశుచంబుదప్పిపో
వునతనకర్మకుఁ ఫలము పొందకజీవుల కెందుమానిసి॥ ౧౬॥

అర్థము—ఏకః=ఒకడు, (నీభర్తయొయనుట) ప్రాక్కోప్యాత్మ=పూర్వజన్మమందు, దుహితృవరయోః=తనకుమార్తెకునల్లునికిని, నర్వకోన్యకా=మన్మథునివలన గలిగిన, రిరంసాం=సంభోగేచ్ఛను, జ్ఞాత్వాపి=తెలిసికొనియును, మతివిరహితః=మతిలేక, దైవాత్=దైవవశమువలన, లగ్నకః=సంఘాత, నాభూత్—కాలేదు, (సః=ఆపురుషుడు) (అథ=తరువాతను,) అస్మిన్జన్మని=ఈజన్మయందు, తవ=నీకు, పతిః=భర్తయై, వియోగాత్=విరహమువలన, ప్రాప్తబాధః=బాధనుపొందినవాడు, ఇహ=ఈలోకమునందు, జంతోః=జంతువుయొక్క, కర్మ=కర్మము, ఉచితం=తగిన, స్వఫలం=తనఫలమును, నోసంతనోతికిం=చేయదాయేమి.

తా—పైజెప్పినకారణమేమనగా, నీపతియనుకటిజన్మమున తన పుత్రికయు నల్లునిను నొండొరులపై మరులుగొనియుండుట దెలిసియును, తెలివిలేమిచే వారి

సమాగమమును బహుకాలికపోయె, కాన నీజన్మమున తాను పూర్వ మొనరించిన వియోగఫలము నిప్పుడు నెన్నైనబాయుటచే ననుభవింపవలసె. తా మొనరిచిన కర్మ ఫలమెంతటి వారికైన ననుభవింపక తీరదుగదా, "వియోగాత్ప్రాప్తబాణః" అను టవలన జన్మాంతరమునందే పాపం బొనరించిన తదనురూపంబగు ఫలంబుననుభవము న పుట్టువ్రున ప్రాప్తించుటను సూచించుచున్నది" అనగా దానహీనునకు దరిద్రత, కర్మహీనునకు నీచజన్మలు, కృతఘ్నులకు బలవన్మరణము మొదలగునవి యాయా పాపంబుల కనురూపయనుభవంబులు సంప్రాప్తమగుట "కర్మస్వఫలం" కర్మయొక్క ఫలము దేవతాదులకైన ననుభవించినగాని క్షీణింపదు, అద్దానిపోనడచుట వలను పడదు. ఇందుకు 'ప్రారబ్ధంభోగతోనశ్యేత్తనియు' హాతవిధిపరిపాకఃకేనవాలంఘనీయః (భర్తృహరి) ఇత్యాదియాప్తవాక్యంబుల, చంద్రుడు త్వమాశ్రయము కలవాడయ్యు క్షీణదశ విడువజాలనటుల నెంతవారికైనపూర్వకృతకర్మ యనుభవనీయమని తెలియుచున్నది, మఱియు రామాయణోత్తరకాండమున దేవతారూపమునొందినయొకరాజు పూర్వమున తానన్నదానాదులుచేయనికతంబున నాకలిదప్పులచెకడుబడలిశవభోజనుడయ్యెననుటయు ప్రసిద్ధము.

శ్లో॥ అన్యోన్యోద్యత్ప్రణయవశతో జాతకందర్పదర్ప
క్రాంతక్రీడావశగమనసోరర్థయామో కయోశ్చిత్
ఆశీహిత్వం స్వపదవిన యుంభోద్ధు కామావకాశం
హాదాపచంతదసివిధురా శాపపీచప్రసహ్యాః॥

చ॥ స్మరవశులైన యూనలకు శంబళ్లైతొలిమేననీవు వా
రిరువురు క్రీడసల్పుతరి నేగతినివ్విడనెంచినారొ నీ
వఱయఁగ వారికూటమికివడ్డముగానటియించియుంటవో
తరుణిలభించె నీవిరహతాపము శాపముచేతభోగ్యమై॥ ౧౭॥

అర్థము—అన్యోన్య...మనసోః, అన్యోన్య=ఒకరొకరియందు, ఉద్యతీ=పుట్టుచున్న, ప్రణయ=స్నేహమునకు, వశతః=స్వాధీనులగుటవలన, జాత, పుట్టిన, కందర్పదర్ప=మదనోద్రేకముచేత, క్రాంత=వ్యాప్తమైన, క్రీడా=సంభోగమునకు, వశగమనసోః=ఆధీనమైనమనస్సుగలిగిన, కయోశ్చిత్-ఒకానొకరగు, అర్ధయా

నోః=తగిన యానవంతులకు, ఆసీ=చెలికత్తెవైన, త్వంహి=నీవైతే, స్వపదవినయం=తనయందువారికిగలయణకువను, బోద్ధుకామా=తెలిసికొననిశ్చయించినదానవై, అవకాశం=వారికీయవకాశమును, నాదాః=ఇచ్చినదానవుకావు. తత్=ఆహేతువువలన, ఏవం=ఈవిధముగా, విపురా, విరహావతివి, అసి, అయితివి. గనుక, శాపపీఠ=శాపమే, పరిసహ్యః=అనుభవింపతగినది.

తా — తొలిబామున నీవొకరికడ చెలికత్తెవైయుండి మోహావశంబున మదన క్రీడకై వేడుకపడుచున్న జవ్వనులకు నాకాశంగముగ నీయందువారికిగల వినయాదుల బరిశీలించుటకై (అనగ తనను తిరస్కరించి క్రీడార్థమెంతశోకతాపుకేగెదరో, తనయందలి యాదరముచేతమకుతుకంబు వెలిపుచ్చుకుండెదరో యను పరిశీలనకై) వారి ప్రేమాంకురముల వృద్ధిజెంది ఫలింపనవకాశమియ్యవైతివి, కావుననే నీకీవియోగముసంభవించె. స్వయంకృతమగుకర్మననుభవించినగానితీరదు.

ఈశ్లోకద్వయమువలన జీవులు కర్మవశగులై జన్మాంతరమునందునూ పరస్పరసంబంధముకలవారై, తదనురూపఫలంబుల ననుభవించుటకొఱకు పరిణామవశంబున కాష్ఠాదులేకీభవించినట్లు కొంతకాలమన్యోన్యాశ్రయ సుఖదుఃఖములనుభవించుటకై నొకచోటగూడుచుందురనియు తెలియుచున్నది.

శ్లో॥ ఇత్యాదిశ్యస్ఫురితకరుణాసారమంతర్హితాయాం
తస్యాం కామేశ్వరవరతనావుద్ధృతై చాస్మదాశ్రి
తద్వృత్తాంతంసమగదదరంసంప్రసన్నాత్మవృత్తి
స్సైనాభూచ్ఛవ్యపగతమహాదైన్యతాపాతిరేకా॥

చ॥ పరశివకాంతయిట్టులని వార్యకృపాపగయత్త కాంతపై
వరవివియోగకారణముబల్కి శుభంబనిచెప్పిపోవఁగా
సరగునమేలుకాంచిచెలిస్వప్నకథావిధిమాకుశీఘ్రమా
దరమునఁజెప్పిదైన్యపరితాపమువాసిదొలంగెమేఘుఁడా॥ ౧౮॥

అర్థము — కామేశ్వరవరతనా=కామేశ్వరునిభార్యయగు, తస్యాం=ఆపరదేవత, స్ఫురితకరుణాసారం, స్ఫురిత=స్పష్టమైన, కరుణాసారం=దయారసముగల

గునట్లుగా, ఇతి=ఈప్రకారముగా, ఆదిశ్య=చెప్పి, అంతర్హితాయాం=అంతర్ధానము పొందినదగుచుండగా, అస్మదాళీ=మాచెలి, ఉత్థితైవ=లేచుచునే, తద్వృత్తాంతం=ఆస్వప్నవృత్తాంతమును, సంప్రసన్నాత్మవృత్తిః=నిర్మలమైనమనోవ్యాపారముగలదై, అరం=శీఘ్రముగా, సమగదత్=చెప్పెను, తేన=దానిచేత, వ్యపగత......రేకా, వ్యపగత=పోయిన, మహాదైన్య=గొప్పదీనత్వమువల్లనైన, తాపాతిరేకా=సంతాపాతిశయముగలది, అభూత్=ఆయెను,

తా—ఈప్రకారము లలితామహాదేవి కరుణారసము వెల్లివిరియునట్లుగా, తొలిదాముప నీకొసగ్గినయుపరాగముల వెలిబుచ్చి, మీదశుభంబొనగూడునని చెప్పి యంతర్ధానమునొందెను. పిదప నీయక్షకాంతయు దుఃఖమునువీడి దేవీవాక్యములవలన నాబాధ్య తెలిసి నిర్మలమనస్కురాలై యీవృత్తాంతమును మాకుం జెప్పె "అరం" ఉత్థితైవ అనుటవలన సౌభాగ్యమగు స్వప్నముగాంచినపుడు సత్వరముగా లేచుటయు, మరల నిద్రాభివశులుగాకుంటయు నీమొదలగు స్వప్నశాస్త్రానుగుణ్య ప్రవర్తనలు సూచింపబడుచున్నవి.

శ్లో॥ అప్యేవం సా మమ సహచరీ త్యక్తభోగానుషక్తిః
శ్రీదేవీముత్కరుణకరణవ్యాపృతిర్వీతఖేదా
తత్సేవాసుప్రియతహృదయాసాయుగా వీతదుగ్ధా
తత్కాక్షణోద్యదితశితమతిర్వర్తతే సాధువృత్తా॥

చ॥ లలితవచించినట్టి సుఖములన్నదిఁ గోరక యక్షకాంతలో
దలఁచి పరాంబికామదిముదంబొదవంగఁ సేవలిమ్ముగా
సలుపుటవీతఖేదయయి సంధ్యలఁ బాలను గ్రోలి శ్రీసతీ
లలితకటాక్షవీక్షణములన్మెలఁగెన్ సతిసచ్చరిత్రయై॥ ౧౯॥

అర్థము—మమ=నాకు, ప్రియసహచరీ=స్నేహితురాలగు నా యక్షకాంత, ఏవమపి=ఈప్రకారము లలితనుండి వరముపొందినదైనను, త్యక్తభోగానుషక్తిః=విడువఁబడినవిషయేచ్ఛగలదై, శ్రీదేవీ...వ్యాపృతిః, శ్రీదేవీ=ఆలలితకు, ముత్కరణ=సంతోషముచేయునట్టి, కరణ=వ్యాపారములందు, వ్యాపృతిః=వ్యాప్తికలదై, వీత

ఖేదా=విచారమునువదలి తత్సేవాసు=ఆలలితాపూజలయందు, ప్రయతహృదయా=నియతమైనమనస్సుగలదై, సాయం=సాయంకాలమందు, అప్రీతదుగ్ధా=క్షీరపాశ్రనముచేయునదియై, తత్కా...మతిః, తత్కారుణ్యా=ఆదేవియొక్కదయచేతను, ఉదిత=కలిగిన,సితమతిః=చురుకైనబుద్ధికలదై, సాధువృత్తా= సద్వ్యాపారముకలదై, వర్తతే=ఉన్నది.

తా—ఓమేఘుడా! ఈప్రకారము నాచెలియగు యక్షపరదేవతచేనోదార్పం బడినను, ఐహికసుఖేచ్ఛలనువీడి లలితాంబికనింకను మెప్పించుటకై పూజించుచు, తత్పూజాపరవశయగుటచే దుఃఖోపశమనంబునొంది, దివసావసానమువరకు భుజింపకయే నిర్మలమానసయై సద్వ్యాపారంబుల కాలంబుపుచ్చుచు, క్షీరోపహారిణియై యున్నది.

శ్లో॥ గానస్థానేపరశివవధూదివ్యనామావళీనాం
గాథాస్థానేభువనజననీ భవ్యలీలాకథానాం
క్రీడాస్థానేచిదనలజనేర్భండదైతేయయుద్ధ
ప్రాగల్భ్యానాంప్రతిదినమహో బోభవీతిప్రసక్తిః॥

చ॥ పరశివకాంతనామములె పాడును గానము సేయ నెంచినన్
దరచుగ నాజగజ్జనని సవ్యకథాళులలాలకించు సుం
దరముగ నాటలాడ లలితాకృతభండసురారిభండనసం
బరయగ జూపుకాలమిటు యాపన సేయును భక్తిమిత్రమా॥ ౨౦॥

అర్థము-గానస్థానే, సంగీతకాలక్షేపమునకుబదులు, పరశివవధూ=లలితయొక్క దివ్యనామవళీనాం=సహస్రనామములయొక్కయు, గాథాస్థానే=పురాణకాలక్షేపసమయమున, భువన=......కథానాంభువనజననీ=ఆలోకమాతయొక్క, భవ్య=మంగళప్రదమైన, లీలాకథానాం=విలాసవృత్తాంతముల యొక్కయు, క్రీడాస్థానే ఆటలకుబదులు, చిదనలజనేః = లలితయొక్క, భండదైతేయయుద్ధ=ప్రాగల్భ్యశ్రీనాం, భండదైతేయ=భండాసురునితోడైన, యుద్ధప్రాగల్భ్యానాం=యుద్ధనైపుణ్యములయొక్కయు. ప్రసక్తిః=ప్రసంగము, ప్రతిదినం=ఎప్పుడును, బోభవీతి=అత్యంతము జరుగుచున్నయది, అహో=ఆశ్చర్యము.

తా — పవిత్రపదమగు సంగీతస్థానమున లలితాసహస్రనామావళీ పఠనమును, పురాణశ్రవణ సమయమందు జగజ్జననీలీలాకథలను వినుటను, ఆటలస్థానమున నలలితయొక్క భండాసురవధచిత్రపట్యావలోకనము చేతను, నాయక్షకాంతకాలయాపనము చేయుచున్నది. ఎల్లప్పుడును సమస్త కార్యకరణంబున నామె మనము పరదేవతాయత్తమయియుండెననుట.

“చిదగ్నికుండసంభూతా” ఇత్యాదిలలితాభాష్యాదుల విశేషణముల చేతను ఒకానొకకల్పమందు భండాసురునిచే దేవతలు బాధింపఁబడుచుండ నాబాధాపనోదనంబునకై మువ్వురమూర్తులమ్మహాశక్తి నారాధింప, చిదగ్నినుండి యాపరాశక్తి లలితారూపంబున నవతరించి తద్వధఁగావించెనని లలితాఖండమునఁ బ్రసిద్ధము “గానస్థానే” ఇత్యాదికముచే,

శ్లో॥ శారీయాసీత్సురతసమయవ్యాహృతోద్ఘాటనేన
వ్రీడాహాసస్ఫురణజనితామోదభారప్రదాత్రీ
తాంవాగ్జాలిమివనగణయత్యేవసాస్మద్వయస్యా
శార్యాహారేవిగళితమనాః కార్శ్యమాలంబతేఽపి॥

చ॥ రతిసమయోక్తులన్ జిలుకరత్యుతరంబుగఁబల్కఁబైటనం
చితముగనొప్పసిగ్గునొక చెంపనుహాసముమోదమందుసం
స్తుతమతియాశుకంబిపుడ, సొక్కుచునుండినఁదిండిలేకమా
సతిగనిపిల్లిరీతిగనసహ్యముఁజెందుచునుండెనక్కటా॥ ౨౧॥

అర్థము — యా = ఏ, శారీ = గోరింక, సురత... నేన, సురతసమయ = క్రీడాసమయమందలి, వ్యాహృత = మాటలయొక్క, ఉద్ఘాటనేన = ప్రకటించుటచేత, వ్రీడాహాస....... దాత్రీ, వ్రీడా = లజ్జయొక్కయు, హాస = నవ్వులాటయొక్కయు స్ఫురించుటచేతను, జనిత = పుట్టిన, ఆమోదభార = సంతోషాతిశయమును, ప్రదాత్రీ = చేయుచున్నదై, ఆసీత్ = ఉండెనో, సా = ఆ, శారీ = గోరింక, ఆహారే = ఆహారమందు, విగళితమనాః = ఆసక్తి లేకయుండి, కార్శ్యం = కృశత్వమును, ఆలంబతేఽపి

పొందుచున్నప్పటికి, అస్మద్వయస్యా=నాసఖురాలగు యక్షి, తాం=ఆశారికను, మార్జాలీమివ=మార్జాలమునువలెనే, నగణయత్యేవ=లెక్కచేయుటయే లేదు.

తా—మఱియుపూర్వము కేళీమందిరమున క్రీడాసమయమందలి రహస్యవచనములను కాలాంతరమున వెల్లడించితనకుసిగ్గును నవ్వును మాటమాటికి గల్గించెడిపెంపుడు గోరువంకను గాంచి యమితానందమునొందు, నీ మెయిప్పుడు వియోగముచే చిత్తస్వాస్థ్యములేక యాహారాదుల జోక్యము కలుగకేనుకొనకుండుటచే తిననొల్లక చిక్కుచున్న నాపక్షినిగాంచి లెక్కజేయకయే మార్జాలమునువలెతిరస్కరించుచున్నది. అనగ "దుఃఖితేమనసిసర్వమసహ్యం" మ్మనునట్లు చిత్తస్వాస్థ్యము లేనియీమెకుదేవ్యుపాసనగాక మఱేమియు రుచించుటలేదని తాత్పర్యము "మార్జాలీమివ" యనునది "శ్వానకుక్కుటమార్జాలఃపోషయంతి దినత్రయం ఇహజన్మనిశూద్రత్వంభండాలః కోటిజన్మసు" అనునట్లుమార్జాల పోషణముశాస్త్ర నిషిద్ధంబగుట ప్రసిద్ధము "శారీఆహారేవిగళితమనాః" ఈయక్షవియోగతాపమును జూచి పక్షులుకూడ యాహారాదులనుపేక్షించుటచే నట్లుగన్పట్టుటచే నివియు తమసానుభూతిని గన్పఱచుచున్నట్లు స్ఫురించుచున్నది.

శ్లో॥ పున్నాగస్యచ్ఛదవిటపిసంక్లిప్తనీలాభ్రబుద్ధే
ర్మూలేమార్వాసితమరకతగ్రావసందీపవీఠే
బర్హ్యాసీనోరిపుమవిశరశ్కాలమాకాంక్షతేఽహో
ధీమాన్భావిప్రమదహృదయశ్చాత్రపంమాంక్షతేయః॥

చ॥ దళములుచాలఁగల్గజలదంబనువిభ్రమఁజేయుపొన్నక్రిం
దలలితఘాసనీలరుచితార్క్ష్యశిలాసనమందుసిల్చిని
శ్చలతఁదలంచెనెమ్మితనశత్రువయైనశరత్సమాగమం
బలఘుమనీషికష్టమిపుడైననుభావిశుభంబుగోరఁడే॥ ౨౩॥

అర్థము—ఛదవిటపిసంక్లిప్త నీలాభ్రబుద్ధేః, ఛద=ఆకులయొక్క, విటపి=వైశాల్యముచేత, సంక్లిప్త =చేయబడిన, నీలాభ్రబుద్ధేః=నల్లనిమేఘమనుబుద్ధికల, పున్నాగస్య=పొన్నచెట్టుయొక్క, మూలె=మూలమందు, దూర్వా......పీఠే,

మూర్వా=పచ్చిగడ్డివలె, అసిత=నల్లనైన, మరకతగ్రావ=గరుడపచ్చలచేత, సంచేపరి=పరికాశించుచున్న, పీఠే=ఆసనమందు, ఆసీనః=కూర్చున్న, బర్హీ=నెమలి (ఇప్పుడు)రిపుమపి=శత్రువైనను. శరత్కాలం=శరదృతువును, ఆకాంక్షతే=కోరుచున్నది, యః=ఎవడు, భావి=రాబోవు, పరిమదహృదయః=సంతోషమును మనస్సునందుకలవాడై, శాత్రవం=శత్రుసంబంధమైనదానినైన, కాంక్షతే=కోరుచున్నాడో, సః=వాడె, ధీమాన్=బుద్ధిమంతుడు

తా—ఆకులయొక్క వైశాల్యముచేత మేఘమను భ్రాంతిని కలుగజేయుచున్నాగవృక్షముయొక్క మూలమందు, మూర్వాంకురములవలె పచ్చనైనపచ్చరాపీటపై నుండిన నెమలియును, ఇప్పుడు తనకు శత్రువయినను, యక్షునిశాపావధియగు శరత్కాలాగమమునే కోరుచున్నదివలె నెయున్నది. భావిశుభంబులగోరి యప్పటి కష్టగంబ్లకుజాల్పడ సమకట్టువాడే బుద్ధిమంతుడు.

“రిపుమపి„ స్వామిహితమును గోరుసేవకులు తమకష్టములను గణింపక యజమానునికి సుఖంబొనగూర్చుటయె యవశ్యకర్తవ్యంబుగ పరిగణింతురు.

శ్లో॥ కీరేబింబభ్రమపరవశేస్వాధరాస్వాదనోత్కే
గచ్ఛత్యారాత్స్వవలయమణిశ్రేణికాదర్శనేస
కారుణ్యాద్వ్యాకరకఫలభూపేజబుద్ధింవ్యతానీ
త్సాపోపశ్యత్యవివిధురితాదుఃఖనఃకిన్నుసేవ్యం

చ॥ తనయధరంబుబింబమనిదాపునఁ జేరినజిల్కనొక్కరా
దనవలయాగ్రరత్నములదాడిమబీజపుటానవిల్చిదా
నకువుగనాతుచానవిరహంబునఁజూడదుదానినిప్పుడా
స్తనకుముదంబుగానొకఁడు తోచుటఁగాంచితిమేధరాస్థలిన్॥ ౧౩॥

అర్థము—బింబభ్రమపరవశే, బింబభ్రమ=దొండపండనుభ్రాంతికి, పరవశే=లోబడినదై, స్వాధరాస్వాదనోత్కే=స్వాధర=తనయధరముయొక్క, ఆస్వాదన=స్పృశించుటయందు, ఉత్కే=ఆసక్తికలదై, ఆరాత్=సమీపమునకు, కీరేణ

చిలుక, గచ్ఛతి=వచ్చినదగుచుండగా, యా= ఏ నా సఖి, కారుణ్యాత్ =దయవలన స్వవల...... నేన, స్వవలయ = తనకంకణమండలి, మణీశ్రేణికా = రత్నములవరుసయొక్క,దర్శనేన = చూపుటచేత, కరకఫలభూబీజ = దానిమ్మగింజలయొక్క బుద్ధిం= మతిని, వ్యతానీత్ = చేసెనో, సా = అట్టిచెలి, విధురితా = విరహవతియై, నోపశ్యత్యపి = దానిచూచుటయైనలేదు. దుఃఖినః = దుఃఖము కెంటెనవానికి, సేవ్యం= సేవింపతగినది, కిం = ఏమున్నది.

తా—నాచెలియొకప్పుడు విలాసముగ చిలుకనుజేరదీయునప్పుడది దొండపండను భ్రమచేనీమె మోవిని గఱవయత్నింప, దనముంజేతికంకణమందలి మాణిక్యముల వరుసనుజూపిదానికాహారంబగు దాడిమబీజముల భ్రమగల్గించి తనయధరస్పర్శనమునుండి తొలగించుచు విలాసముగ కాలముపుచ్చుచుండెడిది. ఇప్పుడట్టిసంతోషమునువీడి వానినిచెంతనైన జేరనిచ్చుటలేదు. దుఃఖవంతునకెవ్వియుముదంబొసగ సమర్థములు గావు.

శ్లో॥ ప్రోద్యత్ప్రోష్టినిచయలలితైః కర్కశైః పద్మకోశైః
శ్శోణాంభోజచ్ఛదసురుచిభిర్మందమందైశ్చభంగైః
యానశ్రీభిర్విశదగరుతాంతీరభూరుట్ప్రకానాం
నాద్యైర్వాపీస్వమనుచరతీర్ష్యయేవేక్షితేనో॥

చ॥ చంచలమీనసంపదను, సారసకర్కశకుట్మలైఖరిన్
మించిన యొత్తికల్వపస మెల్లఁగవచ్చు తరంగశోభరా
యంచలయానపుంగరిమ నాదరిచెట్ల పికస్వనంబు దా
నెంచుచునాకునిద్ది సరియేయని వాపినిఁజూడదీర్ష్యచే॥ ౨౮॥

అర్థము—ప్రోద్య......లితైః, ప్రోద్యత్ =ఎగురుచున్న, ప్రోష్ఠి=చేపలయొక్క, నిచయ=సమూహముయొక్క, లలితైః= విలాసములచేతను, అనగా=తత్సదృశనేత్రవిలాసములచేతననిభావము, కర్కశైః=మిగుల బిగువుగల, పద్మకోశైః = తామరమొగ్గలచేతనూ, తత్సదృశస్తనములచేతననుట, శోణాంభోజచ్ఛదసురుచిభిః శోణాంభోజ=ఎఱ్ఱకలువలయొక్క, చ్ఛద=దళములయొక్క, సురుచిభిః=కాంతు

లచేతను, తత్సదృశదళచ్ఛదములచేతననుట, మందమందైః=అత్యంతము మందములైన, భంగైః= తరంగములచేతను, తత్సదృశవళీభంగములచేతననుట, విశదగరుతాం = హంసలయొక్క, యానశ్రీభిః = గమనసంపత్తిచేతను, తీరభూరుట్పికానాం = ఒడ్డునయుండెడి చెట్లయందలి కోకిలలయొక్క, నాదైః = ధ్వనులచేతను, తత్సదృశమగు స్వనముచేతను) మాటలచేతను, వాపీ = సరస్సు, స్వాం = తనను, అనుచరతీతి = అనుసరించునని, ఈర్ష్యయైవ = అసూయచేతను వలెనే, నోఈక్షతే = చూడదు.

తా—వియోగదుఃఖార్తయగు నాయేలిక, జలక్రీడాదులఁబరిత్యజించుటేగాక, క్రీడార్థంబగు నెగడు బావితనయవయవవిలాసంబున కనురూపంబులగు మత్స్యాది వస్తుసముదాయము గ్రహించి శృంగారాకృతివహించిన యొకస్త్రీవలెనే, ఇప్పుడు కృశించియున్న తననధిక్షేపించుననితలఁచియీర్ష్య జెందిన దానివలెనే దానిగనుగొననైనతలపెట్టదు. లోకమునకష్టదశలో నుండువారు పూర్వమునతారనుభవించినట్టి సౌఖ్యమననుభవించుచు విలాసముగ నుండెడివారిగాంచిన, తమపూర్వస్థితిస్మరణమునచ్చుటచేదుఃఖంబధికంబగుననియెంచి నట్టివారివిషయమైయీర్ష్య జెందిన వారివలెనె వారి జూడనొల్లరనుటలోకానుభవప్రసిద్ధము.

శ్లో॥ స్వాజ్ఞాకర్తర్యపిపరిజనే హాస్యయం ప్రేమభావా
దాగారాంతస్థగితలలితాలేఖ్యలావణ్యహేతోః
వక్షోజాతాంబరవిలసనం యావిధత్తేస్మనేయం
నైవాపశ్యత్తదుదితశుచాతానిమాలిన్యభాంజి॥

చ॥ పరిజనమాజ్ఞలేచి నిలువంబడియుండినసైన సింటచి
త్తరువులు స్వచ్ఛమైనను ముదంబునఁబయ్యెదతోడదానెవే
మరుదళుకొత్తఁగాఁదుడుచు మానినియిప్పుడు మాసియున్న చి
త్తరువులఁజూడదీవిరహతాపమునన్నది గుంది మేఘమా॥ ౨౫॥

అర్థము—పరిజనే= పరిజనము, స్వాజ్ఞాకర్తర్యపిహి = తనయాజ్ఞనుచేయుచుండగానే, యా= ఏసాచలి, ప్రేమభావాత్= ఆసక్తివలన, ఆగారాంతస్థగిత=

ఇంటిలోపల నుంచబడిన, లలిత=చక్కని, ఆలేఖ్య=పటములయొక్క, లావణ్యశ్రీః=సౌందర్యము నిమిత్తము, వక్షోజాతాంబర=పైటకొంగుయొక్క, విలసనం=ప్రసారము, తుడుచుటకై యనుట, విహితేస్మ=చేసెనో, సేయం= ఆయాయక్షకాంత, తదుదితశుచా= ఆవిరహమునలన బుట్టినదుఃఖముచేత, మాలిన్యభాంజి= మాలిన్యము పొందిన, తాని=ఆపటములను, నైవావలోక్యతే=చూడనేలేదు.

తా—పూర్వమందు నేవకులున్నను స్వయముగనే తన క్రీడాగృహమందలి చిత్రలేఖ్యముల ప్రేమచే, తన పైటకొంగుచేతనే శుభ్రముచేయుచుండెడిది. అట్టియీమె ఈవిరహదుఃఖముచేత వానివంక జూచుటయైన లేదని యాయక్షిచెలకత్తె మేఘునితో చెప్పెను.

శ్లో॥ ఇత్యాఖ్యాత్యాద్రిద మృతచరితం సాధుసఖ్యాం ప్రవృత్తం
ధ్యానాధీనామలినమనసా ముక్తకల్పాధయక్షీ
ఆసీనాసాచరణనికటె సన్నిషణ్ణంపయోదం
ప్రేమ్ణాలోక్యప్రకృతముచితం వ్యాహృతం వ్యాజహార॥

చ॥ చెలియిటుబల్కఁగాసుధలు జిమ్మెడు తచ్చరితంబు యక్షిలో
దలఁచి పరాంబికాచరణ తామరసంబుల చింతదుఃఖయై
జలదుని గాంచిపాదముల సన్నిధినుండఁగఁ బ్రేమనిట్లుగా
బలికెహితోక్తి ప్రస్తుతము బల్కఁగ యోగ్యముగాఁగ మోదయై॥

అర్థము—ఇతి=ఈప్రకారము, సఖ్యాం=చెలికత్తె, అమృతచరితం=అమృతస్వరూపమగు, ప్రవృత్తం=తమవృత్తాంతమును,సాధు=బాగుగా, ఆఖ్యాత్యాం=చెప్పినదగుచుండగా, అథ=అటుతర్వాతను, సాయక్షీ=ఆయక్షాంగన, ధ్యానాధీనా=దేవతాధ్యానమునకధీనురాలై, మలినమనసా=దుఃఖితమగుమనస్సుచేత, ముక్తకల్పా=విడువబడినదివలెనే, ఆసీనా=కూరుచున్నదై,చరణనికటే=పాదసమీపమందు, సన్నిషణ్ణం=నివసించిన, పయోదం= మేఘుని, ప్రేమ్ణా=ప్రేమచేతను, ఆలోక్య=చూచి, ప్రకృతం=ప్రస్తుతమై, ఉచితం=తగిన, వ్యాహృతం=మాటను, వ్యాజహార= చెప్పెను.

తా—శ్రీచెలికత్తె యీపత్రికాగ్రము తనవృత్తాంతమును చెప్పినతర్వాత దేవతాధ్యానముచే స్థిమితపడిన మనస్సుకలదై యీయక్షి లేచి కూర్చుని, తనసమీపముననున్న మేఘునిజూచి చెప్పదొడంగెను.

“అమృతచరితం” అనుటవలన తనహితుండగు యక్షుండు తనప్రియురాలి పాతివ్రత్యమునుగూర్చి చెప్పినవాక్యము లీమె ప్రవృత్తితో సరిపోవుచుండుటవలన, మేఘుని కీచెలికత్తెమాట లమృతప్రాయములై మనంబలరించెనని తాత్పర్యము. “ముక్తకల్ప” యక్షోదంతము దూతవలన విన్నదగుటచే దుఃఖము కొంతయుపశమించినను, భర్తృసమాగమము ప్రాప్తించనందున పరిపూర్ణముగా విడువలేదనుట.

శ్లో॥ అభ్యాశే తేన కిమపి మయా వత్స సంగోపనీయం
యత్త్వం తేనాత్మతనుజధియా ప్రేయసా స్వీకృతోసి
తస్మాదద్యోచితమపి నవా కథ్యతే మత్ప్రియస్య
శ్రోత్రాతిథ్యంకురు చ పరతో విస్మరేదం వచో మే॥

చ॥ వారిద నీసమీపమునఁ బల్కఁగ దాచువచస్సు నాకు లే।
దారయ నిన్ను నాదయితుఁ డాత్మజురీతిగఁ బ్రేమ నెంచుటే।
గారణమే యవాచ్యమది కాదని యెంచక చెప్పుసర్వమా।
ఫీసని శ్రోత్రపేయముగ దెల్పియ వెంటనె విస్మరింపుమా॥ ౨౭॥

అర్థము—ఓవత్స=ఓమేఘుడా, తే=నీయొక్క, అభ్యాశే=సమీపమునందు, మయా=నాచేత, సంగోపనీయం=దాచతగినది, కిమపిన= కొంచెమును లేదు యత్=ఏలనన= త్వం=నీవు, తేన ప్రేయసా=ఆనాప్రియునిచేత, ఆత్మతనుజధియా=పుత్రబుద్ధిచేతను, స్వీకృతోసి=గ్రహింపఁబడితివి, తస్మాత్=అందువలన, ఉచితమపినవా=తగనిదైనను, కధ్యతే=చెప్పబడుచున్నది, మత్ప్రియస్య=నాప్రియునకు, ఇదంమేవచః=ఈనావాక్కును, శ్రోత్రాతిధ్యంకురు=చెప్పుము. పరతః=వెంటనే, విస్మర=మఱువుము.

తా—ఓమేఘుడా! నాభర్తచేతను నీవుపుత్రబుద్ధిచే స్వీకరింపబడితివి గావున నీయెదుటదాచతగినదెద్దియు లేదు. కావున రహస్యమగుటవలనచెప్పకూడని విషయ

ము లెవ్వియు నుండవుగాన, చెప్పుచుంటిని ఈవృత్తాంతమును నాప్రియుని మనంబలరించునట్లు చెప్పి వెంటనే మఱచిపొమ్ము. ఇంకొకచో ప్రకటింపతగినది కాదని తాత్పర్యము.

శ్లో॥ హాస్యేనాపి ప్రియ ఇతి మహాన్ వంచనీయో న లోకై
స్తచ్చేత్తేషాం భవతి విపదా సత్యమేనం బ్రవీమి
అస్మత్క్లృప్తోఽయమితి తిమిరధ్వంసనే చేదగారే
స్పృష్టో దీపో న దహతి కరం తత్క్షణేనైవ కర్తుః

చ॥ మోసము చేయగూడ దొకపూజ్యుని లోకము మోసగించినన్
వాసి దొలంగు పూజ్యునకవశ్యము బాధలు కల్గు నిక్కమూ
వాసమునందుఁ జీకటిని బాపఁగఁ బెట్టినదివ్వె ముట్టినన్
గాసి యొసంగు కర్తకును గావున వెల్లడి సేయకీ నుడిన్ ॥ ౮౨॥

అర్థము — మహాన్ = పూజ్యుడు, ప్రియ ఇతి = ఇష్టుడుగదాయని, హాస్యేనాపి = పరిహాసము చేతనైనను, లోకైః = జనులచేతను, వంచనీయః = వంచింపతగినవాడు, న = కాడు, తచ్చేత్ = అట్లు వంచించుట కలిగినట్టయిన, తేషాం = వారికి, విపదా = ఆపత్తు, భవతి = అగుచున్నది, ఏవం = ఈప్రకారం, సత్యం = నిజముగా, బ్రవీమి = చెప్పుచున్నాను, అయం = ఈదీపము, అగారే = గృహమందు, తిమిరధ్వంసనే = చీకటి పోగొట్టుటకై, అస్మత్క్లృప్తం = మనచేత కల్పింపబడినది. ఇతి = ఈలాగునని, స్పృష్టశ్చేత్ = స్పృశింపబడినచో, తత్క్షణేనైవ = వెంటనే, కర్తుః = స్పృశించినవానియొక్క, కరం = చేతిని, నదహతి కిం = కాల్పదా ఏమి.

తా — లోకమున పూజ్యుడైనవాడు ఇష్టుడుగదాయని పరిహాసమునకైన వంచింపతగినవాడు కాడు అట్లు వంచించినయెడల వారికి అనగా అట్లు వంచింపబడినవారికి కీడుమూడుననుమాట సత్యము చీకటిని పోగొట్టుటకొరకు దివ్వె మనచే నిర్మింపబడినదే గదాయని స్పృశించినచో చేతిని కాల్పకుండునా? అట్లనే దీపమును స్పృశించి వంచింపఁబడి దుఃఖించినటుల నీయందలి విశ్వాసముచే చెల్పిన మా నర్మాలాపముల వెలిబుచ్చినచో మేము దుఃఖాస్పదులమగుదుము. కావున నట్లు చేయఁదగదని భావము

“త్రిభిఃగ్నవైః సైరంధ్రీపుః” ఇచ్చట దంపతులకన్యోన్యము సౌఖ్యముసల్పి వారివియోగ బాధనపనయించు కేశుభము, గృహమున నంధకారము బోగొట్టుటకైన దీపమువంటి నాడని తెలియుచున్నది. ‘స్పృష్టః దీపఃదహతి’ సోప్వయోగమునకై తాను వెలిగించిన దివ్వెయైనను పరిహాసపూర్వకముగ స్పృశించిన నెట్లుదహించునో, అట్లైమావిర హాగ్ని కొలంగించి నీవసంభోగసంగుటకు నీకడ వెలువరించిన మానర్మసంభాషణంబుల కీర్తి పదులతోబయలుపఱచిన మాకపకార మొనరించినవాడవగుదువని తాత్పర్యము.

శ్లో॥ మదూప్రతిమానాం మహితమహసాం హేమపాంచాలికానాం
కాంచిత్కామార్దితతమమనాః చుంబతిస్మస్వబుద్ధ్యా
మధ్యేతాసాంవిహితవసతిస్తన్నిరీక్ష్యాత్తమోదా
కార్షంహాసంసపదిజనిత ప్రీడయామాంవివేద॥

చ॥ నెలకొగనెజ్జగీమునను నిల్పిన మేల్మిపసిండిబొమ్మలన్
నిలిచిననన్నుఁగాంచకయె నీసఖుఁడొక్కెడమన్మథార్తుఁడై
వలపున బొమ్మనేననెడు వాంఛను ముద్దిడఁజూచి గొబ్బునన్
కిలకిలనవ్వఁగాంచెఁగను క్రేవలనిగ్గుచలింపనన్నటన్॥ ౨౯॥

అర్థము-మహిత=ఒప్పుచున్న, మహసాం=కాంతిగల,మదూప్రతిమానాం=నాప్రతిబింబములైన, హేమపాంచాలికానాం=బంగారుబొమ్మలలో, కాంచిత్=ఒకానొకదానిని, కామార్దితతమమనాః, కామ=మన్మథునిచేతను, అర్దితతమ=మిక్కిలిపేధింపబడిన, మనాః=మనస్సుకలవాడై, స్వబుద్ధ్యా=నేననెడిబుద్ధితో, చుంబతిస్మ=ముద్దుపెట్టుకొనెను, తాసాంమధ్యే=ఆబొమ్మలయొక్క మధ్యయందు, విహితవసతిః=ఉన్నదాననై, తత్=ఆప్రియకృత్యమును, నిరీక్ష్య=చూచి, ఆత్తమోదా=సంతోషమునుపొందినదాననై, హాసం=నవ్వును, అకార్షం=చేసితిని, సపది= ఆనవ్వినప్పుడు, జనితవ్రీడయా=పుట్టినసిగ్గుగలవాడగుటచేత, మాం=నన్ను, వివేద=తెలుసుకొనెను, తనపతియని యధ్యాహారము

తా—పూర్వమొకానొకప్పుడు మాకేళీమందిరముల విలాసార్థమై యుంచిన నాప్రతిబింబములనందగు బంగారుబొమ్మలనడుమనుండగా నాప్రియుండు మఱులు

గొని, నాప్రతిబింబమునె నన్నుగా భావించి ముద్దిడ సమీపమున నున్న నేను, నాయంచువానికి గలయనురాగాతిశయమున గలిగినపతుకంబును హాసపూర్వకముగ వెలువరింప కొంచెము సిగ్గుజెందినవాడగుచు నన్ను సర్తుసట్లుట జూచినపుడు సంతసించితి. ఇందువలన వీరి యైశ్వర్యమును నిత్యమును చూచుచున్న తనపతికే నూతనపాంచాలికవలె కన్పట్టుటవలన నా మెలావణ్యాతిశయమును, వీరియమితంబగు సన్నోహానురాగంబును వెల్లడియగుచున్నవి.

శ్లో॥ తత్రాప్రినే హాస్యుదితలలితా సుందరత్వంతయాహం
సంక్రీడస్వప్రియతమమితివ్యాహరంధీరభావా
పశ్చాత్తాపవ్యథితహృదయం వీక్ష్యతంక్లాన్తబుద్ధిం
మత్పీనోరువ్యధితజఘనస్యాస్యవక్త్రంవ్యచుంబం॥

చ॥ అప్పుడుజూపనుందరుడ యావెనుగూడి సుఖింపుమం చనే
తెప్పునధీరురాలనయి తెల్పగదుఃఖ చిత్తుడై మనవా
చెప్పగలేకయుత్తరము చింతవహింపగ జూచి పూర్తినై
యొప్పగబోయిముద్దిడితి నూరులజుట్టి కటిప్రదేశమున్॥ ౩౦॥

అర్థము.—తత్రాప్రినేహసి= ఆకాలమందు, ఉదితలలితా= పుట్టినవిలాసము కలదానినై, సుందర = ఓసుందరుడా! త్వం=నీవు, తయా = ఆబొమ్మతో సంక్రీడస్వ=క్రీడింపుమా, ఇతి=ఈలాగని, ప్రియతమం=భర్తను, ధీరభావా=ప్రౌఢనై, వ్యాహరం=చెప్పితిని, పశ్చాత్=పిమ్మట, తాపవ్యథితహృదయం=తాపము చేకలతనొందిన మనస్సుకలిగినటువంటి, తం=అప్రియుని, క్లాంతబుద్ధిం=యుక్తిశూన్యునిగా, వీక్ష్య=చూచి, మత్పీనోరువ్యధితజఘనస్య, మత్=నాయొక్క, పీనోరు=బలమైనతొడలచేత, వ్యధిత=పీడింపబడిన, జఘనస్య=కటిప్రదేశముగల, అస్య=ఇతనియొక్క, వక్త్రం=ముఖమును, వ్యచుంబం=ముద్దుపెట్టికొంటిని.

తా—ఆసమయమున నేనుమిగులనవ్వి, ఓసుందరుడా! నీనాబంగారుబొమ్మతో నేనీయభీష్టములనెరవేర్చికొమ్ము అనిధీరత్వముతో పలుకనాతడుపరితపించిన మనస్సుకలవాడగుటచే నిరుత్తరుడగుటజూచియాలింగన విశేషములచే నాతనిమోము ముద్దిడితిని.

శ్లో॥ కాలేకస్మింశ్చ్యనరతవిధాభేదతస్సంప్రసక్తం
లాక్షారాగంహృదయకలితంమత్పదారోపితంతం
సందర్శ్యైవంపదవిసరణంకిన్ను తేయుక్తమాళి
త్యుక్త్వావ్రీడాచకితమనసంమాంనినాయాతిమోదం॥

చ॥ స్మరసమరాంతరంబునను మైమరపారతిభేదరీతియో
నరహృదయాంతరంబునను పాదమునోటఁగయావకుంకమా
చరణమునాకుఁజూపిసరసంబిటులుండ నెతన్న న్యాయమే
గరితయసంగలజ్జభయకంపితనానను గ్రిచ్చిముద్దిడెన్॥ ౩౧॥

అన్వయము—కస్మింశ్చన కాలె=ఒకానొకసమయమందు, రతివిధాభేదతః=బంధ విశేషమందు, మత్పదారోపితం= నాపాదమందుంచబడినదియు, హృదయకలితం = వానిహృదయదేశమునంటినదై, సంప్రసక్తం = లగ్నమైన, తంలాక్షారాగం = ఆల త్తురంగును, సందర్శ్య = చూపెంచి, ఆళీ = ఓసీ, ఏవం = ఈప్రకారముగా, పదవి సరణం = తన్నుట, తే = నీకు, యుక్తంకిన్ను = తగినదా, ఇతి = ఈలాగున, ఉక్త్వా = చెప్పి, వ్రీడాచకితమనసం = సిగ్గుచె జెదరినమనస్సుగల, మాం= నన్ను, అతిమోదం = మిగులసంతోషమును, నినాయ = పొందించెను.

తా— ఒకానొకప్పుడు రతిబంధవిశేషమందు తన హృదయమున నంటి నలత్తుకను జూపి, తననిటుల తన్నుటతగునాయనియడిగి, సిగ్గుచే జడిసిననన్ను నూతనవధూసంగమసౌఖ్య ప్రకటనపూర్వకముగ, మిక్కిలి సంతోషపెట్టెను. వీని హృదయములాక్షారస చిహ్నితమయినదనుటవలన ధేనుకాదిబంధలక్షణముల తెలియ చేయుచున్నది. ‘వ్రీడాచకితం’

శ్లో॥ నైతత్సభ్యాఅవినిగదితం వ్రీడితంవత్సతావ
త్ప్రజ్ఞానాగ్ర్యంమనసిజకృతవ్యాధిపాథోధిపోతం
చేతస్సంపీడనకృతియుజామాప్తసత్సన్నిధానే
వాచాముచ్చారణమయి భవత్యేవకించిత్సుఖాఢ్యం॥

చ॥ చెలికిలీఁ జెప్పలజ్జయగుచేష్టలె నీకడవత్స సెప్పఁగా
దలచితిగొప్ప చిహ్నమిది దర్పకరోగసముద్రపోతమో
జలదమనోరుజాకర వచస్సులనాప్తసమక్షమందు వే
బలుకుటకొద్దిసౌఖ్యమని భావమునందలపోయగాదగున్॥ 3౨॥

అర్థము—వత్స=ఓ మేఘుడా, వ్రీడితం=లజ్జాపాదకంబగు, ఏతత్=ఈవృత్తాంతమును, సఖ్యా అపి=చెలికత్తెకును, ననిగదితం=చెప్పబడ లేదు. మనసి... పోతం, మనసిజకృత=మన్మథునిచేజే యబడిన, వ్యాధిపాథోధి=దుఃఖసముద్రమునకు, పోతం=తెప్పయగు, ప్రజ్ఞానాగ్ర్యం=ఈమేటిగుర్తును, తావత్=ఇప్పుడు తెలిపితిని. ఆప్తసత్సన్నిధానె=అప్తులైన సత్పురుషులఎదుట, చేతస్సంపీడనకృతియుజాం=మనస్సనకు బాధకలుగఁజేయునట్టి, వాచాం=వాక్కులయొక్క, ఉచ్చారణం=చెప్పుట, కించిత్=కొంచెము, సుఖాఢ్యం = సుఖముతోగూడునది అయిభవత్యేవ = అగుచునున్నదేగదా.

తా—ఓ మేఘుడా, లజ్జాకరంబైన యీమాటలను నేనాసఖురాలితో నైనఁ జెప్పియుంచ లేదు. మన్మథబాధాసముద్రమునుతరింప తెప్పయగు సిరహస్యమగు యీనవాలును పుత్రునివలె విశ్వసించి నీతోనిప్పుడు జెప్పితి. లోకమున యాప్తులయొద్ద తమకష్టముల వెల్లడించుకొనుటచే, కొంతమనోవిశ్రాంతి కలఁగుటయు, వారిసానుభూతికిని యుపకారమునకును పాత్రులజేయుట ప్రసిద్ధమే. కావున నాదుఃఖమును జూచి కరుణగలవాడవై నాభర్తకీయుదంతము తప్పకచెప్పి మాబాధతొలగింపుమని తాత్పర్యము.

శ్లో॥ ఏతాదృగ్వాక్తతికథనతస్సాం ప్రితంమామవజ్ఞా
పాత్రింనాస్యోచితమచిపరిజ్ఞానశూన్యాంనిబోధ
కామార్తికింసకథయతిభోఃకాలతస్సంయతాత్మా
వక్త్యేవాపత్రిపమవికల స్వేహితంత్యక్తమానః॥

చ॥ పలుకులనిట్టివాక్యములవజ్ఞతకున్దగినట్టిదానిగా
దలపకునన్నుసూరి జనతాదరబు, ద్ధివిశేషశూన్యగా

జః దవచింపఁజేది స్మరసంజ్వరుఁడక్కట త్యక్తమానుఁడై
పలుకుసుమామనోరథముపత్రిపఁగాలముచేఁబద్ధుఁడై ॥ ౩౩॥

అన్వయః — ఏతాదృక్ = ఇటువంటి, వాక్తతి = వాక్సమూహముయొక్క, కథ
నతః = చెప్పుటవలన, సాంప్రతం = ఇప్పుడు, మాం = నన్ను, అవజ్ఞాపాత్రం = తిర
స్కరింపఁదగిన దానినిగాను, ఆర్యోచిత......శూన్యాం, ఆర్యోచితమతి = పెద్దలకు
తగినబుద్ధియొక్క, పరిజ్ఞాన = జ్ఞానముతో, శూన్యాం = శూన్యురాలనుగా, నని
బోధ = తలపకుము, భోః = ఓ మేఘుఁడా, కామార్తః = మన్మథపీడితుఁడు, కింనకథ
యతి = ఏమిచెప్పఁడు, కాలతః = కాలముబట్టి, సంయతాత్మా = బద్ధచిత్తుఁడై, త్యక్త
మానః = వీడినయభిమానముకలవాఁడై, అవికలం = వికారములేకుండా, అపత్రపం =
పోయినసిగ్గుకలుగునట్లుగా, స్వేహితం = తనకోరికను, వక్త్యేవ = చెప్పనేచెప్పును,

తా — ఇట్టిలజ్జాకరంబులగు విషయములఁజెప్పుటచే, యోగ్యతావిహీనురాల
గను, తిరస్కారపాత్రముగను నన్నుతలచుటతగదు. కామార్తుఁడైనవాఁడు తనలాభ
మునే కోరుచు, నభిమానమువీడి, యుక్తాయుక్తవిచక్షణ చేయజాలక సిగ్గునువిడ
నాడి తనరహస్యముల వెల్లడించుకొనును.

" ఆర్యోచితమతి " " .........ధీరత్వముచితజ్ఞతా.........చత్వా
రస్సహజాగుణాః " అను న్యాయంబున సహజగుణంబులగు నౌచిత్యాదుల కాలవైప
రీత్యమువలని గలిగిన నీవియోగావస్థయందు కామార్తనగుటచే నౌకవిధముగ నుల్లం
ఘించితిగాని బొత్తుగా నెఱుగననుకొనకుమనుట మఱియునిది " కామార్తాహిప్రకృతి
కృపణాశ్చేత నాచేతనేషు " అను పూర్వమేఘమున కాళిదాసుని వచనమును
జ్ఞాపించుచున్నది.

శ్లో॥ యత్నాద్ధీశ ప్రవహితభిదురశ్చాపసంవీడితాత్మా
ముక్తైశ్శ్వాసై రశిశిరతరై ర్దంతవాసోరుణాభం
కింస్వత్కుర్వన్నతిమపివిభ్ఘంవర్తతే న ప్రియోమే
నాడీలత్స్యాకృతిరసతాజ్ఞేయకారో౽ద్యహంత॥

చ॥ పిడుగునుబోలు శాపము కుబేరుఁడొసంగగ దుఃఖితాత్ముఁడై
కడువడిఁ జేఁడియూర్పులిడఁ గందఁగ నెఱ్ఱని మోవినల్లగా
నొడలునసన్న నౌనరములొప్పఁగ నెక్కుడుఁ జాలిఁ దాగనం
బడునొకొ, యానవాలిడఁగ వచ్చునొ రాదొకొ నాకుఁ జెప్పుమా॥

అర్థము—యక్షాధీశ...... తాత్మా, యక్షాధీశ=కుబేరుని చేత, ప్రణీత=ఇవ్వబడిన, భిదురచ్ఛాప=పిడుగువంటిశాపము చేత, పీడితాత్మా=బాధితాత్ముఁడై, ముక్తైః=విడువబడిన, అశిశిరతరైః=మిక్కిలివెచ్చని, శ్వాసైః=నిట్టూర్పులచేత, అరుణాభం=ఎఱ్ఱనికాంతిగల, దంతవాసః=అధరమును, అతిమషివిభం=మిక్కిలినాచుట చేనల్లనిదానినిగా, కుర్వన్=చేయుచు, అద్య=ఇప్పుడు, మేసప్రియః=ఆనాప్రియుడు, నాడీలక్ష్యాకృతిః=నాళ్ళచేసూచింపతగిన ఆకృతికలవాఁడై, అరసతాక్షేయకాయః, అరసతా=కుషించుటచే, అక్షేయ=ఆనవాలుపట్ట శక్యముకాని, హంత= అయ్యో, వర్తతేకించిత్=ఉన్నాడుకాబోలును.

తా—పిడుగునుబోలి హఠాత్ప్రాప్తంబైన నీకుబేరశాపమువలన బాధితమైన మనస్సుగలవాఁడై, వెచ్చనినిట్టూర్పులచే నరుణంబగు తనయధరము కందుచుండ, నాహారాదులులేక కుషించిన కాయము గలవాఁడగుటచే నరములు బైటపడి యానవాలు పట్టతగనట్టు మాఱురూపమును నొందినవానిగా నాభర్తను తలచుచున్నాను. ‘మషివిభందంతవాసః’ ‘నాడీలక్ష్యాకృతి’ ఇత్యాది విశేషణముల చేవిప్రలంభశృంగారవయములను నరతిక్కృశతాద్యవస్థలును, శోకాదిస్థాయిభావములును నిశ్వాసాదివ్యభిచారభావములును వ్యక్తీకృతములగుచున్నవి. మఱియు నివిసమానావస్థయందుండి, తనభార్యనుగురించి చెప్పిన ‘పద్మినీవాన్యరూపాం’ (ఉ. మే 23) అనియు ‘భిన్నవర్ణాధరోష్ఠం’ (ఉ. మే. 24) అనియు చెప్పిన వాక్యముల జ్ఞాపకము చేయుచున్నది.

శ్లో॥ మన్యేస్త్రాంతర్విహితమహిమేనాంజనేన ప్రకామం
నీలంతన్యాధరదళమదో గౌరవాలోకభీత్యా
చుంబంతేలం ప్రతిముహురహంకచ్చిరత్వచ్యుతంవా
తస్మాంతాదృగ్భవుకపదవీకావ్యాస్త్వితీహంకరోమి॥

చ॥ కనులనునున్నపై చెలఁగు కాటుకనాపతి మోవినంటఁగా
గనిగురు తెవ్వరైనఁగనఁగానగు గౌరవహాని వానికం
చనిమదిలోఁదలంచి యధరామృతమానఁగఁ గజ్జలంబుపో
వమను మనుసౌఖ్యమిట్టిదిలభించునె యెన్నటికైనఁ జెప్పుమా॥౩౫॥

అర్థము — మత్ = నాయొక్క, నేత్రాంతః = నేత్రప్రాంతమున, విహిత = ఉంచబడినదై, మహితేన = ఒప్పుచున్న, అంజనేన = కాటుకచేత, ప్రకామం = మిక్కిలి, నీలం = నల్లనైన (నేత్రచుంబనముచేత ననిభావము) తస్య = ఆప్రియుని యొక్క, తం అధరదళం = ఆచిగురుమోవిని, అథో = అటుతరువాతను బహిర్గమనానంతమని తాత్పర్యము. గౌరవాలోకభీత్యా, గౌరవ = గురుసమూహముయొక్క, ఆలోకభీత్యా = దర్శనభయముచేత, ప్రతిముహుః = మాటిమాటికి, చుంబంతీ = చుంబించుచున్నదాననై, అహం = నేను, కచ్చరత్వ చ్యుతం = పోయిన మాలిన్యముకలదానినిగా, వ్యాతన్వం = చేసితిని. తాదృగ్భవుకపదవీ = అటువంటి మంగళప్రాప్తి, క్వ = ఎప్పుడు లేకఎక్కడ, అస్తి = అగును. ఇతి = ఈలాగునని ఈహాం = కోరికను కరోమి = చేయుచున్నాను.

తా — ఒకానొకప్పుడేకాంతమున నానాథుడు ముద్దిడుటకు యోగ్యస్థానమై కాటుకచేనలంకరింపబడిననాకన్గవను ముద్దిడ, నాతనిమోవిపైనంటిన కాటుకను పరులుచూచెదరేమో యను భీతిచే, పలుమరు నాతనిమోవి తేనియనానుటయందాశక్తి జూపి ముద్దిడుటచే నాయంజనముచేనైన కళంకమును పోఁగొట్టితిని. అట్టి శుభమైనకాలము మరలనాకెప్పుడు సంప్రాప్తమగునోకదా.

శ్లో॥ త్వద్విశ్లేషానలనిలయనేమానసే మేప్రభూతా
న్సంకల్పాంస్తాన్నతివిషయకానుల్ముకానిజ్వలంతి
గాఢాశ్లేషప్రణయనవిధాలబ్ధసంప్రార్థితార్థా
చూర్ణీకర్తుంహిదయితయతేతేనివేద్యం కిమస్తి॥

చ॥ జలధర! నీకుఁజెప్పుటకు సందియమేమి? వియోగవహ్నికిన్
నిలయముగాఁగనామది జనించుచుబిట్టుగఁ బ్రజ్వలించిని

ప్రజ్వలవలెఁ గాల్చుచుండు స్మరభోగమనోరథపంక్తినీదు కౌ
గిళులనశింపఁ జేయుఁ గమకించితి నా దయితా... చెప్పుమా ॥ 36॥

అర్థము—దయిత=ఓప్రియుఁడా, త్వద్విశ్లేషానలనిలయనే= నీవిరహాగ్నికిస్థానమైన, మేమానసే=నామనస్సునందు, ప్రభూతాన్=పుట్టినట్టియు, జ్వలంతి=మండుచున్నట్టియు, ఉల్మకాని=కొరవులైనట్టియు, రతివిషయకాన్=సంభోగసంబంధులగు తాన్ తాన్ సంకల్పాన్=ఆయామనోరథములను, గాఢాశ్లేష......తార్థా గాఢాశ్లేష=గాఢాలింగనముయొక్క, ప్రణయన=చేయుటయొక్క, లబ్ధ=పొందబడిన, సంప్రార్థితార్థా= కోరికలుకలదానవై= చూర్ణీకర్తుం=పొడిచేయుటకొఱకు, ఆకొరవులనునశింపఁజేయుటకొఱకు, యత్నే=యత్నించుచున్నాను కావునయిటులని, తే=నీకు, (మేఘునికనుట) అనివేద్యం=చెప్పతగనిది, కిం=ఏమున్నది.

తా—విరహాగ్నిచే నెఱయుచున్న మనస్సునందు పుట్టి ప్రజ్వలించుచున్నని ప్పుకణికలవంటి యాసంభోగ సంకల్పములను నీ గాఢాలింగనముచే కృతార్థురాలనై నశింపజేయుటకై కోరుచున్నాను. మనమునకు సంతాపకరములగుటచే సంకల్పములకు నుల్ముకములకునుపమేయోపమేయభావము. చూర్ణీకరణమువలన కొరవులు నశింగ నట్లు నిన్నెడబాసినపుడు నామనమున గలిగెడికోర్కెలు సంతాపహేతువులు గాన, నీసంయోగముచె నాసంతాపమును నశింపజేయ నెంచితినని తనభర్తనుద్దేశించి మేఘునితో చెప్పెననుట. మాకుప్రాణదాతవగు మేఘమా! యీసందర్భమున నీతోచెప్పకూడనిదెద్దికలదు.

“సంకల్పాన్......ఉల్ముకాని” కాళిదాసుని యుత్తరమేఘమున॥ సంభోగంవాహృదయనిహితారంభమాస్వాదయంతీ (ఉ. మె. శ్లో 27) ఇత్యాది వాక్యములచే, తన ప్రియురాలిమనంబున నుద్భవించు ఆలింగనచుంబన విషయక మనోరథంబు లామెకు కాలయాపన కనుకూలించునని యక్షుండు మేఘునితోఁ జెప్పియున్నాడు. కాని అట్టి సంకల్పములు మనోరథమాత్రంబులే యగుటవలన, ప్రథమమున కాలయాపనకై యుద్దేశింపబడినను, తుదకామె కవియుల్ముకంబులవలె సంతాపజనకంబులైనవని తెలియజేయుచున్నదివలె నున్నది.

శ్లో॥ ప్రాణాస్స్యుశ్చేద్భవతి భవుకశ్రేణిసంవీక్షితేతి
జ్ఞాత్వా వాక్యం ప్రమితివిషయం చిన్తయన్తీ సమన్తాత్
త్వద్విశ్లేషోదితవిపులశుగ్ఝర్ఝరీ కృచ్ఛ్రకృచ్ఛ్రా
త్సోఢా భావీప్సితశుభధియా చక్రవాక్యేవ రాత్రిః॥

చ॥ బ్రతికినఁ బొందనయ్యెడు శుభంబులు పెక్కు లటంచు పెద్దలం
చితగతిఁ బల్కు బల్కులను చిత్తమునందలపోసి త్వద్వియో
గకతశుచోగ్రనిర్ఝరిని గష్టము చే సహియించి భావియీ
ప్సితములఁ గోరి రాత్రికయి వేచు రథాంగిని బోలియుంటిగా॥ ౩౭

అర్థము—ప్రాణాః=ప్రాణములు, స్యుశ్చేత్= ఉండినట్లయిన, భవుక శ్రేణీసంవీక్షితా= శుభపరంపరను పొందువాడు, భవతి= అగుచున్నాడు. ఇతి= ఈలాగనెడి, ప్రమితివిషయం= అనుభవవిషయమగు, వాక్యం= వాక్యమును, జ్ఞాత్వా= తెలిసికొని, సమన్తాత్=చాలమారము, చింతయంతీ=ఆలోచించినదానను, అభూత్=అయితిని, త్వద్విశ్లే......నిర్ఝరీ, త్వద్విశ్లేష=నిన్నెడబాయుటవలన, ఉదిత=సంభవించిన, విపుల=విస్తారమైన శుగ్ఝర్ఝరీ= దుఃఖప్రవాహము, భావీప్సిత శుభధియా= భావి= రాగల, ఈప్సిత= ఇష్టమైన, శుభ= సుఖములయందలి, ధియా=బుద్ధిచేతను, చక్రవాక్యా= చక్రవాకాంగనచేతను, రాత్రిరివ= రాత్రివలెనే, కృచ్ఛ్రకృచ్ఛ్రాత్= అతికష్టముచేత, సోఢా= సహింపబడినది.

తా—'జీవన్ భద్రాణిపశ్యతీ' యనునార్యోక్తి ననుభవమునకు తెచ్చుకొని భావిశుభముల నిరీక్షించుచూ, నీవియోగమువలన సంప్రాప్తంబైన నీవిపులంబగు దుఃఖప్రవాహమును చక్రవాకాంగన తనకు వియోగకారణంబగు రాత్రిని ప్రాతఃకాలమున తిరిగిసుఖముల బడయవచ్చు నను యాశచేనెట్లు గడపుచుండునో, యట్లే శాపావసానంబున భవత్సమాగమసుఖాశాబద్ధురాలనై, యతికష్టముచే తరింపనుంకించుచున్నాను.

'భవుకశ్రేణి సంవీక్షితా' వాల్మీకంబున సీతయాంజనేయులచే 'జీవన్ భద్రాణిపశ్యతి' అనున్యాయంబున నీపునస్సమాగమాశచే బ్రతికియుంటినని రామునకు సందేశము పంపినట్లు తెలియుచున్నది. అట్లనే యీయక్షాంగనయును, నట్టివా

ర్తనే పంపదలచినట్లును,యక్షుడు చెప్పినట్లాశాబంధమే వియోగమున స్త్రీలజీవితము నరికట్టుచున్నదనియు, నీమాటలవలన విశదమగుచున్నది. "చక్రవాక్యేవరాత్రిః" మేఘసందేశమున "మాకీభూతేమయిసహచరే చక్రవాకీమివైకాం" (ఉ. మే. 23) అని యక్షుడు నీయెయవస్థ నిట్లె తలచియున్నాడు.

శ్లో॥ జానీషేత్వంత నసవిదితం మామకంఛందవృత్తిం
జ్ఞాతేస్వీయాశయనిగదనం దీపవచ్చంద్రికాయాం
తస్మాత్ప్రాజ్యం వచనమిహనోవచ్మి కింతేనిగాద్యం
తుల్యావస్థాఖలుతే వచమేదైవక్లుప్తానితాంతం॥

చ॥ ఎఱుగుదువీవు సర్వమునికేమివచించెద నాదుచిత్తమే
వెఱిగినదేకదా యదియిప్పుడు చెప్పుట గవ్వెవెన్నెలన్
బఱపినయట్లు దైవగతివచ్చిన నీవిరహార్తిగుందుటి
ద్దఱికిసమానమౌట మదిదల్పుముచెప్పఁగ నింకు కేనియున్॥ ౩౬

అర్థము — త్వం=నీవు, జానీషే=ఎఱుగుదువు, మామకం=నాదైన, ఛందవృత్తం=మనోవ్యాపారము, తవ=నీకు, నవిదితం=తెలియకయుండునా, జ్ఞాతే=తెలియబడినదగుచుండగా, స్వీయాశయనిగదనం=తనయభిప్రాయముచెప్పుట, చంద్రికాయాం=వెన్నెలయందు, దీపవత్=దీపమువంటిది, తస్మాత్=అందువలన, ప్రాజ్యం=విస్తారముగా, వచనం =మాటను, ఇహ = ఇప్పుడు, నోవచ్మి = చెప్పను, తే = నీకు, నిగాద్యం = చెప్పదగినది, కిం = ఏమున్నది, నితాంతః = మిక్కిలి, తే = నీకునూ, మె = నాకునూ, తుల్యా = సమానమైన, అవస్థా=దశ, దైవక్లుప్తా=దైవముచేఁ జేయబడినది.

తా — సర్వము నెఱింగిన నీకు నామనోవృత్తము మఱలదెలియజెప్పుట వెన్నెలలోదీపంబిడినయట్లు విఫలమేగాన నింకనేజెప్పదగినదెద్దియు గానరాదు. దైవయోగమున ప్రాప్తించిన నీవియోగమున మనమిరువురము సమానదుఃఖమునే యనుభవించుచు సమానాభిప్రాయములుగల వారమగుటచే నేచెప్పవలసినదేమున్నది. "మామకంఛందవృత్తంనవిదితంకిం" అని చెప్పుట యక్షుడు మేఘునితో "నిశ్వా

సానాం అతిశీర్ణతయా ఛిన్నవర్ణాధరోష్ఠం '' ఇత్యాదికముచే తనప్రియురాలి రూపా నేకమును ' సంభోగంవాహ్యాదయనిహితా రంభమాస్వాదయంతీ ' త్యాదికముచే నా మెభావాదికమును తనమనోనేత్రంబున గుర్తెఱింగినవానివోలె నాయాదశలనూహచే వర్ణించిచెప్పి ప్రియురాలికి జీవితాశగల్పించుటకై వానినిపంపగా, నట్టివానికి నిజము గాతదవస్థకే పాల్పడియున్న నిజెతనస్థితిని తిరిగిచెప్పుటయనవసరమనిచెప్పుచున్నది.

శ్లో॥ నీహారాత్రౌగతవతివనీ క్రీతచూజా ప్రసంగం
గ్రీష్మేఽతీతేతదనువరటా మానసంసార సేశం
ఘస్రేఽతీతేకుముదినీకైరవా ప్తంయథాహం
శాపస్యాంతేత్వదభిగమనం కామయేదుర్బలాత్మా॥

చ॥ వనసతీమంచుకాలమెడఁబాసివసంతునిగోరునట్లుగా
చనగను గ్రీష్మమావరట చయ్యనమానసమేగునట్లుగా
దినముగతింపఁగాఁగలువతీగెశశాంకునిగోరినట్లు నే
నునుజనశాపకాలమునినుంగననెంచెదదుర్బలాత్మనై॥ ౩౯॥

అర్థము — నీహారాత్రౌ = హేమంతఋతువు, గతవతి = వెళ్ళినదగుచుండగ, వనీ = వనము, క్రీతనూజా ప్రసంగఁ = మన్మథునకుస్నేహితుడైన వసంతుని సంబంధమును. గ్రీష్మే = గ్రీష్మకాలము, అతీతే=గడచినదగుచుండఁగా, తదను=వర్ష కాలమందు, వరటా=హంసాంగన సారశేశం=సరశ్రేష్టమగు, మానసం=మానస సరస్సునున్నూ, ఘస్రే=పగలు, అతీతే=గడచినదగుచుండగా, కుముదినీ=కలువ తీగె, కైరవాప్తం=చంద్రునిన్ని, యథాఖలు=వివిధముగానో, అప్రకారముగానే, దుర్బలాత్మా=కృశించిన, అహం=నేను, శాపస్యాంతే=శాపావసానమున, త్వద భిగమనం=నీరాకను, కామయే=కోరుచున్నాను.

తా — ఆమరాలుకాలమందు కృశించినవని వసంతకాలమును, గ్రీష్మముగడ చినదగుచుండఁగా వర్షకాలమున హంసమానససరస్సునున్ను పగలుకాంతిహీనమైయు న్న కలువతీగె, రాత్రిరి చంద్రుని యాశించినట్లును, శాపాంతమున నీసంయోగము నాశించియున్నదానను. వర్షకాలమందు హంసలకు, ఇతరప్రదేశముల వర్షపునీరు రోగహేతువుగాన మానస సరోవరమునకేగునని ప్రసిద్ధి.

శ్లో॥ మద్వాక్యేన ప్రియసహచరం మత్ప్రణామాళిపూర్వం
క్షిప్రంగత్వా కథయతమిహోజ్జీవయాతిప్రయత్నాత్
పశ్చాద్వర్షాచలనయనయాభుక్తయాభూరికాలా
త్సంగమ్యేష్టాన్యనుభవశుభాన్యద్యవత్సప్రయాహి॥

చ॥ ఘనచనుమా వడిన్ పతిని గాంచుము చెప్పుము ముందు సాధువం
దనముల యత్నపూర్వకమునన్ బ్రతికింపుము నాదు మాటచే
చని గనువర్షకాలమను చానను గూడియు సౌఖ్యమందుమీ
తనయసుఖంబులంగని ముదంబును బొందుము పొమ్ము వేగమే॥ ౭౦॥

అర్థము—మద్వాక్యేన = నామాటచేతను, ప్రియసహచరం = నాభర్తను, మత్ప్రణామాళి పూర్వం = నానమస్కారపరంపర పూర్వమందుగలుగునట్లు, నమస్కారపూర్వకముగ, క్షిప్రం = శీఘ్రముగా, గత్వా = వెళ్ళి, కథయ = చెప్పుమా, తం = ఆ నాభర్తను, అతిప్రయత్నాత్ = మిక్కిలియత్నమువలన, ఇహ = ఇప్పుడు, ఉజ్జీవయ = బ్రతికింపుమా. పశ్చాత్ = అనంతరమందు, వత్స = ఓమేఘుడా, భూరికాలాత్ = చాలకాలముక్రిందట, భుక్తయా = అనుభవింపఁబడిన, వర్షాచలనయనయా = వర్షా = వర్షకాలమనెడి, చలనయనయా = స్త్రీతో, సంగమ్య = కలుసుకొని, ఇష్టానిశుభాని = ఇష్టములైన శుభములను, అనుభవ = అనుభవింపుమా. అద్య = ఇప్పుడే, ప్రయాహి = వెళ్లుమా.

తా—ఓమేఘుడా! నీవా యక్షుని జూచి ముందుగా నానమస్కారములఁ జెప్పి నేనింతకుమున్ను నీతోఁ జెప్పిన రహస్యములై విశ్వాసార్హములైన వాక్యములను, వియోగావస్థయందు కృశించినవాని రూపాదులమనమున భావించినప్పుడెల్ల నేఁ జెందు దుఃఖమునున్నా (అనగా = మదూప్రాణా “యక్షాధీశప్రహితభేషజః” ఇత్యాది శ్లోకాభిప్రాయమను) శీఘ్రముగా నాప్రియునికి విశదపఱచి మూర్ఛిల్లినవానిని బ్రతికింపుము. అనంతరము మాకుపకారమొనర్చుటకుగా చిరకాలమునుండి నిన్నెడబాసిన వర్షాంగనను గూడి సర్వదా సుఖించుచుండుము. సత్వరంబుగ జనుము.

“ఉజ్జీవయాతిప్రయత్నాత్” మేఘుడు చెప్పినట్లింతకుమున్నె యున్మాదావస్థజెందియున్న యక్షుడు వర్షాకాలము వియోగులకు మృత్యుపదంబగుటచే, మా

వ్యాద్యవస్థలఁ జెందియుండునని తలఁచి, తనక్షేమవృత్తాంతము నుపదేపదే చెప్పి యెక్కైన మూర్ఛతొలగించి ధైర్యముకలవానిగాఁ జేయుమని చెప్పుచున్నది, "వర్షాచల నయనయా...సంగమ్య" పరదేవత, మేము పూర్వజన్మమున దంపతుల నెడబాపుటచే నిట్టి దుఃఖము సంప్రాప్తమైనట్లు చెప్పినది గావున నిపుడు మాకుపకారమునకై నీభార్య నెడబాసితివి గాన నట్టిదోషము మఱల మాకు సంప్రాప్తింపకుండునటులను, మఱియు నీవియోగావస్థయందు నేననుభవించు దుఃఖము నిన్ను విడచియున్న పర్యాంగ కైన లేకుండునట్లుగను, నీవు శీఘ్రమె పోయి యామెను కలుసుకొమ్మని. త్వరపెట్టుచున్నది, " శుభాన్యనుభవ, వత్స " ఇత్యాదివాక్యములచే తనకు ప్రాణదానమొసంగుటచే నా మేఘుని పుత్రునిగాఁ దలచి యాశీర్వాదమొనర్చుచు తనవృత్తాంతము నుపసంహరించుచున్నది.

శ్లో॥ ఇత్యుక్త్వాతం ప్రియతమసఖం సాధుసమ్మాన్య రత్నై
ర్విద్యుద్యోషారుచికరపదైర్విస్మయాధానదక్షైః
సఖ్యాసాకం ప్రముదితమనాః పూర్వవద్రమ్యవృత్తా
కాష్ఠాః కల్పానివచగమయ న్నేవతస్థౌ ప్రహృష్టా॥

చ॥ పలుకుచు భర్తృమిత్రుఁడగు వారిదుఁ గూర్చి ప్రియంబుసల్లు చం
చలయను కాంతకచ్చెరువు సల్పెడు వస్తువు లిచ్చి కాన్కగా
జెలఁగుచు నాళితోఁ గలసి, చిత్తమునన్ నిముసంబు కల్పమై
వలగొన రమ్యవృత్తయయి, భాసిలె పూర్వపురీతి నొప్పుగన్॥ ౪౧॥

అర్థము —ఇతి=ఈలాగున, ప్రియతమసఖం= తనభర్తకు స్నేహితుడైన, తం=ఆ మేఘునిగూర్చి, ఉక్త్వా=చెప్పి, విద్యుద్యోషారుచికరపదైః, విద్యుద్యోషా= మెఱుపనెడిస్త్రీకి, రుచికరపదైః=సంతోషకరములైనట్టియు, విస్మయాధానదక్షైః= ఆశ్చర్యమును పుట్టించుటయందు సమర్థములైనట్టియు, రత్నైః = శ్రేష్ఠవస్తువులచే తను, సాధు=బాగుగా, సమ్మాన్య=గౌరవించి, సఖ్యాసాకం=తనచెలికత్తెతోకూడా, ప్రముదితమనాః= సంతోషించినమనస్సుకలదై, పూర్వవత్=మునుపటివలెనే, రమ్యవృత్తా=సత్కాలక్షేపముగలదై, కాష్ఠాః=అల్పకాలమును, కల్పానివ=కల్ప

ములవలె, గమయంతీ=గడుపుచున్నదై, పరిహృష్టభావా= సంతోషము కలదైవదాస్సీ, తస్థౌ=ఉండెను.

తా—ఈవిధముగా మేఘునితోఁ జెప్పి మె ఱుపు నెడియతనసహచరిని సిగుతుయా శ్చర్యజనకములగు కానుకలచేబహుమానించి, తనభర్త వృత్తాంతము దెలిపె నాయుని తనచెలికత్తియతోఁగూడిసంతసించి, మునుపటివలెనే పరదేశతాపూజకల్పుచు నిచు సమొకకల్పముగ గడపుచు సంతోషముకలదానివలెనే యుండెను.

''విద్యు......పదైః సమ్మాన్య'' మేఘుడుతన సహచరియగు మెఱుపుతో కూడజనినట్లు ''విద్యుద్దామస్ఫురితచకితైః'' (పూ. మె. 39) ఇత్యాదులచె తెలియు చున్నది. కావుననిచ్చట నీయక్షాంగన సమీపమందున్న మేఘునిసహచరియగు నాతి ద్యుద్యోషను సత్కరించినట్లును, వెనుకటి 40 వ శ్లోకమునచెప్పిన వస్తాచలనయన అదియింకనూ ఆషాఢమాస మేగనుక వర్షఋతువురాకుండుటచే దూరమందుండెనాప్ర న శీఘ్రముగాబోయికలసి సుఖించుమనియు చెప్పినట్లును స్పష్టమగుచున్నది.

శ్లో॥ యక్షామోదోదయకరకథాలాభసంతుష్టచేతా
స్తత్సమ్మానాచ్ఛశభృదుదయాదుత్కటానందవార్ధిః
స్వప్రస్థానోచితసుమహితామంత్రిణాం కాంతవర్ణం
కుర్వాణోయంజలభృదకరోద్గర్జితంవర్జితాధిః॥

చ॥ ఘనుఁడాయక్షుదావహంబయిన వాక్యార్థము దంబంది త
ద్వనితాదత్తబహూకృతోదు పలసత్సంతోషవార్ధిఁడై
వినియక్షాంగనసచ్చరిత్రముమదిన్ బ్రేమించియాదేవిచే
జనఁగానాజ్ఞనుగోరినట్టు లొకగర్జంజేసె శ్రావ్యంబుగాఁ॥ ౧౨౨॥

అర్థము—యక్షా.........చేతాః, యక్ష=యక్షునకు, ఆమోదోదయకర= సంతోషకరమైన, కథ=వృత్తాంతముయొక్క, లాభ=ప్రాప్తిచే, సంతుష్ట=సంతో షించిన, చేతాః=మనస్సుగలిగినట్టియు, తత్సమ్మానాత్=ఆయక్షకాంతజేసినబహు మానమునెడు, శశభృదుదయాత్=చంద్రోదయమువలన, ఉత్కటానందవార్ధిః= ఉప్పొంగినసంతోషసముద్రముగలవాడునగు, అయంజలభృత్=ఈమేఘుడు, వర్జితా

ధీః=సుకృత్ప్రత్తశ్రీగణరూపమనోవ్యథలేనివాడై, స్వప్రస్థాన= తనబయలుదేరుటకు, ఉచితే=యోగ్యమై, సుమహితే=ఒప్పుచున్న, ఆమంత్రణం= సెలవుకొనుటవిషయముగు, కాంతవక్త్రం=మంచివాక్కును, కుర్వాణం= చేయుచున్నవానివలె, గర్జితం= గర్జనమును, అకరోత్=చేసెను.

తా—యక్షాంగన సంతోషకరమగు వార్తలభించుటచేతను, యక్షకాంతయొసర్చిన సన్మానమునను, మిగులసంతసించినవాడై మేఘుడు, తానుబయలుదేరునపుడు సెలవుపుచ్చుకొను వాక్యమాయనన్నట్లు గర్జనముచేసెను. ఇచ్చట మేఘునికి స్వాభావికమగు గర్జనము యక్షకాంతవలన ననుజ్ఞపుచ్చుకొను వాక్యమువలె నుత్ప్రేక్షింపఁబడెను.

శ్లో॥ తత్ప్రాగుక్తాయనగతివశస్తత్రతత్రాతిచిత్రా
ణ్యాతన్వానోంబకవిషయతాంతద్వితీయాగుణౌఘాన్
తత్సంపత్తింమనసికలయంశ్చిత్రకూటంసమేత్యా
ద్రాక్షీద్యక్షంవిరహకృశతాక్షిప్తబాలేందుపక్షం॥

చ॥ మును పాయక్షుఁడు సెప్పుమార్గమున నేఁపొల్పొందఁగాఁబోవుచున్
గనుపట్టు చిత్రములందు యక్షయువతీకళ్యాణ చారిత్రముల్
ధనసంపత్తియుఁలోఁదలంచు చుఁబడిఁ దా చిత్రకూటంబునన్
గనె బాలేందుని రీతి యక్షు విరహాగ్రస్తుఁ గృశున్ సుందరున్॥ ౮౩

అర్థము—తత్ప్రాగు......వశః తత్=ఆయక్షునిచేత, ప్రాగుక్త=పూర్వమందు చెప్పబడిన, అయన=మార్గమందు, గతి=నడకకు, వశః=వశుడై, తత్రతత్ర= అక్కడక్కడను, అతిచిత్రాణి=విశేషములగు చమత్కారములను అంబకవిషయతాం= దృగ్గోచరమును, ఆతన్వానః=చేయుచున్నవాడై తద్వితీయాగుణౌఘాన్= ఆయక్షభార్యగుణసమూహములను, తత్సంపత్తిం= వారిసంపదను, మనసి=మనస్సునందు, కలయన్= తలఁచుకొనుచు, చిత్రకూటం—ఆచిత్రకూటపర్వతమును, సమేత్య=పొంది, విరహ......పక్షం, విరహముచేతనైన, కృశత, కృశత్వముచేత అక్షిప్త=తిరస్కరింపబడిన, బాలేందుపక్షం= బాలచంద్రునిరీతి గలిగినట్టి, యక్షం= ఆయక్షుని, అద్రాక్షీత్=చూచెను.

తా—పూర్వమున నాయక్షునిచే 'మార్గంతావచ్ఛృణుకథయత:' ఇత్యాది శ్లోకములఁ జెప్పబడిన మార్గమునుబట్టి పరిశ్రమము నతొందరచే వచ్చియుండుటచే చూచుటకువీలులేక విడువఁబడిన యాయాచమత్కారముల నిప్పుడు సావకాశముగ జూచుచున్నవాఁడై, యాయక్షభార్యగుణాతిశయమును, సంపత్సమృద్ధిని మనమున శంకించుచూ చిత్రకూటపర్వతముఁజేరి బాలచంద్రునివలె కృశించియున్న నందము నాయక్షుని యాకారమును జూచెను.

శ్లో॥ క్లాంతంవృష్టేరననుగమత స్తద్వియోగేనకామం
సస్యక్షేత్రంబిసమివరవిద్యోతసన్తాపితాంగం
గర్తేస్ఫీతేనిపతితమివక్షీబమాతంగనాథం
సత్త్వోద్రేకక్షయకరజరాశ్లిష్టకంఠీరవాభం॥

చ॥ వానలు లేమివాఁడి చనుపైరులఁబోలి, గభస్తివేడిమిన్
మ్లానతగాంచినట్టి బిసమా యనశుష్కతగాంచి, యోదమున్
గానకకూలినట్టి కరినాథునిరీతి కృశించివృద్ధతన్
హీనబలప్రభావమయి యేపునశించుమృగేంద్రుఁడో యనన్॥ ౪౮

అర్థము—వృష్టేః=వర్షముయొక్క, అననుగమతః= లేకుండుటవలన, తద్వియోగేన=ఆవియోగమువలన, కామం=బాగుగ, క్లాంతం=వాడిన, సస్యక్షేత్రం= పైరువలెను, రవి........తాంగం, రవి=సూర్యునియొక్క, ద్యోత=కాంతిచేతను, సంతాపితాంగం=వాడిపోయిన స్వరూపముగల, బిసమివ = తామరతూడువలెను, స్ఫీతే=గొప్పదియగు, గర్తే=గోతియందు, నిపతితం=పడిన, క్షీబమాతంగనాథం= మదపుటేనుగువలెనున్నా, సత్వ=బలముయొక్క, ఉద్రేక=అతిశయమునకు, క్షయకర=నాశకరమైన, జర=ముసలితనముతో, ఆశ్లిష్ట=కూడుకొనిన, కంఠీరవాభం= సింహమువలెనున్నవానిని, అద్రాక్షీత్ అనిపైకి యన్వయము ఇవియక్షునికి విశేషణములు.

తా—మేఘుడు వెళ్ళిచూచునప్పటి కాయక్షుడు, వర్షములేక ఎండిన పొలమువలెను, ఎండచేవాడిన తామరతూటివలెను, ఓద (ఏనుగులనుపట్టుటకు గొయ్యి)

ఘంచుదసఱ్ఱాకిన మదపుఱేనుగువలెను ముసలితనముచే బలహీనసమగు సింహముజలె నున్నవాడు.

శ్లో॥ లోపాముద్రాసహచరకరగ్రస్తపాథోనిధానం
బాణాశ్రేణీశరణకరణాక్షిప్తకల్మాషకాయం
నీలాంభోభృచ్ఛకలవికలద్యోతపీయూషపాదం
రాహుస్పర్శాదివనిహతగోవిభ్రమంపద్మబంధుం॥

చ॥ కలశజహస్తసంగ్రథితకంధినిబోలి, వినీలకాంతిసం
కలితపయోదఖండములు గ్రమ్మినచందురుబోలిరాహు దం
ష్ట్రలజగిబాయునష్టకిరణంబులుగలిగినసూర్యుబోలియు౯
నిలుగునఁగంటకావనివసించెను మానినమానజింతచే౯ ౪౩

అర్థము—లోపాముద్రా........నిధానం, లోపాముద్రాసహచర=అగస్త్యమహామునియొక్క, కర=హస్తముచేత, గ్రస్త=గ్రహింపబడిన, పాథోనిధానం=సముద్రమువలెనున్నవాడును, బాణాశ్రేణీ........కాయం, బాణాశ్రేణీ=ముళ్లచెట్లవరుసకు, శరణ=ఉనికిపట్టయిన, కరణ=క్షేత్రమందు, ఆక్షిప్త=ఉంచబడినవిగపుకనే, కల్మాష=మలినమైన, కాయం=శరీరముకలవాడును, నీలాంభో...పాదం, నీలాంభోభృత్=నల్లమబ్బులయొక్క, శకల=ఖండములచేతను, వికల=వికారయుక్తమైన, ద్యోత=కాంతిగలిగిన, పీయూషపాదం=చంద్రునివలెనున్నవాడును, రాహుస్పర్శాత్=గ్రహణమువలన, నిహత=పోయిన, గోవిభ్రమం=కిరణములవిలాసముగల, పద్మబంధుం=సూర్యునివలెనున్నవాడును.

తా—విరహబాధచేనాయత్నుడు, అగస్త్యచులుక గతుడైనసముద్రునివలెచిక్కినవాడును, ఉన్మాదావస్థయందుకంటకప్రదేశముల పరుండుటచేమలినమైనశరీరముకలవాడును, నల్లనిచిన్నచిన్నమబ్బులచే క్రమ్మకొనబడినవాడై ప్రకాశముతగ్గినచంద్రునివలెనున్నవాడును, గ్రహణసమయమున కాంతిశూన్యుడగు సూర్యునివలెనున్నవాడు.

శ్లో॥ వన్యానూర్గాగమనచకణా లగ్నతత్కంటకాళిం
నానాభూమీశయనజకిణ శ్రేణికాదంతురాంగం

ప్రాతశ్చోరాపహృతసకల శ్రీరాకాశశాంకా
వస్థాపన్నం శిశిరహృతతత్పత్ర జాతంయథాగం॥

చ॥ వనులనమార్గసంచరణ, బాధములందగబడ్డమంఘ్రిభూ
మినిపడిదొర్లుటన్ మిప్పుల, మేనునఁగాఁచిన కాయలుంటచే
గనలినహాని, సత్కళలఁ, గల్పహరించిన చంద్రుమకై వడిన్
గనుగొనెనాకురాలిన, నగంబనయక్షుని మేఘుఁడచ్చటన్॥ ౮౬

అర్థము—వన్యా......కాళిం, వన్యా=అడవియందైన, అమార్గ= మార్గము లేనిచోట్లను, ఆగమన=నడుచుటచే, చరణాలగ్న=పాదములయందు గ్రుచ్చుకొనిన, తత్కంటకాళిం=ఆయడవిముళ్ళు కలవాడును నానాభూమి=వివిధప్రదేశములు, శయన=పరుండుటవలన జ=పుట్టిన, కిణ=కాయలయొక్క, శ్రేణికా=వరుసచే, వంతుర=ఎచ్చుతగ్గైన, అంగం= శరీరము కలవాడును. ప్రాతః...వస్థం, ప్రాతః=ప్రాతఃకాలమనెడు, చోర=దొంగచేత, అపహృత=అపహరింపఁబడిన, సకలశ్రీక=కళలనెడు సంపత్తుతో గూడిన, రాకాశశాంక=పూర్ణచంద్రునియొక్క, అవస్థాపన్నం=దశను పొందినవాడును, శిశిరహృత=శిశిరఋతువునందు రాల్పఁబడిన, తత్పత్రజాతం= ఆయాకులగుంపు గలిగిన, అగంయథా= చెట్టువలె నున్నవాడును

తా—మఱియు నుస్మాద్రవశంబున యడవియందు త్రోవలేనిచోట్ల సంచరించుటచే కంటకపీడితములగు పాదములు గలిగినట్టియు, నచ్చటచ్చటమార్గముచే శిలాప్రదేశములపడి పొర్లాడుటచేనుబ్బి కాయలుకాచిన శరీరము గలినట్టియు, ప్రాతఃకాలమున కాంతి రహితమైన పూర్ణచంద్రునివలెను ఆకురాలు కాలమందలి వృక్షమువలెనున్న నాయక్షునిజూచెను.

శ్లో॥ పశ్యన్నేవంవ్యతనుతమతౌ చింతయాసంవృతాత్మా
సోయంశక్రస్యచవరవధూరస్యతద్వోషితశ్చ
భోగాస్వాదక్రమనిగదనేశక్తరూపప్రబోధా
దుష్టావస్థాబతహతవిధేరాగతాచైతయోర్హా॥

చ॥ జలధరుఁడుయక్షుఁగాంచియిటు స్వాంతమునందల పోసెయక్షుఁడా
బలపరిపంధిభాగ్యమును వానిసతీమణి యింద్రురాణికిన్
గలిగినరూపసంపద సుఖంబులఁదెల్పఁగఁ జాలువారికిన్
గలిగెను దైవయోగమున గష్టములంచుఁ గలంగి నెమ్మదిన్॥ ౪౭

అర్థము—పశ్యన్=చూచుచునే, చింతయా=దుఃఖమును, సంవృతాత్మా=కూడుకొనినవాఁడగు మేఘుడు, మతౌ=బుద్ధియందు, ఏవం= ఈచెప్పబోవు ప్రకారము, వ్యతనుత = చేసెను (తలచెననుట) సోయం=అట్టి ఈ యక్షుడు, శక్రస్య చ=దేవేంద్రునియొక్కయు, అస్య=ఈయక్షునియొక్క,వరవధూః=భార్య, తద్యోషితశ్చ=ఆయింద్రునిభార్యయగు శచీదేవియొక్కయు, భోగాస్వాదక్రమనిగదనే, భోగ=అనుభవములయొక్క, ఆస్వాద=రుచియొక్క, క్రమ=రీతిని, నిగదనే=చెప్పుటయందు, శక్త=సమర్థమైన, రూప=సౌందర్యమును, పరిబోధా=జ్ఞానమునుకలవారుగానున్నారు, హతవిధేః=దౌర్భాగ్యము వలన, ఏతయోః=వీరికి, దుష్టావస్థా=దుర్దశ, అగతా హాబత=అయ్యోవచ్చెగదా!

తా—అట్టియక్షునిజూచుచునే, ఓహో! యీయక్షుడు నీయక్షాంగనయు, నింద్రునియొక్కయుశచీదేవియొక్కయు భోగసంపత్తుయొక్క యనుభవంబిట్టిదిగదా యని తెలియఁజేయు సామర్థ్యముగల సౌందర్యభోగములగలవారు. ఆహాఇట్టివారికిని ఎట్టిదురవస్థ సంభవించెనని మేఘుఁడు తనలోతాను చింతించెననితాత్పర్యము.

శ్లో॥ వృంతస్స్రోతోఽప్యకురుత మహార్ద్రప్రసూనాం చితాయాం
తచ్ఛాయాయాం ప్రచురతరతత్కంటకానీతబాధాం
సంప్రత్యేతౌ కఠినవిషమక్షోణిదేశే శయాతే
కింవా కార్యం స్వవిరచితదుష్కర్మణి ప్రాణిజాతే॥

చ॥ తలిరులశయ్యవృంతములతాకునకోర్వక పూర్వమెంతయున్
గలఁతను జెందువారిపుడనారతమీకఠినంపు నేలపై
నలుగులబోలుముండులన, నాస్తరణంబుగఁ బండిగుందఁగా
వలసెను జంతుసంతతికి వార్యము గాదె పురాకృతంబిలన్॥ ౪౮

అర్థము—మహార్హ=మిక్కిలివిలువగల, ప్రసూన=పుష్పములచే, అంచిత=ఒప్పుచున్న, తచ్ఛయ్యాయాం= వారిపక్కయందు, వృంతస్పర్శోపి= తొడిమెతాకుటయును, ప్రచుర........సితబాధాం, పరిమరతర = మిక్కిలిఅధికమైన, తత్కంటకా = అముల్లచే, అనీతిబాధాం = చేయబడినబాధను, అసురత = చేసెనో సంప్రతి = ఇప్పుడు, ఏతౌ = అట్టివీరిద్దరు, కఠిన = కఠినమై, విషమ = ఎచ్చుతగ్గైన, క్షోణిదేశే = భూప్రదేశమున, శయాతే = శయనించుచున్నవారు. ప్రాణిజాతే = జంతుసమూహము, స్వవిరచితదుష్కర్మణి = తనచేఁజేయఁబడినదుష్కర్మకలదగుచునుండగా, కింవాకార్యం = ఏమిచేయతగినది.

తా—శాపమునకు పూర్వము వీరుమిగుల సమ్యంబైన్యమునైనపూలసెజ్జయందుశయనింప తొడిమెతాకును గూడ వీరిశరీరము సహింపలేకపోయెను. అట్టివీరిప్పుడు నిమ్నోన్నతమగు కఠికనేలల శయనింపనలసివచ్చెగదా! లోకమున జంతువులు తాముచేసిన కర్మంబనుభవింపకతీరదుగదాయని మేఘుడు వీరినిగూర్చి విచారపడెను.

శ్లో॥ ధాతాప్యాసీద్విదళితశిరా భిక్షుకస్సోళికాక్షః
పద్మాక్షోపి శ్రితబహుతరాకారగర్భాధివాసః
సర్వంచైతత్స్వవిరచితదుష్కర్మణాంసిద్ధరూపం
తత్సాన్యాన్నా హంకిముసమయితోవృద్ధ్యవృద్ధ్యోర్విపాత్రం॥

చ॥ నలువశిరంబుఁగోయఁబడిరాఁడుకపర్దికిబిక్షమెత్తఁగా
వలసెజనార్దనుండుపలుబాములనెత్తనలేకగర్భసం
కలనముఁజెందెపూర్వకృతకర్మఫలంబివినేనుహెచ్చుతగ్గులకునులోనుగానో భువిఁగాలవశంబనఁజిత్రమేమిటన్! ౪౯

అర్థము—ధాతాపి=బ్రహ్మయునూన్నా, విదళిత=ఛేదింపబడిన, శిరాః=శిరస్సుగలవాడు, ఆసీత్—అయెను. సః=అళికాక్షః=అయీశ్వరుడును, భిక్షుకః అభూత్=బిచ్చమెత్తువాడాయెను. పద్మాక్షోపి=విష్ణువుగూడ, శ్రిత=ఆశ్రయింపఁబడిన, బహుతరాకార=అనేకావతారములయందు, గర్భాధివాసఃఅభూత్=గర్భమందువసించినవాడాయెను. ఏతత్=ఈ, సర్వంచ=సమస్తమును, విరచితదుష్క-

ర్మణాం=(పూర్వజన్మమందు) చేయబడిన పాపములయొక్క, సిద్ధిరూపం=పరిణామము స్యాత్=అగుచున్నది అహం=నేను, సమయతః=కాలవశమువలన, వృద్ధ్యోః= హెచ్చుతగ్గులకు, పాత్రల=భాజనము నకిముహి=అగుచుండుట లేదా ఏమి

తా—పూర్వము బ్రహ్మదేవుడనృత మాడుటచే యపూజ్యుఁడైనట్లును, తల గొట్టబడినట్లును, బ్రహ్మశిరంబు ఖండించిన యీశ్వరుడు భిక్షుకుడైనట్లును, భృగుమహర్షి శాపంబున నవతారాంతరములయందు గర్భవాసదుఃఖము పొందినట్లును, పురాణప్రసిద్ధములు గావునఁ సృష్టిస్థితిలయాధికారులైన మమ్మూర్తులంతటివారికిని దురత్యయంబగు దుష్కర్మము సామాన్యుల పరిభవింపకమానదు. కాలవిశేషముచేతనట్టి వికాస సంకోచములకు మేఘుడునూ పాతుడగుచున్నవాఁడే వర్షాకాలమున పూర్ణుడైయుండి, శరత్కాలమున గౌరవహీనుడై నామమాత్రావశేషుడగుట లోకప్రసిద్ధము.

శ్లో॥ ఏవంమత్వానిజవిలసనోత్ఫుల్లజాతిప్రసూన
వ్యాజాత్సంపాదితమృదుహాసశ్రీవిరాజన్ముఖేందుః
గంభీరేణ స్తనితవచసా భవ్యపాత్రింవధూటీ
భావత్కీతిస్ఫుటమకథయద్రామమేఘ వాఙజ నీయః॥

చ॥ తలచుచునిట్లు నెజపద దర్శనవిస్ఫుటజాజిదంభ సం
కలితమృదుస్మితాననవిఖండిత శీతమయూఖతిగ్మఁడై
జలదముగర్జవాక్కులను, సౌఖ్యమెనీసతిశంచుఁ బ్రేమచే
పలికెనురామచంద్రునకు భావనిపల్కినయట్టులిమ్ముగన్॥ ౫౦

అర్థము—ఏవం=ఈప్రకారముగా, మత్వా=తలఁచి, నిజ......వ్యాజాత్ నిజ=తనయొక్క, విలసన=ప్రకాశముచేతను, ఉత్ఫుల్ల=వికసించిన, జాతిప్రసూన=జాజిపువ్వులయొక్క, వ్యాజాత్=మిషవలన, సంపాది......ముఖేందుః, సంపాదిత=చేయబడిన, మృదుహాసశ్రీ=మందహాసలక్ష్మిచేతను, విరాజత్=ప్రకాశించుచున్న, ముఖేందుః=ముఖచంద్రుడు కలవాఁడై, యామేఘుడు, గంభీరేణ=మంద్రమైన, స్తనితవచసా=ఉరుమనెడివాక్కుచేతను, భావత్క=నీదైన, వధూటీ=స్త్రీ, నీభార్యయనుట, భవ్యపాత్రం=శుభములకుస్థానమై, భవతి=అగుచున్నది.

ఇతి=ఈలాగునని, ఆంజనేయః=హనుమంతుడు రామమివ=రామునిగూర్చినలెనే, అ=అత్యంతము, స్ఫుటం=స్పష్టముగా, అకథయత్=పలికెను.

తా—ఈప్రకాశము, వర్షకాలమందు వికసించిన జాజిపూవులనెడి నవ్వుచే విలాసముగల ముఖచంద్రుడు గలవాడై, యామేఘుఁడు గంభీరములగు యురుము లనెడి వాక్యములచే నీసతిక్షేమవతియని, హనుమంతుడు రామునకువలెనే యాయ క్షునకు మిక్కిలి స్పష్టముగా చెప్పెను.

శ్లో॥ వ్యాకోచత్వోపహితసుషమా విభ్రమేణేవపద్మం
వాసంతాప్త్యాసితకరఇవప్రాంసుచంద్రోదయేన
యాదోనాథఇవప్రియసుహృదాజీవనాధానకర్త్రా
శ్రుత్వావార్తామమృతమధురాం కామపిప్రాపశోభాం॥

చ॥ వికసనమంది కాంతితతి, విభ్రమమూనినసారసంబ నా
బ్రికటముగావసంతమిల, భాసిలుసోముసిరీతిసోము రా
కకువడిఁబొంగుసంద్రమనఁగాఁదగె, జీవనదోక్తిసత్సుధా
నికరముయక్షుశోత్రముల, నిండఁగమెండగుశోభలూరఁగన్॥ ౫౧

అర్థము—వ్యాకోచ......విభ్రమేణ, వ్యాకోచత్వ=వికసించుటచే, ఉపహిత=కూర్పబడిన, సుషమావిభ్రమేణ=కాంతివిలాసముచేత, పద్మమివ=పద్మమువలెను, వాసంతాప్త్యా=వసంతఋతుప్రాప్తిచేత, సితకరఇవ=చంద్రునివలెను, ప్రాంశుచంద్రోదయేన=పూర్ణచంద్రోదయము వలన యాదోనాథ ఇవ=సముద్రునివలెను, జీవనాధానకర్త్రా=ప్రాణధారణను చేయునట్టి (ఉదకమునిచ్చువాడగు మేఘుడనియు) ప్రియసుహృదా=ప్రియస్నేహితుడైన యామేఘునివలన అమృతమధురాం=అమృతమువలె మధురమైనట్టి వార్తాం=వృత్తాంతమును, శ్రుత్వా=విని, కామపి=అనిర్వాచ్యమైన, శోభా=శోభను, ప్రాప=పొందెను.

తా—తనకుజీవనదానం బొసగిన ప్రియస్నేహితుడగు మేఘునివలన నమృతసమానమగు వార్తనువిని యాయక్షుడు, వికసించుటచే శోభతోగూడిన పద్మమువలెను, వసంతాగమముచే చంద్రునివలెను, పూర్ణచంద్రోదయమున సముద్రమువ

లెను చెప్పవలవిగాని శోభనుపొందెను. ప్రియురాలి శుభవర్తమానము వినుటచే నియోగముచే కృశించినయాతనికి మరల, శోభకలిగెనని తాత్పర్యము.

శ్లో॥ క్షేమోదన్త శ్రవణజనితానందవారాశిమగ్న
స్తత్సంలగ్నాశయ ఇవకలామాత్రము త్తిష్ఠమానః
సమ్మోదోద్యద్వికృతివిలసద్భాషితః కింకిమాచే
సా ప్రోవాచేత్యధిగతరస స్తం జగాదేతియక్షః॥

చ॥ తనసతిక్షేమవార్తవిని దగ్గయుమోదపయోధిమున్గి దా
క్షణమొకడూరకుండివివ, శత్వమునన్మది బొంగి, పొర్లప్రే
మనువిలసిల్లువాక్యముల మాటికినాసతియేమిచెప్పనే
మనియెనువారిదాయనుచు, యక్షుడువల్కెనుసాదరంబుగన్॥౧౦౨

అర్థము—యక్షః=యక్షుడు, తత్సంలగ్నాశయః=తన ప్రియురాలియందు లీనమైన మనస్సుకలవాడై, క్షేమోదంత......మగ్నః, క్షేమోదంత=క్షేమవృత్తాంతముయొక్క, శ్రవణ=వినుటచే, జనిత=పుట్టిన, ఆనందవారాశి=సంతోషసముద్రమందు, మగ్నః=మునిగినవాడై, కలామాత్రం=కొంచెముసేపు, ఉత్తిష్ఠమానఇవ=ప్రయత్నించిన వాడువలెనె, సంమోదో......షితః, సమ్మోద=సంతోషముచేత, ఉద్యత్=పుట్టిన,వికృతి=వికారముచేత, విలసత్ భాషితః=ఒప్పుచున్నమాటలు కలవాడై, సా=ఆనాప్రియురాలు, కిమాచే=ఏమిచెప్పినది, కింప్రోవాచ=ఏమిచెప్పెను ఇతి=ఈలాగునని, అధిగతరసః=పొందబడిన యనురాగముకలవాడై, తం=ఆమేఘునిగూర్చి, జగాద=పలికెను.

తా—ఆయక్షుడు ప్రియురాలి క్షేమ సమాచారమునువిని యానందించినవాడై యొకక్షణమాలోచించు వానివలెనుండి అనగ నానందపరవశముచె మైమఱచి సమ్మోదవికారముచే నొప్పుచున్న ప్రియభాషణుండై, తనప్రియురాలేమి చెప్పె నేమి చెప్పెనని యాసక్తితో నామేఘు నడిగెను.

శ్లో॥ తత్సమ్మోదోచితమమృతదస్సన్నిగద్యప్రియోక్తి
స్తేనాక్లిష్టప్రియసువచనస్సాధుశిశ్రాయనాకం

స్మారంస్మారంసచసహచరీ సంగమార్థాభిలాషాం
స్తస్థౌ శాపావధిమజగురోర్బోధ మాకాంక్షమాణః॥

చ॥ అమృతదుఁడంతసంతసములౌ వచనంబులువల్కి యక్షు చే
బ్రియుదితమౌనుతింగొనిన, భంగిన కేఁగెను వేగయక్షుఁడు
దమిఁబ్రియురాలిసంగమముఁ, దన్గయుఁగోరుచు శాపమంత్యమా
సమయము గానఁజిత్తమున శార్ఙ్గి ప్రబోధము కాంక్షఁ జేసెడున్॥ ౧౩౩

అర్థము—అమృతదః=మేఘుఁడు, తత్సమ్మోదోచితం, తత్=ఆయక్షునకు, సమ్మోదోచితం=సంతోషకరములగు, ప్రియోక్తీః=ప్రియములగువాక్కులను, సన్నిగద్య=బాగుగాచెప్పి, తేన=వానిచే, ఆక్షిప్త=చేయబడిన, ప్రియనుతవచనః=ప్రశంసావాక్యములు గలవాఁడై, సాదు=యోగ్యమానట్లుగా, నాకం=స్వర్గమును, ఆకాశముననుట, శిశ్రియ=ఆశ్రయించెను. సచ=ఆయక్షుఁడున్నూ, సహచరీ... లాషాన్, సహచరీ=ప్రియురాలియొక్క,సంగమార్థాభిలాషాన్=సంగమే ప్రయోజనముగాగల కోరికలను, స్మారంస్మారం=మిక్కిలి తలఁచి, శాపావధిం=శాపాంత మునుగూర్చి, అజగురోః=విష్ణుమూర్తియొక్క, బోధం=మేల్కనుటను, ఆకాంక్షమాణః=కోరుచున్నవాఁడై, తస్థౌ=ఉండెను.

తా—మేఘుడిట్లు యక్షాంగన వృత్తాంతమును చెప్పి, యాయక్షునిచే ప్రశంసింపబడినవాఁడై తానాకాశము నాశ్రయించెను అనగా తనమార్గమున బోయెనను ట. ఇచ్చట నీయక్షుఁడును ప్రియురాలి సంయోగమునకై యువ్విళ్ళూరుచు, శాపావధినిగూర్చి యుత్థానైకాదశియందు విష్ణుమూర్తి ప్రబోధమును నిరీక్షించుచుండెను

“ శాపాంతోమే భుజగశయనాదుత్థితే శార్ఙ్గపాణౌ ” అనియక్షుడు కాళిదాసుని యుత్తరమేఘమునచెప్పినట్లు త్థానైకాదశి తనకుశాపావధియగుటచే నద్దానికై నిరీక్షించుచుండె.

శ్లో॥ ప్రావృట్ప్రాప్తాసపదివిరహోత్క్షోభ సంధానదక్షా
కేతక్యాదిప్రసవరజసా స్వాదమత్తద్విరేఫా

గర్జానాదక్షణరుచిహత శ్రోత్రనేత్రప్రశస్తిః
ప్రాంచద్ఘాసాంతరితవసుధా పూరితాశేషవాపీ॥

చ॥ విరహిమనో వ్యథాకరము, విస్తృతనూతనకేతకాదిపు
ష్పరసవిలోలబంభర ర, వంబును బూరితదీర్ఘికాళియై
యురుములు మించు మెఱు నేత్రశ్రవణ యుగ్మద్రుగా ర్తినొసంగఘాస సం
భరితధరాతలంబగుచువచ్చెను, వర్షపువేళయ య్యెడున్॥ ౫౪

అర్థము—సపది = అప్పుడు, విరహి......దక్షా, విరహి = వియోగముజెం దినవారికి క్షోభ = కలతను, సంధాన = కూర్చుటయందు, దక్షా = సమర్థమైనట్టియు, కేతక్యా......ద్విరేఫా, కేతక్యాది = మొగలి మొదలగు, ప్రసవజ = పుష్పములవల నబుట్టిన, రస = తేనెయొక్క, ఆస్వాద = తినుటచేతను, మత్త = మదించిన, ద్వి రేఫా = తుమ్మెదలుకలదెన్ని, గర్జా......ప్రశస్తిః, గర్జానాద = ఉరుముచేతను, క్షణరుచి = మెరుపుచేతను హత = పోగొట్టబడిన, శ్రోత్రనేత్రప్రశస్తిః = వీనుల యొక్కయు నయనములయొక్కయు శక్తికలదెన్ని, ప్రాంచ......వసుధా, ప్రాం చత్ = ఒప్పుచున్న, ఘాస = పచ్చికలచేతను, అంతరిత = కప్పబడిన, వసుధా = భూమికలదెన్ని, పూరిత = నిండింపబడిన, అశేషవాపి = సమస్తమైన సరస్సులుగ లదియునై, ప్రావృట్ = వర్షకాలము, ప్రాప్తా = వచ్చినది.

తా—మేఘుడాకాశము నంటగానే, వర్షకాలము ప్రాప్తించి, విరహిజనుల ధైర్యమును పోగొట్టుచు, మొగలిమొదలగు పుష్పముల వికసింపజేసి తుమ్మెదల మదెంపజేయుచునూ, ఉరుములచే కర్ణములకు వేదనగావించుచూ, మెఱుపులచేనేత్ర ముల మిరుమిట్లుగొల్పుచు, భూప్రదేశంబుల పచ్చికచేతను, దిగుడుబావుల నుదక ము చేతను నింపినదాయెను.

"విరహిక్షోభ......దక్షా" యనునది కాళిదాసుని పూర్వమేఘమున "కస్స న్నద్ధే విరహవిధురాంత్వయ్యుపేక్షేత జాయాం" అను యక్షవాక్యమును జ్ఞాపక ము చేయుచున్నది.

శ్లో॥ మేఘారావస్ఫుటితహృదయాలంబనార్థంప్రియాణాం
కాశ్మీరశ్రీలసదురసిజా సంగసంగోప్యమానం

కృత్వాగాఢంహృదయమథతద్బాహువల్లీనిబద్ధా
యస్యాంసర్వేవ్యపగతశుచశ్శేరతే కామిలోకాః॥

చ॥ విరహాగ్నిణంబుమేఘరవవిస్ఫుటితాత్మసుఖాశ్రియుత్కృష్ట
యురమును ప్రియసీగుబ యోధరయుగ్మమునం కుదాపనా
దరుణులు బాహువల్లరుల, దద్దయుబన్ధముసేయుచు ప్పము
దొరగియ థేచ్ఛగానికురదోగుదో, యాతజీవచ్చేనిమ్ననగ ౫౫

అర్థము—యస్యాం = వివర్షకాలమందు, సర్వే = సమస్తులైన, కామిలోకాః = కాముకులైనజనులు, మేఘా......నార్ధం, మేఘారావ = మేఘధ్వనిచేత, స్ఫుటిత = విడిపోయిన, హృదయ = మనస్సుయొక్క, అలంబనార్ధం = స్థిమితపడు చుకొనుటకై, హృదయం = వక్షస్థలమును, ప్రియాళీ......మానం, ప్రియాళీ = ప్రియురాండ్రయొక్క, కాశ్మీరశ్రీలసత్ = కుంకుమశోభచే ప్రకాశించుచున్న, ఉరసిజ = స్తనములయొక్క, ఆసంగ = సంబంధముచేత, సంగోప్యమానం = రక్షింపబడుచున్నది గనుకనే, గాఢం = దృఢమైనదానినిగా, కృత్వా = చేసి, అథ = తరువాతను, తద్బాహువల్లీనిబద్ధాః = భుజలతికలచే కప్పబడినవారై, వ్యపగతశుచః = పోయినదుఃఖము కలవారగుచూ, శేరతే = విశ్రమించుచున్నవారు.

తా—అవర్షకాలమందు కాముకులు మేఘధ్వనికి జడిసిన తమహృదయములప్రియురాండ్ర స్తనాంతరమున సంగోప్యంబొనర్చినవారై, వారిచేదృఢముగ నాశ్లేషింపబడిన వారగుచూ మనమును దృఢపఱచికొని పోగొట్టబడిన వియోగతాపముకలవారై నిరాతంకముగ శయనించుచున్నారు. వర్షకాలముద్దీపనవిభావమగుటచే, వృద్ధినొందుచున్న విరహతాపముగల కాముకులు, తమప్రియురాండ్ర సాంగత్యము బడసి యథేచ్ఛగ సుఖించుచుండిరని తాత్పర్యము.

శ్లో॥ రంగేతారాపథపరిసరే నూత్రిధారేణనవ్యాం
భోవాహేన స్ఫుటితమురజధ్వానసక్రాంతరావే
పౌరిద్యజ్జాతిపస్రసవగసనం న్యాదనత్తబభ్రంగా
థావేగానేలసతితటితో భ్రాన్తిసంక్లుప్తలాస్యాః॥

నాట్యంబన నృత్యగీతవాద్యముల కూడిక నాటకార్థానుకరణం నాట్యం స్మాత్" అనిభరతుడు. ఇట్టినాట్యమును బ్రవర్తింపజేయువాడు సూత్రధారుఁడనబడు "సూత్రంధరతీతి సూత్రధార్య" యనివ్యుత్పత్తి సూత్రమనగా సూచన. సూచనమన గాచతుర్విధాభినయాత్మకంబగు నాట్యము "సాత్వికాద్యైరభినయైః ప్రేక్షకాణాం యతోభవేత్ నటేనాయకతాదాత్మ్యబుద్ధిస్తన్నాట్యముచ్యతే" మఱియు సూత్రంబన "నాట్యోపకరణాదీని సూత్రమిత్యభిధీయతే" నాట్యోపకరణంబులనియు "అ సూత్రయన్ గుణాన్నేతుః కవేరపిచవస్తునః రంగప్రసాధనప్రౌఢ స్సూత్రధార ఇతీరితః" ఇట్టిరంగప్రసాధనమందుసమర్థుండు సూత్రధారుఁడని యు కొందఱిమతము. ఇక రంగమనగ నటుడు నటితోఁగూడి సంగీతాభినయంబులతో నాయకావస్థల తాదాత్మ్యంబున జూపుచు సభ్యులసంతసింపఁ జేయుప్రదేశము "సభాపతిస్సభాసభ్యా గాయకా వాదకాఅపి, నటీనటశ్చమోదంతే యత్రాన్యోన్యానురంజనాత్, అతో రంగ ఇతిజ్ఞేయః" అనిభరతుడు "తౌర్యత్రికంనృత్తగీతం వాద్యనాట్యమిదం త్రయం" అని అమరనిఘంటువు. కావుననిట్టిచ్చట, భృంగారావము గీతముగను, మేఘగర్జనములు వాద్యముగను, క్షణకాలము మెఱసి మిగులచంచలములగు మెరుపు తీవెలను నాట్యస్త్రీలుగను జేయుటచే నృత్యగీతవాద్యములతో గూడిన నాట్యంబు సార్థకంబయ్యె.

శ్లో॥ యక్షావస్థాకలన జనిదీప్రానుకంపేవశంపా
వల్లీపాథోరహిత జలదాదత్తహంసప్రసంగా
సంఫుల్లశ్రీకలితకమలా మోదభాస్వద్దిగంతా
ప్రాదుర్భూతాశరదుపగత స్వాగతాహంసనాదైః॥

చ॥ జలజపరీమళంబులుది, శాసము దాయములాక్రమింపమిం
చులనుజలంబులన్విడిచి, శుభ్రఘనంబులు గాలయుక్తులై
గలుగఁగఁ బ్రేమవచ్చెననఁగా వడిశారదవేళవచ్చె హం
సలకలనాదములెలఁగ స్వాగతవాక్యములై మనోజ్ఞమై॥ ౫౭

అర్థము.—యక్ష=యక్షునియొక్క, అవస్థా=దశయొక్క, ఆకలన= చూచుటచేత, జని=పుట్టుకకలదై, దీప్ర=స్పష్టమైన, అనుకంపేవ=దయకలదేవ

చ॥ ఘనుఁడనుసూత్రధారినవగర్జితనిస్వనమే మృదంగమై
దనరఁగజాజితేనెలను, దా్రిమిళిందరవంబెగానమై
మనముఁ వకింపుసేయఁగను, మూఁపతమూర్గమెనాట్యరంగమై
గనుపడమించులన్జెలులు, గన్మనాట్యముసల్పఁజేసెనుకా॥ ౧౭౬

అర్థము — స్తనిత......రాళే, స్తనిత = ఉరుములనెడు, మురజధ్వాన మర్దెలనాదముతో, సక్తా = కలుసుకొనిన, అంతరాళే = మధ్యభాగముకల, తారాపథపరిసరె = ఆకాశప్రాంతమనెడు, రంగే = నాట్యస్థలమందు, ప్రోదజ్జా......రాజే, ప్రోద్యత్ = వికసించిన, జాతిప్రసన = జాజిపూవులయొక్క రస = తేనెయొక్క సంస్వాదన = తినుటచే, క్షీబ = మదించిన, భృంగ = తుమ్మెదలయొక్క, ఆరావే = ధ్వనియనెడు, గానే = సంగీతము, లసతి = ఒప్పుచుండగా, నవ్యాంభోవాహేన = నూతనమేఘమనెడు, సూత్రధారేణ = సూత్రధారునిచే, సంక్లుప్తలాస్యాః = ప్రవర్తింపఁజేయఁబడిననాట్యముకల, వైతటితః = విద్యుల్లతలు, భాంతి = ప్రకాశించుచున్నవి.

తా — ఆకాలమందాకాశ మనెడి నాట్యరంగమునందు, మేఘగర్జనము మృదంగధ్వనిగను, జాజిపూవులతేనెఁగ్రోలి మదించిన తుమ్మెదల ఝుంకారము సంగీతముగానుండఁగ, మేఘుడనెడు సూత్రధారునిచేనాట్యము చేయింపఁబడు స్త్రీలవలె మెఱుపులు ప్రకాశించెను.

ఈవర్షకాలమున్న స్వాభావికములగు గర్జాది చిహ్నముల పరికించిననది యొక విలాసినీ నాట్యమును సూచించుచున్నది. ఇకనాట్యమునకు వలయురంగప్రసాధనాదులిట్లునిరూపింపడియె

ఇందునాట్యమునకు ప్రధానకర్తయగు మేఘుడను సూత్రధారునిచే నాకాశమను రంగస్థలమున, నుడుములను మృదంగధ్వనులును, తుమ్మెదఝుంకారములను గానంబును, రంగప్రసాధనంబులుగ నమర్చి, మించులను మించుబోఁడుల నర్తకులుగజేసి యొకనాట్యంబుప్రవర్తింపఁ జేయబడినట్లీకవిచేనిరూపింపబడియె,

నాట్యంబన నృత్యగీతవాద్యముల కూడిక నాటకార్థాను కరణం నాట్యం స్యాత్'' అనిభరతుడు. ఇట్టినాట్యమును ప్రవర్తింపజేయువాడు సూత్రధారుడనబడు ''సూత్రంధరతీతి సూత్రధార్య'' యనివ్యుత్పత్తి సూత్రమనగా సూచన. సూచనమన గాచతుర్విధాభినయాత్మకంబగునాట్యము'' సాత్వికాద్యైరభినయైః ప్రేక్షకాణాం యతోభవేత్ నటేనాయకతాదాత్మ్యబుద్ధిస్తన్నాట్యముచ్యతే''మఱియుసూత్రంబ న ''నాట్యోపకరణాదీని సూత్రమిత్యభిధీయతే'' నాట్యోపకరణంబులనియు ''అ సూత్రయన్ గుణాన్నేతుః కవేరపిచవస్తునః రంగప్రసాధనప్రౌఢః సూత్రధారఇతీ రితః'' ఇట్టిరంగప్రసాధనమందుసమర్థుండు సూత్రధారుడనియు కొందఱిమతము. ఇక రంగమనగ నటుడు నటితోగూడి సంగీతాభినయంబులతో నాయకావస్థల తాదా త్మ్యంబున జూపుచు సభ్యులసంతసింపఁ జేయుప్రదేశము '' సభాపతిస్సభాసభ్యా గాయకా వాదకాఅపి, నటీనటశ్చమోదంతే యత్రాన్యోన్యానురంజనాత్, అతో రంగ ఇతిజ్ఞేయః'' అనిభరతుడు ''తౌర్యత్రికంనృత్తగీతం వాద్యనాట్యమిదం త్రయం'' అని అమరనిఘంటువు. కావుననిట్టిచ్చట, భృంగారావము గీతముగను, మేఘగర్జనములు వాద్యముగను, క్షణకాలముమెఱసి మిగులచంచలములగు మెరుపు తీవెలను నాట్యస్త్రీలుగను జేయుటచే నృత్యగీతవాద్యములతో గూడిన నాట్యంబు సార్థకంబయ్యె.

శ్లో॥ యత్నావస్థాకలన జనిదీప్రానుకంపేవశంపా
వల్లీసాధోరహిత జలదాదత్తహంసప్రసంగా
సంఫుల్లశ్రీకలితకమలా మోదభాస్వద్దిగంతా
ప్రావిర్భూతాశరదుపగత స్స్వాగతాహంసనాదైః॥

చ॥ జలజపరీమళంబులుడి, శ్వాసము దాయములాక్రమింపమిం
ములనుజలంబులన్విడిచి, శుభ్రఘనంబులుగాలయత్నునై
గలుగఁగఁబ్రేమవచ్చెననఁగా వడిశారదవేళవచ్చె హం
సలకలనాదముల్జెలఁగ స్వాగతవాక్యములై మనోజ్ఞమై॥ ౫౭

అర్థము.—యత్న=యత్నునియొక్క, అవస్థా=దశయొక్క, ఆకలన= చూచుటచేత, జని=పుట్టుకకలదై, దీప్ర=స్పష్టమైన, అనుకంపేవ=దయకలదీవ

లేనే శంపావల్లీ=మెరుపుతీగెలతోడను, పాథః=ఉదకముతోడను, రహిత=శూన్య మైన, జలదా=మేఘముకలిగినటువంటియు, ద_త్తహంసప్రసంగా, ద_త్త=చేయబడిన, హంస=హంసల యొక్క, ప్రసంగా=క్రేంకార ధ్వనులుకలదియు, సంఫల్ల ......దిగంతా, సఫల్ల శ్రీవికాస శోభతో, కలిత=కూడిన, కమల=పద్మముల యొక్క, ఆమోద=పరిమిళము చేత, భాస్వత్=ప్రకాశింపుచున్న, దిగంతా=దిక్ప్రదేశములు కలదియునగు, శరత్=శరత్కాలము, హంసనా_దైః=హంసధ్వనులచే, ఉపగత స్వాగతా=పొందబడిన స్వాగతము గల_దై, ప్రావిర్భూతా=ఆవిర్భవించినది.

తా—శాపావధియగు ను_త్థా_నైకాదశి శరత్కాల మందగుటచే ప్రావృట్కాలానంతరము శరత్కాలమువర్ణింప బడుచున్నది. ఆశరత్కాలము మెరుపులు లేకనుదశూన్యంబు లగుటచే తెల్లనివగు మేఘములు కలదియును, వికసించిన కమలముల పరిమిళముచే వ్యాపించిన దిక్కులుకలదియు, హంసక్రేంకారములచే స్వాగతమీయబడినదియు_నై, వియోగావస్థయందు దుఃఖించుచున్న యక్షునిగని జాలినొందినది వలెనె శీఘ్రముగ నావిర్భవించి నట్లుత్ప్రేక్షింపబడియె.

శ్లో ॥ యక్షీభూయస్స్వమపహసతి స్వప్రసూతప్రసూన
చ్ఛాయాభారఃకిమితిసుమనా జాతిరాశాంతజృంభా
స్స్వాపత్యాంభోజనివదనత శ్శ్రీస్సమేత్యస్థితాత్ర
వ్యాఖ్యాతీవభ్రమరమధురా రావకై_ఃపద్మినీయం॥

చ॥ ననుగనియక్షి నవ్వుతఱి, నానుమ కాంతులఁ కేలనం చులో
ననుకొని జాజిదాసుమన, యాచుఁబ్రశాంతివహించెమిక్కిలిఁ
వనిజనితమ్మి మోమునను, బంభరనాదముచేతఁబద్మినీ
ఘనతవహించె యక్షియని, గక్కునఁజాటెడులీలదోచెడుఁ ॥ ౫౮

అర్థము—జాతిః=జాజితీగె, యక్షీ=ఆయక్షాంగన, భూయః=తిరిగి,శాపావసాన మందని తాత్పర్యము. స్వం=తనను, అపహసతి=పరిహసించునని, స్వప్రసూత ప్రసూనఛాయాభారః, స్వప్రసూత=తననుండిపుట్టిన, ప్రసూన=పువ్వుల యొక్క, ఛాయాభారః=కాంత్యతిశయము, కిమితి=ఎందుకని, సుమనాః=మంచి

మనస్సుగల (దనుసార్థకమనామముకల) దై, అశాంత=మిక్కిలిశమించిన, జృం
భా=వికాసముకలది, అభూత్=ఆయెను, ఇయం=పద్మినీ=ఈతామరతీగెయును,
భ్రమర.....రావకైః, భ్రమర=తుమ్మెదలయొక్క, మధురావకైః=మధురధ్వను
లచేత, స్వాపత్య=స్వసంతానమగు, అంభోజని=పద్మమనెడు, వదనతః=ముఖము
నుండి (తద్వారా) శ్రీః=శోభ, అనగాపద్మినీజాతిస్త్రీకి స్వభావమగుశోభ అత్ర=
ఈయక్షియందు, సమేత్య=కలుసుకొని, స్థితా=ఉన్నదని, వ్యాఖ్యాత్రీవ=చెప్పు
చున్నదివలెనున్నది.

తా—వర్షకాలమున జాజులు విస్తారముగ పుష్పించి శరత్కాలమున తగ్గి
పోవును, అతగ్గుట, కొద్దికాలములో భర్తృసమాగమానందమున వికాసము జెందునా
యక్షాంగన చిరునవ్వుతనను పరిహసించునని (నవ్వునకును తెల్లని పుష్పములకు నుప
మానోపమే యభావముగాన) ‘‘ సుమన ’’ (జాజిచెట్టునకు మఱియొకపేరు, మం
చిమనస్సుకలదియనియు నర్థము) యనుతననామమును సార్థకము నొందించుకొను
టకు, తన వికాసమును చాలించెనాయన్నట్లుత్ప్రేక్షింపఁబడియె. మఱియు శర
త్కాలంబున పద్మములకు వికాసంబధికము. కావుననప్పుడు పద్మిని (తామరతీగె)
పద్మంబను తనముఖంబునుండి బయలువెడలు మిళింద బృంద ఝుంకారరూపంబులగు
పలుకులచే, యక్షాంగనా ముఖంబు పద్మసమాన సంపత్తుగలదని (పద్మినీజాతిస్త్రీ
యగుటనున్నా) నలుదెసలఁ బ్రకటించుచున్నది వలెనేయుండె. పద్మము లక్ష్మిని
వాసస్థలంబుగాన నామెముఖమును పద్మసదృశంబగుటజేసి, సిరి తులదూగుచుండె
నని తాత్పర్యము.

శ్లో॥ సోయంనిత్యంప్రియసుహృదితి ప్రత్యయోనైవకార్య
స్స్వస్యాత్మాపిస్వవిపదిభవేన్నైవకార్యాత్రశంకా
యస్మాద్యక్షిప్రాగ్జలధరతతే రాత్మభూతోనితాన్తం
తద్విచ్ఛేత్త్రాభవతిఘనతా పాయతోమాతరిశ్వా॥

చ॥ ఇతఁడేకక్క పుమితుడంచుమది నుంతేనమ్మరాదేని సం
తతమాత్మాకృతినున్న వాఁడ శ్రీమతుండావేటనిక్కంబె, మే

ఘుతతిక్ మారుతుఁడాత్మరూపుఁడయినన్ గాలంబువత్యస్తమా
గతిరాగాఘనతాపనోదనముగాఁ గల్పింపడేనాశముల్॥ ౫౯

అర్థము—సోయం=వీడు, నిత్యం=ఎల్లప్పుడు, ప్రియసుహృదితి=ప్రియస్నే హితుడని, ప్రత్యయః=విశ్వాసము, నైవకార్యః=చేయతగినదికాదు. స్వస్య=తనకు ఆత్మాపి=స్వరూపమైనప్పటికి, స్వవిపది=తనయాపత్తు విషయమై, భవతి= అగుచున్నది, అత్ర=ఈవిషయమందు, శంకా=సందేహము, నైవకార్యా=కూడదు. యస్మాత్=ఎందువలననగా యః=ఏవాయువు, ప్రాక్=వర్షకాలమందు, జలధర తతేః=మేఘసమూహమునకు, ఆత్మభూతః="ధూమజ్యోతిస్సలిల మరుతాంసన్ని పాతః" ఇత్యాది ప్రమాణమువలన, స్వరూపమయ్యెనో, మాతరిశ్వా=అట్టివాయు వు, ఘనతాపాయతః=ఘనత్వనాశనమువలన, (ఘనత్వమన గౌరవమును, గట్టితన మును స్ఫురించుచున్నవి.) నితాంతం=మిక్కిలి, తద్విచ్ఛేత్తా=ఆమేఘస్వరూపనా శకుడు, భవతి=అగుచున్నాడు

తా—లోకమందొకనిని వీఁడు మనస్నేహితుడుగదాయని యెల్లప్పుడును విశ్వసింపగూడదు. తనస్వరూపమైనను తనకొకప్పుడు విపత్కారణ మగుచుండును. ఇదియథార్థమే. ఏలనన వర్షకాలమందు మేఘమునకు స్వరూపమగు వాయువీశర త్కాలమున ధూమాదులు విడుటచే తేలికయైన, తనస్వరూపమేయగు మేఘమును భేదింప సమర్థమగుచున్నది. అనగ శరత్కాలమున నుదక శూన్యంబులగుటచే మ బ్బులు తెల్లనై ఖండఖండములుగ వాయువుచే నెగరగొట్టబడుచుండుట స్వభావమని తాత్పర్యము.

శ్లో॥ లక్ష్మీనివక్షోరుహాశిఖర సంఘర్షణాద్వాత్మనూనో
శ్చంద్రస్య శ్రీవ్యతికరవిరీతాప్రమోదాశ్రితస్య
సంరంభాద్వ్యాముఖరితదిశస్సింధుబంధోరమేశో
నిద్రాముద్రాంసపదివిజహా పాణిసంస్పృష్టనేత్రః॥

చ॥ కలువలరాజనిమ్మైశిరిని గాంచి కుమారుఁడు గానుబ్బుచున్
జలనిధిమాఱుమ్రోయఁగది, శ్వాసముదాయము పేర్మిఘోషముల్

సలుపటనో రమాగురుకుచంబుల రాయిడినో మురారి చే
తులస్పృసియించివిప్పికను, దోయిని, నిద్రనువీడెగొబ్బునన్॥ ౬౦

అర్థము—లక్ష్మీ......ణాద్వా, లక్ష్మీ=లక్ష్మీ దేవియొక్క, వక్షోరుహ=స్తనములయొక్క, శిఖర= అగ్రభాగములయొక్క, సంఘర్షణాద్వా=రాపిడి వలననో (తాకుటవలననో,) ఆత్మసూనోః=తన కుమారుడైన, చంద్రస్య=చంద్రుని యొక్క, నిరీక్ష=చూచుట వలననైన, ప్రమోద=సంతోషమునకు, ఆశ్రితస్య= ఆధారమైనట్టియు, ముఖరితదిశః=శబ్దాయమానములైనదిక్కులుకలిగి నట్టియు, సింధుబంధోః-సముద్రుని యొక్క, సంరంభాద్వా=అతిశయమువలననో, రమేశః=విష్ణువు, సపది=తత్కాలమందు, పాణిసంస్పృష్టనేత్రః=చేతులచేస్పృశింపఁబడిన నేత్రములు కలవాడై, నిద్రాముద్రాం=నిద్రా రీతిని, విజహౌ=విడిచెను.

తా—లక్ష్మీస్తనసంఘర్షణము చేతనో, శరత్కాలమందు చంద్రునికి విశేష కాంతికలుగుటచే నైనసంతోషము చే గంభీరనాదముగల సముద్రునిసంరంభము చేతనో, యన్నట్లు విష్ణుమూర్తి మేల్కొంచెను లోకమున నిద్రిచెందువారికి కఠినవస్తుస్పర్శనము చేతను, గొప్పధ్వనిచేతను నిద్రాభంగ మగుట స్వభావము, ప్రబోధనైకాదశి కార్తీక శుద్ధమందగుటచే, చంద్రునకు పూర్ణత్వము, శరత్సమయవికాసత్వము నందువలన, సముద్రమునకు గంభీరఘోష గలుగుటయు సంభవించు చున్నయది. నిద్రలేచునపుడు హస్తాగ్రంబుల నేత్రంబులస్పృశించి, వానిగాంచుట ధర్మశాస్త్రవిహితము "కరాగ్రేవసతేలక్ష్మీః కరమధ్యేసరస్వతీ" అనిప్రసిద్ధము. జగత్కర్తయగు విష్ణువు ధర్మసంగ్రహార్థమిట్లాచరించెనని తాత్పర్యము.

శ్లో॥ సమ్యక్న్యక్ప్రకృతివిక్రృతే రాత్రసమ్మోదవృద్ధే
రుద్యజ్జ్యోత్స్నానవగతివశాత్కింకృతైర్ధ్వంసపాళైః
ర్శుత్యానందప్రకటనచణైర్భవ్యవాక్యప్రసారై
రున్నిద్రోఽభూత్సపదికమలాకాముకశ్శేషతల్పాత్॥

ఉ॥ చక్కఁగపీడఁగాఁబ్రికృతి, జాడ్యముమానసవానభోగమిం
పెక్కఁగనాత్మమోదములయి, హేలజలించెడుమాంసపాళిచె

స్సక్కు-వసల్పుచుండ (శుతిమండనవాఙ్నుతి కేంకృతాళిచే
(గక్కు-న మేలుకాంచె హరికంధినసౌందర్శనాళివిమ్నుగా॥ ౬౧

అర్థము—సమ్యక్=బాగుగా, త్యక్త=విడువబడిన, (పకృతి=స్వభావము యొక్క-యు, మాయయొక్క-యు, విక్రతేః=వికారముకలిగినట్టియు, ఉద్యత్=(ప కాశించుచున్న, సత్=యోగ్యమైన, మానసగతివశాత్=మానససరస్సంచారవశము వలనను, విష్ణునామమన నాదివశమువలనను, ఆత్తసమ్మోదవృద్ధైః=పొందబడిన సం తోషాతిశయముగల, హంసపాళేః=హంససమూహము యొక్క-యు, యోగిసమూ హము యొక్క-యు, శ్రుత్యానంద=శ్రోత్రానందమును, వేదపఠనమువలన గలిగిన యానందమును, (పకటనచణైః=(పకటించుటయందు (పసిద్ధములైనట్టియు, భవ్యవా క్య(పసాదైః=శుభవాక్కు-ల (పసాదముగలట్టియు, (కేంకృతైః=క్రేంకారములను, మధురధ్వనులచేత, సపది=తత్కా-లమందు, కమలాకాముకః=విష్ణుమూర్తి, శేషత ల్పాత్=భుజగశయనమునుండి, ఉన్నిద్రః=మేలుకొన్నవాడు, అభూత్=ఆయెను.

తా—వర్షకాల జన్యమగు వికారమును విడచి మానససరస్సునందు సంచరిం చుటవలన సంతోషాతిశయముగల హంసలయొక్క- శ్రవణానందకరములై శుభము లగు క్రేంకారములచేతను, మాయావికారమును విడనాడి మానసికపూజచే (బహ్మా నందమును పొందిన యోగిసమూహముయొక్క- పరమానందమును (పకటించునట్టి స్వస్తివచనముల చేతనువలె విష్ణుమూర్తి శేషశయ్యనుండి లేచెను.

హంసలనగా యోగులలో నొకతెగ, వారు మాయాకృత వికారముల నతిక్ర మించి యాషాఢశుద్ధ ఏకాదశి మొదలుకొని కార్తీకశుద్ధ ఏకాదశి పర్యంతము చాతు ర్మాస్య (వతమును విధ్యుక్తముగా నాచరించి పరమేశ్వరుని నామముల స్మరించుచు వాని(పబోధము కొఱకు స్తుతిపాఠముల జదువుచుందురనుట పురాణ (పసిద్ధము.

శ్లో॥ శయ్యాంముంచత్యహిపతిమయీం మాధవేసోపియత్ర
శ్యాపోన్మీత(కశిమరహితః పూర్ణిమాచం(దశోభః
కాంతాంద(ష్టుంత్వరితహృదయ స్స్వాంపురీంసం(పయాతుం
తస్మాద్దేశాన్నిరగమదతి ప్రీతినంసక్తచిత్తః॥

చ॥ హరియహిశయ్యవీడి చన, యక్షుఁడు శాపజ కార్శ్యముం తసత్వరముగవీడి పూర్ణశశి భంగిని శోభిలి కాంతఁ జూడఁగాద్వరితమనస్కుఁడై చనిజ పట్టణముంగను వేడ్కతోడఁదాగిరిదిగిపోయెఁ బ్రేమమది గ్రోల్లురుకఁ బరమేశువేఁడుచున్ ౬౨

అర్థము — మాధవే = విష్ణుమూర్తి, అహిపతిమయీం = శేష వికారంబగు, శయ్యాం = తల్పమును, ముంచతి = విడిచిన వాడగుచుండగా, సయక్షోపి = ఆయక్షుడున్నూ, శాపోన్న......రహితః, శాప = కుబేరశాపముచేత, ఉన్నిత = ప్రశస్తమైన, కృశిమ = కార్శ్యమును, రహితః = విడిచిపెట్టినవాడై, పూర్ణిమాచంద్రశోభః = పున్నమచంద్రుని శోభకలవాడై, కాంతాం = భార్యను, ద్రష్టుం = చూచుటకొఱకు. త్వరితహృదయః = తొందరపడిన మనస్సుగలవాడై, అతిప్రీతిసంసక్తచిత్తః = మిక్కిలి ప్రేమతో గూడినమనస్సుగలవాడై, స్వాంపురీం = తనపట్టణమునుగూర్చి, సంప్రయాతుం = వెళ్లుటకొరకు, తస్మాత్ దేశాత్ = ఆచిత్రకూటపర్వతమునుండి, నిరగమత్ = వెళ్లెను.

తా — విష్ణుమూర్తి నిద్రమేల్కొంచినతోడనే ఆయక్షుడు శాపమువలనైన దుఃఖములను విడిచి రాకాచంద్రునివలె వెలుఁగుచు, భార్యను జూచుతొందరతో చిత్రకూటమును వదలి తనపట్టణమునకు సత్వరంబుగ జనియె.

శ్లో॥ మధ్యేవైమానికమధపథః ప్రేక్ష్యయక్షేశభృత్యం
తద్విజ్ఞాతస్స్వయమవతిశుభో దంతనిష్టాతఖేదః
శాపోన్ముక్తస్త్వసహచరస్త్వద్విదృక్షావశాత్స్వ
వాయాతీతి ప్రవదతుభవా నిత్యహో చద్రిసాత్సః॥

చ॥ మారుతమార్గమందున విమానముపై జనుదెంచుయక్షు రాట్టూరిమిభృత్యుఁ గాఁచి తనకోమలిసౌఖ్యపువార్తవీతులన్
జేరఁగవీతఖేదుఁడయి, చెప్పఁగఁబుచ్చెనునీదుభర్తకున్
దీరెనుశాపమయ్యెడల, నిన్నుఁగనుంగొనునంచువానిచేన్ ॥ ౬౩

అర్థము — అనః = తరువాతను, పథః = మార్గముయొక్క, మధ్యే = మధ్యమందు, వైమానికం = విమానముచే సంచరించుచున్న, యక్షేశభృత్యం = ఒకకుబేరభటుని, ప్రేక్ష్య = చూచి, దన్వ్యైజ్ఞా...... క్షేపః, స్వయువతి = తనభార్యయొక్క, శుభోదంత = క్షేమవృత్తాంతముచేత, నిర్ధూతఖేదః = నిర్విచారుఁడై, తనసహచరః = నీప్రియుఁడు, శాపోన్ముక్తః = శాపమునుండి విడువబడినవాఁడై, త్వద్దిదృక్షావశాత్మైన = నిన్నుచూడ వలెనని మనస్సుకలవాఁడైయే, ఆయాతి = వచ్చుచున్నాఁడు, ఇతి = ఈలాగునని, భవాన్ ప్రసపతు = నీవుచెప్పుమా, ఇతి = ఇటు, సః = ఆయక్షుఁడు, రసాత్ = సంతోషముతో, అవోచత్ = చెప్పెను.

తా — ఈ విధముగా వెళ్ళుచూ, మార్గమధ్యమందలకనుండి వచ్చుచుండిన యొకకుబేర భటునిఁజూచి, తనభార్య క్షేమవృత్తాంతమునువిని మిగులసంతోషించిన వాఁడై, విమానమువలన శీఘ్రముగవెళ్ళఁగలవుగావున, నీప్రియుఁడు శాపావధిగడచుటచే నిన్నుజూచుటకు వచ్చుచున్నాఁడని యాయక్షుతో జెప్పుమాయని సంతోషముతోఁ బలికెను.

శ్లో॥ తంవీక్ష్యాయంసపదిముదితో వారివాహావలోకా
త్కేకీవాలంద్రుతతరగతి స్తామువాచప్రవృత్తిం
పుష్పానేహోగమనవశతస్సద్వనీవాభిపూర్ణ
శ్రీసంసక్తాసమభవదసౌ విహ్వాలాసమ్మదేన॥

చ॥ వానినిఁజూచిఖేచరుఁడు, వారిదుఁగాంచిననెమ్మివోలెదా
మానసమందుఁబొంగుచు, విమానముపైజనివానివార్తయా
మానినితోడఁజెప్ప మధుమాససమాగమసద్వనీప్రభా
నూన విలాససంపద, వినూత్నవికాసమునొందెముక్షయుఁ॥ ౭౮

అర్థము — అయం = ఈవైమానికుఁడు, తం = ఆయక్షుని, వీక్ష్య = చూచి, వారివాహావలోకాత్ = మేఘదర్శనమువలన, కేకీవ = నెమలివలెనే, ముదితః = సంతోషించినవాఁడై, అలం = మిక్కిలి, ద్రుతతరగతిః = శీఘ్రగమనముకలవాఁడై, ప్రవృత్తిం = ఆవృత్తాంతమును, తాం = ఆయక్షకాంతనుగూర్చి, ఉవాచ = చెప్పెను.

అసౌ = ఈయక్షపత్ని, సమ్మదేన = సంతోషముచేత, విహ్వలా = సంభ్రమము జెందినదై, పుష్పాసేహా = వసంతకాలముయొక్క, ఆగమనవశతః = ప్రాప్తివలన, సద్వనీవ = వనమువలె, అభిపూర్ణశ్రీసంసక్తా = పరిపూర్ణమైన శోభకలదై, సమభవత్ = ఆయెను.

తా—ఆవైమానికుడు తనస్నేహితుడైన యక్షునిఁజూచి మేఘదర్శనమునను ప్పొంగు నెమలివలెనే మిగుల సంతసించినవాఁడై శీఘ్రముగాబోయి యక్షాగమనమును వానిప్రియురాలి కెఱింగించెను, ఆమెయు వసంతాగమమున నూతన శోభవహించు వనలక్ష్మివలె పూర్ణమైన శోభకలదై మిక్కిలి సంతోషించెను.

శ్లో॥ భర్తాగచ్ఛేదితిసరభసా సంయమత్యాగలోలా
శ్రీదేవీసమ్మదకృతికృతే పూజనాయైవసాధూన్
ఆప్తైరర్హైరధివినయమాహ్వాపయత్తేపిసన్త
శ్శ్రుత్వాగర్జామివవినన్నృతుర్నీలకంఠాఇవాలం॥

చ॥ పెనిమిటివచ్చుచుండెనని భృత్యుఁడుసెప్పఁగనాలకించి దా
మునుపచరించునవ్రతముఁ బూర్తినొనర్పఁగనెంచి దేవికిన్
మనమలరంగసాధుజనమంతలిఁ బూజకుఁబిల్వఁబంపఁగా
ఘనుగనినట్టినెమ్మివలెఁ గౌతుకమందెనులోకమాపురిన్॥ ౬౫

అర్థము—భర్తా=ప్రియుడు, ఆగచ్ఛేత్ ఇతి=రాగలడని, సరభసా=తొందరగలదై, సంయమత్యాగలోలా, సంయమ=పూజానియమమును, త్యాగ=విడిచిపెట్టుటయందు, లోలా=ఆసక్తికలదై, శ్రీదేవీసమ్మదకృతికృతే=పరదేవతయొక్క సంతోషముకొరకు, పూజనాయైవ=పూజించుటకే, సాధూన్=పెద్దలను, అర్హైః=తగినటువంటి, ఆప్తైః=బంధువులచే అతివినయం=మిక్కిలియణకువతో, ఆహ్వాపయత్=పిలిపించెను. తేపిసంతః=ఆసజ్జనులున్నూ, నీలకంఠాః=నెమళ్ళు, గర్జామివ=మేఘధ్వనినివలెనే, శ్రుత్వా=ఆవృత్తాంతమునువిని, అలం=మిక్కిలి, వినన్నృతుదిశ=ఆనందముచే నాట్యముచేసినవారువలె నుండిరి.

తా—ఆయజ్ఞాంగన తనభర్త వచ్చుచున్నాడని విని యంతకుమున్నాచరించుచున్న పరదేవతా పూజాదీక్షను సమాప్తినొందింపఁ దలఁచి దేవీప్రీతికొరకు భోజనాదుల నిమిత్తమై యచ్చటి సత్పురుషులను వినయవిశేషయుక్తురాలై యాప్తులచే పిలిపించెను. అప్పుడావార్తను విని యాజనులు ఘనాగమంబున దాండవమాడు నెమళ్లవలె మిక్కిలి సంతోషముతో నుప్పొంగిరి. ఇదివరలో నీయజ్ఞాంగన ప్రోషితభర్తృకగను నీసమయమున సమాగచ్ఛత్పతికగ నలంకారశాస్త్రజ్ఞులచే పరిగణింపఁబడును.

శ్లో॥ తస్మిన్నేవప్రక్కృతసమయే సర్వవస్తుప్రశస్తి
వ్యాప్తే గేహే సకలసుజనే తత్తదర్చాప్రవృత్తే
గేహిన్యాంచ ప్రకృతకృతిషు వ్యాపృతాయాం సయజ్ఞః
ప్రాప్తః శ్రీదేవ్యధిగతవరప్రీత సౌభాగ్యపుంజః॥

చ॥ వలయుపదార్థజాలములు భాసిలు గేహములోన సజ్జనా
వళినియమంబు మీఁడఁదగు పట్లనొనర్చు పూజభక్తిమై
సలుపుచునుండ నాసతియు, శాంకరిఁ గొల్చుచునుండఁ దత్తపో
ఫలపరిపాకపుంజమన వచ్చెనుగుహ్యకుఁ డింటి కాతఁడే ౭౭

అర్థము—తస్మిన్ ప్రకృతసమయ ఏవ=ఆసమయానుకూలముగ, సర్వవస్తుప్రశస్తివ్యాప్తే=సమస్తపదార్థములచేతను నిండినట్టి, గేహే=గృహమందు, సకలసుజనే=సమస్తులైన సత్పురుషులు, తత్తదర్చాప్రవృత్తే=ఆయా పూజలయందు ప్రవర్తించినవారుకాగ గేహిన్యాంచ=యజ్ఞాంగనయు, ప్రకృతకృతిషు=ప్రస్తుతవ్యాపారములయందు; వ్యాపృతాయాం=ప్రవర్తించియుండగా, శ్రీదేవ్యధిగత వరప్రీతసౌభాగ్యపుంజః, శ్రీదేవి=ఆపరదేవతవలన, అధిగత=పొందబడిన, వర=వరముచేత, ప్రీత=కూర్పబడిన, సౌభాగ్యపుంజః=అదృష్టసమూహమాయన్నట్లు, సయజ్ఞః=ఆయజ్ఞుడు, ప్రాప్తః=వచ్చెను.

తా—ఆదినమున నసే బ్రాహ్మణభోజనాదికమునకు వలయు సమస్తపదార్థంబులచే తులతూగుచుండు నాగృహమందు, బ్రాహ్మణోత్తములు నియమత్యాగకాలో

చిత హోమాదికంబుల నెరవేర్చుచుండగా, నాయక్షియు నాయాపూజావ్యాపార
ముల పరవశచిత్తయైయుండ, పూజాదికముచే ప్రసన్నురాలైన శ్రీదేవీవరప్రభావ
సంజనితఫలోదయమాయను నట్టియక్షుడును గృహంబునేరె.

శ్లో॥ పశ్చాదేషా ప్రణయినిమహాగంధతైలావసేకా
దున్మృష్టాంగేమహితపయసా కల్పితస్నానశుద్ధే
స్నాతాదివ్యాంబర వరధరా క్లుప్తనానావిభూషా
వల్లీవాభాన్నిబిడకుసుమాసక్తతారేవరాత్రిః॥

చ॥ పరిమళతైలమంటుకొని పావనవారివిదోఁగినవ్యమా
వరవసనంబుగట్టితనభర్తను జూచి యుయక్షి స్నానమా
దరమునఁ జేసివస్త్రములఁ దాల్చినగన్గొనరిక్కలన్విభా
వరివలెఁబుష్పసంతతిని వల్లివలెన్ గనుపట్టెశోభచేన్॥ ౬౭

అర్థము—పశ్చాత్=అనంతరమందు, ప్రణయిని=భర్త, మహాగంధతైలావసేకాత్, మహాగంధ=మంచిపరిమళముగల, తైల=నూనెయొక్క అవసేకాత్=పూయుటవలన, ఉన్మృష్టాంగే=శుభ్రమైన శరీరముగలవాడై, మహితపయసా=శుద్ధోదకముచేత, కల్పితస్నానశుద్ధె కల్పిత=చేయబడిన, స్నాన=స్నానముచేత, శుద్ధే=పరిశుభ్రుడగుచుండగా, ఏషా=ఈయక్షకాంత, స్నాతా=స్నానముచేసినదై, దివ్యాంబరధరా=మేలైనబట్టలుధరించి, క్లుప్తనానావిభూషా=అమర్చుకొనిన యనేకములగు నగలుకలదై, నిబిడకుసుమా=విశేషము పుష్పములుగల వల్లీవ=తీగెవలెను, సక్తతారా=నక్షత్రములుగల, రాత్రిరివ=రాత్రివలెను ఆభాత్=ప్రకాశించెను.

తా—యక్షుడు గృహమున కరుదేరగా సుగంధతైలముచే నభ్యంగనముగావించి యనంతరమాయక్షాంగనయు స్నానంబుజేసె పరిశుభ్రురాలై దివ్యాంబరముల ధరించి, యాభరణంబుల నలంకరించు కొనుటచే, పుష్పించిన తీగెవలెనూ, నక్షత్రయుక్తమైన రాత్రివలెను ప్రకాశించెను.

శ్లో॥ జాతేపాకేపరముపగతాన్భూరిసాధూన్సుగంధై
రామోదాఢ్యైర్వివిధకుసుమ స్రగ్భిరగ్ర్యాంబరైశ్చ

రత్నవ్రాతైర్ద్రవిణనికరైః కామధేనూపమా సా
కార్షీత్సర్వానపి చ ముదితాన్ దేవతాబుద్ధిసక్తా॥

చ॥ సురగవిఁబోలుయత్నసతి, సుష్ఠుగఁ బాకముగాఁగనింటికిన్
సరగునవచ్చుసాధుజన సంతతి వేల్పులగాఁదలంచి సా
దరమునభోజనమ్మిడి ముదంబుగ వారికిదివ్యచందనాం
బరకుసుమస్రజద్రవిణవ్రాత మొసంగెనుభక్తినిష్ఠగాన్॥ ౭౮

అర్థము—పాకే=వంటకము, పరం=సుష్టుగా, జాతే=అయినదగుచుండగా ఉపగతాన్=వచ్చిన, సర్వానపి=సమస్తులైనట్టి, భూరిసాధూన్=పెద్దలను, కామధేనూపమా=కామధేనుతో సమానురాలైన, సా=ఆయత్నకాంత, దేవతాబుద్ధిసక్తా=దేవతలను బుద్ధితోఁ గూడినదై, ఆమోదాఢ్యైః=పరిమళముతోఁగూడిన, సుగంధైః=మంచిగంధములచేతను వివిధ=అనేకములైన, కుసుమస్రగ్భిః=పూలదండలచేతను, అర్ఘ్యాంబరైశ్చ=యోగ్యమగు వస్త్రములచేతను, రత్నవ్రాతైః=రత్నసమూహములచేతను, ద్రవిణనికరైః=ద్రవ్యసమూహములచేతను, ముదితాన్=సంతోషించినవారినిగా, అకార్షీత్—చేసెను.

తా—వంటయైనతర్వాత కామధేనువుతో సమానురాలైన నాయత్నాంగన వచ్చిన పెద్దలనందఱిని కస్తూర్యాదులచే మిళితమగు చందనములచేతను, అనేకవిధములగు పుష్పమాలికలతోడను. అర్ఘ్యాంబరములచేతను, రత్నసమూహములచేతను దేవతాబుద్ధితో వారినిపూజించె.

శ్లో॥ సా సంశుద్ధాంబరధరా సౌరభేయీఘృతాక్తై
ర్దీపైస్సజ్యోతిషమివదివం మేదినీం స్వాకృతిం తాం
కుర్వాణా లంమహీంతతులసీ మంటపే రత్నక్లప్తే
సంపూజ్య శ్రీవరతనుధియా సర్పచర్యావదోఘాన్॥

ఉ॥ ఆసతిశుభ్రవస్త్రధరయైతులసీవనరత్నమంటపా
భ్యాసమునందుగోఘృతమయంబులుదివ్వెలుపెక్కుపెట్టఁగా

భాసిలభూమిరిక్కలనభంబునుబోలె పరాంబికామణిన్
దోసిలియొగ్గిపండితుల తోషమునొందఁగఁ బూజసల్పెఁ॥ ౬౯

అర్థము—సా=ఆయక్షి, శుద్ధాంబరవరధరా=పరిశుభ్రములైన వస్త్రములధరించి సౌరభేయాజ్యకృతాక్తైః=ఆవునేతిచే వెలిగింపఁబడిన, దీపైః=దీపములచేత, దివం=ఆకసమును, సజ్యోతిషమివ=నక్షత్రములతోఁ గూడిన దానివలెను, తాం మేదినీం=ఆభూమిని, స్వాకృతిం=మంచిరూపము కలదానివలెను, కుర్వాణా=చేయుచున్నదై, రత్నసంక్లృప్తే=రత్నఖచితమైనట్టియు, అలంకృతే=అలంకరింపబడిన, తులసీమంటపే=తులసివృక్షముల మంటపమందు, సర్వాన్ బుధోఘాన్=పండితసమూహమును, సంపూజ్య=గౌరవించి, శ్రీవరతనుధియా=పరదేవతా స్వరూపబుద్ధితో ఆనర్చ=పూజించెను.

తా—అంతట నాయక్షాంగన శుభ్రవస్త్రధారిణియై, యావునేతిదీపముల, రత్నాలంకృతంబగు తులసిమంటపమందమర్చి పరదేవతాబుద్ధితో పండితుల నచ్చట పూజించెను. కార్తీకద్వాదశికి విష్ణుమూర్తి క్షీరాబ్ధినుండి బృందావనజన్మంబగు తులసీ సన్నిధానంబున కేతెంచునుగాన నాదినమున తులసీమంటపమున నామలకఫలంబుల గోఘృతంబుచే దివ్వెలనుంచి, దానంబొసంగిన, నక్షత్రలోకముచేరుదురని పురాణ ప్రసిద్ధముగాన భక్తినమ్రురాలగు నాయక్షియిట్లొనర్చె.

శ్లో॥ ఏతద్దత్తద్రవిణభరతస్తానితాని ప్రశస్తా
న్యాదేయన్యాభరణకరణాన్య శ్రీమంచిశమోఽభూత్
కార్త్స్న్యంతత్ర ద్వ్రతనుమహితో ద్యాపనంచేతితేషా
మామోదోద్యత్ప్రణయవచనా న్యాబభూవుస్సమంతాత్ ॥

గీ॥ యక్షుఁడొసఁగినధనముల, నందిబుధులు
శ్రేష్ఠమైనట్టిభూషలు చేకొనంగ
దగినవీకఁ జాలఁ సద్వ్రతో, ద్యాపనంబు
సలుపుఁడనుచును ప్రేమవా, క్స్రరణిసనిరి॥ ౭౦

అర్థము — శితత్ = ఈయజ్ఞునిచేతను, దత్త = ఇవ్వబడిన, ద్రవిణభరతః = ద్రవ్యాతిశయమువలన, తానితాని = ఆయా, ప్రశస్తాని = శ్రేష్ఠములగు, ఆభరణకరణాని = అలంకారసామగ్రిలు, ఆదేయాని = గ్రహింపతగినవి, అశ్రమం = సుఖముగా, విశ్రమః = విశ్రాంతి, అభూత్ = ఆయెను. తత్త...... ద్యాపనం, తత్తత్ = ఆయా, వ్రత = వ్రతములయొక్క, సుమహిత = శ్రేష్ఠమైన, ఉద్యాపనం = సమాప్తికర్మవిశేషమును, కార్యం = చేయతగినది. ఇతి = ఈప్రకారము, తేషాం = ఆబ్రాహ్మణులయొక్క, ఆమోదోద్యత్ప్రణయవచనాని, ఆమోద = సంతోషముచేత, ఉద్యత్ = ప్రకాశించుచున్న, ప్రణయవచనాని = స్నేహవాక్యములు, సమన్తాత్ = అంతటను, ఆబభూవుః = వ్యాపించినవి.

తా — ఈయజ్ఞుడు సత్కరించిన ద్రవ్యముచేనాయాయాభరణములకు గావలసిన రత్నాదుల సంపాదింపవచ్చుననియు, సుఖవిశ్రాంతి గలిగెననియు, తాము ప్రారంభించిన వ్రతములకుద్యాపనంబు జేసికొనవచ్చుననియు, నాబ్రాహ్మణులు పలువిధముల సంతోషవాక్యములను పలికిరి.

శ్లో॥ అన్నైర్నానాఫలరసహితై రద్భుతాస్వాదరూపై
ర్నానాభక్ష్యైరతిరసభరైః స్సాధుసంభుక్తశిష్టైః
తాదృక్పత్నీకరకలనతస్సంభృతైరాస్వాదభాగ్భి
ర్భుక్త్వాప్రీతింసముగమదసౌ నిర్జరాధీశమాన్యః॥

చ॥ ఫలరసమిశ్రితంబుమృదు భక్ష్యమనోహరమార్యభుక్తమై
లలితరసప్రపూరశుభ లక్షణలక్షితమైనయన్నముల్
వలపులుగుమ్మరించుతనభార్య స్వహస్తముచేనొసంగమి
క్కిలిచవులుప్పతిల్లమదిఁ గ్రొల్లురకఁ భుజియించెప్రీతిమై॥ ౭౧

అర్థము — నిర్జరాధీశమాన్యః = ఇంద్రపూజ్యుడైన, అసౌ = ఈయజ్ఞుడు, నానాఫలరసహితైః = అనేకములగు ఫలరసముతోకూడినట్టియు అద్భుతాస్వాదరూపైః = వింతలైనరుచులు గలిగినట్టియు, నానాభక్ష్యైః = అనేకపిండివంటలచేతను, అతిరసభరైః = మిక్కిలిరసవంతములైనట్టియు, సాధుసంభుక్తశిష్టైః = బ్రాహ్మణభో

జనశేషములైనట్టియు అన్నైః=అన్నములచేతను, తాదృక్......కలనతః, తాదృక్=అట్టిపతివ్రతయగు, పత్న్యా=భార్యయొక్క, కరకలనతః=హస్తసంసర్గమువలన సంభృత=సంపాదింపబడిన, ఆస్వాదభారైః=రుచ్యతిశయములతో, భుక్త్వా=భుజించి, ప్రీతిం=సంతోషమును, సమగమత్=పొందెను.

తా—అనేకములైన షడ్రసములచె రుచ్యములై, క్రొత్తచవులనొప్పుచున్నట్టియు, నానాభక్ష్యములతో గూడినట్టియు, మిక్కిలి రసవంతములైన అన్నములను, బ్రాహ్మణ భోజనానంతరమున, భార్యతనకు స్వయముగా నొసంగుటంజేసి మిక్కిలి రుచులూరుచు భుజించి యాయక్షుడు సంతోషమును జెందెను.

శ్లో॥ భర్త్రాసత్రాసమభిమతమా స్వాద్యతత్తత్పదార్థా
న్విశ్లేషే యేమనసివిహితాః ప్రక్రమాఃభోగపాళేః
తాన్తానన్యానపికుముదినీబంధుభానూంశ్చకోరీ
వాసంకోచంసమనుభవతిస్మాథయక్షీసతీడ్యా॥

మా॥ పతితోఁగూడి యభీష్టవస్తువులనాస్వాదించిసంతృప్తిగాఁ
బతివిశ్లేషమునన్మనోభవములై వర్ధిల్లువాంఛాళినా
సతియక్షేశ్వరినిర్విశంకముగనా, చంద్రాతపంబున్ జకో
రితమిగా గోరుయట్లుగోరెనుమదిన్ రేకెత్తసంతోషముల్॥ ౭౨

అర్థము—అథ=అనంతరము, సతీడ్యా=పతివ్రతలచేస్తుతింపబడిన,యక్షీ=యక్షాంగన, భర్త్రాసత్రా=భర్తతోకూడా, సమభిమతం=ఇష్టమువచ్చినట్లు, తత్తత్పదార్థాన్=ఆయాపదార్థములను, ఆస్వాద్య=భుజించి, విశ్లేషే=వియోగకాలమందు, మనసి=మనస్సునందు, భోగపాళేః=అనుభవపరంపరలయొక్క, యేప్రక్రమాః=విరీతులు, విహితాః=తలంపఁబడినవో, తాంస్తాన్=ఆయారీతులను, అన్యానపి=ఇంకనితరములనున్నూ, కుముదినీబంధుభానూన్=చంద్రకిరణములను, చకోరీవ=చకోరాంగనవలె, అసంకోచం=నిశ్శంకముగ, సమనుభవతిస్మ=అనుభవించినదాయెను.

తా—తరువాత నాయక్షాంగన, తనభర్తతోఁగూడ నాయాపదార్థముల యథేచ్ఛగ భుజించి, విరహదశయందు వారన్యోన్యమూహించుకొనిన నాయాసంభోగ సమయ వ్యాపారముల, ఆలింగనాదులనుట, చకోరాంగన తనకు జీవనాధారంబగు చంద్రకిరణంబులవలె నసంకోచంబుగ నాప్యాయతతో ననుభవించె, చకోరపక్షులు వెన్నెలమెక్కి బ్రతుకుగాంచునని ప్రసిద్ధి.

"విశ్లేషే మనసివిహితాః" అనునది కాళిదాసోత్తరమేఘంబున "పశ్చాదావాం విరహగళితంతంతమాత్మాభిలాషం నిర్వేక్ష్యావః పరిణతశరచ్చంద్రికాసు క్షపాసు" అనుయక్షవాక్యార్థసిద్ధి సమకూరినట్లు తెలియజేయుచున్నది.

శ్లో॥ పరశ్వస్స్వంద్రష్టుంసముపగతమేతంస్వవిహితా
పదస్సమ్ముక్తంతంపరముదగధీశఃప్రణయతః
సమాలింగ్యప్రేమ్ణామణిమహితపీఠేపరిజన
ప్రణీతేసంవేశ్యప్రియవచనమూచేసఖిధియా॥

ఉ॥ మూఁడవనాఁడు యక్షుఁడు, ప్రభుండగు కిన్నరనాథు భక్తిచే
జూఁడఁగఁబోవయక్షుని విశుద్ధమనస్కుని, శాపముక్తునిన్
వేడుకఁ గౌఁగలించుకొని పీఠమునిచ్చి ప్రియోక్తులిమ్ముగా
నాడెను ప్రేమసూచి ప్రణయాత్మత నాదరభావపద్ధతిన్॥ 23

అర్థము—ఉదగధీశః=కుబేరుడు, పరశ్వః=మూడవనాడు, స్వం=తనను, అనగా కుబేరుని, ద్రష్టుం=చూచుటకు, సముపగతం=వచ్చినట్టియు, స్వవిహితాపదః=తానిచ్చిన శాపమునుండి, పరం=మిక్కిలి, సమ్ముక్త=విడువబడినట్టియు, ఏతం=ఈయక్షుని, ప్రణయతః=స్నేహముతో సమాలింగ్య=కౌఁగలించుకొని, పరిజనప్రణీతే = భటులచే తేబడిన, మణిమహితపీఠే = రత్నపీఠమందు, ప్రేమ్ణా = ప్రేమతో, సంవేశ్య = కూర్చుండబెట్టి, సఖిధియా = సహచరబుద్ధితో, ప్రియవచనం = ప్రియమైనవాక్కును, ఊచే = పలికెను.

తా—యక్షుడు తానువచ్చిన మూడవనాడు కుబేరదర్శనార్థమై జనగా నాకుబేరుడు శాపమునుండి విడువబడినవానిని కౌగిలించుకొని రత్నపీఠమందు కూర్చుండ

బెట్టి తనకుపరిజనుండైననూ ప్రేమాతిశయంబున సఖునిగాభావించి గౌరవపూర్వక ముగ ప్రసంగించెను. ఇందువలన ధర్మయుక్తులైన ప్రభువు లపరాధులయెడ కినుకవహించి శిక్షయొనర్చినను, దీర్ఘక్రోధులుగాక పశ్చాత్తప్తులయినయెడ, పరిజనులయందైన గౌరవభావముంచి సమయానుకూలముగ సన్మానించుచు వారియౌదార్యమున ప్రకటింతురనుట ప్రసిద్ధమగుచున్నది.

శ్లో॥ జిత్వాహ్యాక్షీకనికరం నిశినీరజాత
సందోహమిందురివ కామవశాశయోఽపి
ధర్మేరతస్సమభవో భవభీతచిత్తో
జాయాపి తేపరశివ ప్రమదార్చితాత్మా॥

చ॥ రాతిరినీరజాతనికరంబులఁ జందురుఁడు వోలినింద్రియ
వ్రాతమునోంచితీవు, మునుపంచశరార్దితమానసుండవై
భీతిజనింపఁబుట్టువన వేమతిధర్మమునందుజిక్కఁగా
నీతరుణీలలామయును, నెమ్మదిశ్రీసతి సేవఁ జేసెడిఁ॥ 24

అర్థము—ఇందుః = చందురుఁడు, నిశి = రాత్రియందు, నీరజాతసందోహమివ = పద్మసమూహమువలె, హ్యాక్షీకనికరం = ఇంద్రియసమూహమును, కామవశాశయోపి = మన్మథాధీనుడవైనప్పటికి, జిత్వా = ఒయిచి, భవభీతచిత్తః, భవ = పునర్జన్మవలన, భీత = జడిసిన, చిత్తః మనస్సుకలవాడవై, ధర్మే = ధర్మమందు, రతః = ఆసక్తుడవు, సమభవః = అయితివి, తేజాయాపి = నీభార్యయున్నూ, పరశివప్రమదా=ఆపరదేవతయందు, అర్పిత=ఉంచబడిన, ఆత్మా=మనస్సుకలదై, ఆసీత్ =ఉండెను.

తా—మున్ను కామవశుడవై, నియతకార్యముల నెరవేర్పకుండుటచే, క్షీతుడవయ్యును, వియోగసమయంబున పాపభీతిచే ధర్మరతుండవై, పగలత్యంతవికాసము జెందియున్న పద్మములను రాత్రిచంద్రుడు ముకుళింపఁజేసినట్లు, ప్రకృతికిలోనై యథేచ్ఛగ కామానుషంగంబులగు నింద్రియములనిగ్రహించి కృతార్థుండవైతివి.

నీసతియు సతీధర్మావలంబ్యురాలై సకలదేవతాధ్యానామోద పరవశాత్మురాలై కాలం బుగడపి కీర్తినిగాంచె.

ఇట్టితని ప్రసంగమువలన, మేఘసందేశమున ప్రథమశ్లోకమున "కాంతావిరహగురుణా స్వాధికారాత్ప్రమత్తః" యని చెప్పుటవలన నీశాపమీయక్షుడు మోహవశుడై భార్యాసంగంబు విడువనొల్లకుంటచే గలిగెననుట స్పష్టీకృతంబగుచున్నది. కావుననియ్యది పద్మపురాణాంతర్గతమగు నొకకథను తలపించుచున్నది. పూర్వమొకప్పుడు ధననాథుడీశ్వరపూజాతత్పరుండై సేవకుడైననొక యక్షునిపుష్పంబులకై పనుప నాతండు కామావేశచిత్తుండగుట ప్రియాసంగమ వ్యాపారంబున మైమఱచి స్వామికార్యంబు తడవుసేసి, పూజాకాలమతిక్రమింప బుష్పంబులంగొని చన నాయక్షేశుడీతని వృత్తాంతమారసి, తనపూజాభంగంబు కావించుటకు కారణంబు వీనిమోహాతిశయంబుగాన, నవిశమింప నొకవత్సరంబుపట్టి మోహాస్పదంబగు భార్యనెడబాయు నటుల శాపంబొసంగెనని చెప్పఁబడియున్నది.

శ్లో॥ అన్యోన్యప్రణయభరేణచక్రవాక
ద్వంద్వస్యేవహియువయోస్సదాశయేన
సంప్రాప్తోభవమసికాంతనిత్యధర్మా
జానేహంతవకిమభీప్సితంవదాద్య॥

గీ॥ జక్కవలదోయివలెపరస్పరముమీరు
ప్రేమగలిగియువిరహంపు వేళలందు
గడపినారలుసద్వృత్తి గానసంత
సించినాఁడనుమీకోర్కె జెప్పుమిపుడు॥ ౭౫

అర్థము—అన్యోన్య=ఒండొరులయందలి, ప్రణయభరేణ=స్నేహాతిశయముచేత, చక్రవాకద్వంద్వస్యేవ=చక్రవాకమిథునమునకువలెనే, యువయోః=మీయొక్క, సదాశయేన=సదభిప్రాయముచేతనే, సంప్రాప్తః=సంతోషించినవాఁడను, అభవం=అయితిని, కాంత=యోగ్యమైన, నిత్యధర్మా=నిత్యమైనధర్మముకలవాఁడవు, అసి=అయితివి, ఇతి=ఈలాగునని, జానే=నేనెఱుంగుదును, తవఈప్సితం=నీకోరిక, కిం=ఏమి, అద్య=ఇప్పుడు, వద=చెప్పుమా.

తా—మోహాతిశయంబున వియోగమందును, పరాంగనా సంగబుద్ధియు, పరపురుషాభిలాషయు లేక, చక్రవాక మిథునమువలె నన్యోన్యప్రేమగలిగి కష్టకాలమును గడపిన మీరిద్దఱి యోగ్యతను సంతసించితిని. కావున మీయభీప్సితము నెరవేర్చెద, నెద్దియో చెప్పుము.

శ్లో॥ ఉదితస్త్వితి తేనస ప్రమోదావృతచిత్తః పునరేవ మేన మూచే
అనుజీవిని యంతృతా నృపాణా ముచితా దేవసహస్వ మేపరాధం॥

గీ॥ పలుకనిట్లు కుబేరుండు స్వాంతమందు
యక్షుఁడానందమున మున్ని యని యెఱుఁగ
నృపులకనుజీవివర్గంబు నియతికగును
తప్పుక్షమియించుమో దేవ ధన్యచరిత॥ ౭౬

అర్థము— తేన=ఆకుబేరునిచే, ఇతి=ఈప్రకారము, ఉదితస్తు=చెప్పబడిన వాడగుచునే, సః=ఆయక్షుఁడు, ప్రమోదావృతచిత్తః=సంతసించినమనస్సుకలవాడై, ఏనం=ఈకుబేరునిగూర్చి, ఏవం=ఈప్రకారము, పునః ఊచే=జవాబుచెప్పెను. నృపాణాం=ప్రభువులకు, అనుజీవిని=భృత్యులయందు, నియంతృతా=అధికారము, ఉచితా=తగినది. దేవ=ఓప్రభువా, మే=నాయొక్క, అపరాధం=తప్పును, సహస్వ=క్షమింపుమా.

తా—కుబేరుడిట్లు చెప్పగా నాయక్షుడు సంతోషించినవాడై, ప్రభువులకు భృత్యులయందు సర్వాధికారముగలదు కావున నాతప్పుక్షమించుటయే నాకువరం బొసగుటయనిచెప్పె.

శ్లో॥ తవచరణాంబుజానుసరణం శరణం భవతాత్సధామమ
త్వయి సదయే నను స్తమపి మే కర కేతనకల్పకం నకిం
ఇతి వినయేన వక్తరి పరం ద్విగుణీకృత కామణీభర
స్వమిదము వాచ వాచమధరీకృత సౌధఝరీ

చ॥ తావకపాదసేవయెహితంబొనరించుతమాకుసర్వదా
దేవభవద్దయామహిమ, దీనునిహస్తమెలోకపంక్తికిఁ
దావలమౌనుగాదె, యనఁదద్దయుఁ బ్రేముడియక్షుఁ జూచి సం
భావనఁ జేసివాక్సుధలవారిగఁ బాఱఁగఁ జేసివానిపై ॥ ౨౨

అర్థము—తవ=నీయొక్క, చరణాంబుజానుసరణం=పాదపద్మసేవయే, శరణం=రక్షణము, మమ=నాకు, సదా=ఎల్లప్పుడు, భవతాత్=అగుగాక, త్వయి=నీవు, సదయే=దయగలవాడవగుచుండగా, సమస్తమపి=సర్వమును, మే=నాకు, కరకేతనకల్పకం=చేతియందలిధ్వజమువంటిది, నకిం=కాదా, ఇతి=ఈప్రకారము, వినయేన=వినయముచేత, వక్తరి = ఆయక్షుడు చెప్పిన వాడగుచుండగా, పరం=మిక్కిలి, ద్విగుణీకృతకారుణీభరః, ద్విగుణీకృత=రెట్టింపబడిన, కారుణీభరః=దయాతిశయముగలవాడై, ఇదం=ఈప్రకారముగా, అధరీ......ధురీం, అధరీకృత=తిరస్కరింపబడిన, సౌధర్ఝురీ=అమృతప్రవాహముయొక్క, రమా=సంపత్తుయొక్క, ధురీం=భారముకలిగినట్టి, వాచం=వాక్కును, ఉవాచ=పలికెను.

తా—నీపాదపద్మములే నాకురక్షకమగుగాక, మీయనుగ్రహము కలదేని సర్వము నాకు హస్తగతమేకదాయని యిట్లువినయ నమ్రుడగు నాయక్షునిజూచి, మిగులదయకలవాడై యమృతంపు సోనలనీసడించు మాటలచే నిట్లనియె.

శ్లో॥ మదుదంచితదుస్సహార్తిశిక్షా మనుమన్యాత్మనిమామకీనసేవాం
ప్రతికామయసేతతోఽత్రమాభూత్పరతంత్రత్వమితః ప్రభృత్యవన్యాం॥

గీ॥ నేనొసంగినదుస్సహార్తిశిక్ష
ననుభవించియుమఱినా, యాజ్ఞనుండ
దలఁచినాఁడవునీకిఁకఁ, గలుగకుండు
గాతఁబరతంత్రతమీఁభువి, ఘనగుణాఢ్య॥ ౨౩

అర్థము— మదుదం......శిక్షాం, మత్=నాచేతను, ఉదంచిత=కల్పింపఁబడినట్టి, దుస్సహ=సహింపరాని; ఆర్తి=విరహబాధగల, శిక్షాం=శిక్షను, అనుమ

న్య=అంగీకరించి, ఆత్మని=మనస్సునందు, మామకీనసేవాం=నాసేవను, ప్రతి=పై పరీత్యముచే మరల కామయసే=కోరుచున్నావు, తతః=అందువలన, అత్రైవ న్యాం=లోకము ఇతఃప్రభృతి=ఇది మొదలుకొని, పరతంత్రత్వం=భృత్యత్వము, మాభూత్=లేకపోగాక.

తా—నీకు బాధాకరమైనను నేవిధించిన శిక్షననుభవించియును తిరిగి నాసేవ నేగోరుచుండుట నీవినయసౌజన్యాదుల వెల్లడించుచున్నది. కావుననిది మొదలు నీకు సేవావృత్తి మూలకమగు పరతంత్రము లేకుండునట్లు వరంబొసంగితి.

శ్లో॥ సఖ్యుర్భావేనైవమేవప్రహృష్టః
కోశాగారాన్మామకీనాద్ధనాని
గృహ్ణన్నిష్టాన్యేవభూయాంసినిత్యం
సాకంప్రేయస్యాత్రివర్గంస్వదస్వ

తే॥ ఇచ్చవచ్చినధనమును॥పుచ్చుకొనుము
నాధనాగారమునని దె॥నాకుహితుఁడఁ
వగుచుఁబ్రియురాలితోఁగూడి॥యనుభవింపుఁ
ధర్మకామార్థములనెల్లఁదనివిదీర॥ 25

అర్థము—సఖ్యుర్భావేన=స్నేహితధర్మము చే, ఏవమేవ=ఈప్రకారముగానే, ప్రహృష్టః=సంతోషించినవాడవై, మామకీనాత్=నాదైనటువంటి, కోశాగారాత్=భాండాగారమునుండి, ఇష్టాన్యేవ=ఇష్టమువచ్చినట్టి, భూయాంసి=అనేకములైనట్టియు, ధనాని=ధనములను, గృహ్ణన్=తీసుకొనుచు, ప్రేయస్యాసాకం=భార్యతోకూడా, త్రివర్గం=ధర్మకామార్థములను, స్వదస్వ=పొందుమా.

తా—నాతోనిట్లు స్నేహభావము నేపూని 'సేవకావృత్తివిడిచి యనుట' నాధనాగారమునుండి నీకిచ్చవచ్చిన ధనముం జేకొని యథేచ్ఛగ యనుభవించుచూ నీభార్యతో గూడి సుఖములబడయుము.

శ్లో॥ యక్షనాథవచనంనిశమ్యతత్సంప్రహృష్టహృదయోవదత్సు
కోపబీజమివభాతితేదయావాక్యమాకలనతఃకరోమికిం॥

క॥ వినియక్షుండై లబిలుం
డనువాక్యము మోదమంది, యయ్యాదయని
ట్లనుటయుఁగినుక యెయ్యది నే
ననుకొని యెన నేమిసేయు*నొనాకని యోఁ! ౮౦

అర్థము—తత్=ఆ, యక్షనాథవచనం=కుబేరవాక్యమును, నిశమ్య=విని, సంప్రహృష్టహృదయః=సంతోషించినవాడై, పునరవదత్=తిరిగిపలికెను, ఆకలనతః=విచారింపగా, తే=నీయొక్క, దయావాక్యం=దయచెచెప్పుట, కోపబీజమివ=కోపమేకారణముగాగలదెగ, భాతి=కనుపడుచున్నది. కింకరోమి=ఏమిచేయుదును.

తా—యక్షుడా కుబేరుని వాక్యమువిని. యల్పుడనైన నాకిట్టిస్వాతంత్ర్యము కల్పించుట మొదలుగాగల వరంబులొసఁగుట నాగ్రహముచేతనేమోయని భయపడుచుంటి నేమిచేయగలనని వినయముతోపలికె.

శ్లో॥ ఇతివదత్యనుజీవినియక్షరాట్ప్రహసితాననఏవజగాదసః
నృపవచఃకరణంహ్యనుజీవినాంసుకృతవత్కురుమేవచనంసఖే॥

తరల॥ పలుకనిట్టులభృత్యుఁడానర, వాహనుండును. మోమునన్
మొలకలెత్తఁగనవ్వుయక్షుని. మోముగాంచివచించెభృ
త్యులకురాజనిదేశకృత్యమె, యొప్పుపుణ్యమొసంగనే
బలికినట్టులఁజేయుమిత్రమ, వాదమేలను మానుమీ॥ ౮౧

అర్థము—ఇతి=ఈప్రకారము, అనుజీవిని=భృత్యుడు, వదతి=చెప్పినవాడగుచుండగ, సః=ఆ, యక్షరాట్=కుబేరుడు, ప్రహసితాననఏవ నవ్వుమొగముకలవాడగుచునే, జగాద=పలికెను. అనుజీవినాం=భృత్యులకు, నృపవచఃకరణం=రాజా

జ్ఞచేయుట, సుకృతవత్=పుణ్యకర్మచేయుటవంటిది. గనుక సఖే=స్నేహితుడా, =నాయొక్క, వచః=వాక్కును, కురు=చేయుము.

తా—ఆయక్షుని మాటలువిని నవ్వుచు, నాకుబేరుడు వానితో భృత్యులు ప్రభుల మాటవినుట యుక్తము. నేజెప్పినచొప్ప బ్రవర్తింపుమని పలికె.

ఇతినిగదితమాకర్ణ్యభర్తు
ర్నియమనముత్తమగాత్రతః ప్రగృహ్య
ప్రముదితహృదయఃప్రవిశ్యగేహం
సమవదదాత్మవధూంసమగ్రమేవ

ఇటులఁజెప్పఁగవిని చుయక్షేశునాజ్ఞ
మౌళిధరియించిమోదాబ్ధిమగ్నుఁడగుచు
వేగనిలుసేరిప్రియురాలు, వినఁగఁగిన్న
రేశుపలుకులు, వినుపించె, నిమ్ముగాఁలుకే ౭౦

అర్థము—ఇతి=ఈప్రకారము, భర్తుః=కుబేరునియొక్క, నిగదితం=మాటను, ర్ణ్య=విని, నియమనం=ఆకుబేరాజ్ఞను, ఉత్తమగాత్రతః=శిరస్సునందు, ప్రగృహ్య=గ్రహించి, ప్రముదితహృదయః = సంతోషించిన మనస్సుకలవాడై, ం=గృహమును, ప్రవిశ్య=ప్రవేశించి, ఆత్మవధూం=తనభార్యనుగూర్చి సమగ్ర=సంపూర్ణముగ, ఈవృత్తాంతమును, సమవదత్=చెప్పెను.

తా—ఆకుబేరునిపలుకులువిని వానియాజ్ఞతలనిడుకొని, సంతోషముతో నింటి ఱు తనభార్యకీ వృత్తాంతముం జెప్పెను.

తదాగాకలనాత్సరంముదితయాసఖ్యాసమంధర్మతః
ప్రాతస్స్నానవిధింవిధాయవిధివన్నిర్వ్యాతవాగ్దేవతః
త్రైవర్గేవిహితాదరస్సమరుచిస్స్వాత్మానురూపక్రియా
ప్రాహిత్యాంచితయోగ్యతావిలసితఃకాలంనినాయాద్భుతం

॥ య్యనుకూలకించుటకు దాన్వితమైనపడంతిగూడి చోదత్స్న
స్నానముఁ జేసి నిత్యములు శాస్త్రవిధిన్ నెరవేర్చి వాక్సతీ
ధ్యానముఁ జేయుచున్ ద్రిపురుషార్థసముచిత కార్యసక్తుఁడై
నూనుగఁ గాలమున్గడిపె విబుధ్యులు మోదముఁబొడమెచ్చఁగన్

అర్థము—తద్వాగాకలనాత్=ఆమాటవినుటవలన, పరం=మిక్కిలి ముదితయా=సంతోషించిన, సభ్యాసమం=భార్యతోకూడా, ధర్మతః=విధివలన, ప్రాతః స్నానవిధిం= ప్రాతస్నానకృత్యములను, విధాయ=నిర్వర్తించి, విధివత్=యథ శాస్త్రముగానిధ్యాతా=ప్రార్థింపఁబడిన, వాగ్దేవతః=సరస్వతికలవాఁడై, త్రివర్గే= ధర్మార్థకామములయందు, విహితాదరః=మిక్కిలి ఆదరముకలవాఁడై, సమరుచిః= సమానమైనయాసక్తియుఁగలవాఁడై, స్వాత్మ ... విలసితః, స్వాత్మ=తనమనస్సున కు, అనుకూల=తగిన, క్రియా=కర్మలయొక్క, సాహిత్యా=కూడికచే, అంచిత= ఒప్పుచున్న, యోగ్యతా=మంచితనముచేత, విలసితః=ప్రకాశించుచున్నవాఁడై, అద్భుతః=ఆశ్చర్యమగునట్టుగా, కాలం=కాలమును, నినాయ=గడపెను.

తా—అభర్తచెప్పిన మాటలనువినిమిగుల సంతసించిన భార్యతోగూడయ థాశాస్త్రముగ ప్రాతస్నానాదికృత్యముల దీర్చివాగ్దేవినుపాసించువాఁడై, ధర్మార్థ కామములయందు సమానమగు ఆసక్తితో, తాఁ యనుష్ఠానంబుల కనుగుణ్యంబు గు ప్రవర్తనగలవాఁడై ఇతరులకాశ్చర్యకరమగు నట్లుకాలక్షేపముఁజేసెను.

ఇతి శ్రీ కోరాడ రామచంద్ర కృత "ఘనవృత్త" నామ్ని మహాకావ్యే

ద్వితీయస్సర్గః

ఇది శ్రీ కోరాడ రామచంద్రకృతమగు "ఘనవృత్త"
మహాకావ్యంబు రెండవసర్గము.

